# అరుణతార

సాహిత్య, సాంస్కృతిక మాసపత్రిక

ARUNATARA

సంపుటి: 44 సంచిక: 10 హైదరాబాద్ 330 నవంబర్, 2016 పేజీలు: 68 వెల: రు. 20





## వందేళ్ళ బోల్షవిక్ విప్లవానికి జేజేలు



7 నవంబరు 2016న సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో బోల్షివిక్ విప్లవానికి నూరేళ్ల సందర్భంగానూ,
బెజ్జంగి అమరుల సంస్మరణలోనూ జరిగిన బహిరంగ సభ దృశ్యాలు






(330)

అరుణతార
సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

సంపుటి : 44 ✦ సంచిక : 10 ✦ నవంబర్, 2016 వెల : రు. 20/-

*సంపాదకీయం 1*

# నూరేళ్ల బోల్షివిక్ విప్లవం

ఈ నవంబర్ 7కు రష్యా విప్లవానికి నూరేళ్లు. మానవ జాతి చరిత్రలో మొట్ట మొదటి కార్మికవర్గ రాజ్య స్థాపన జరిగిన రోజు. కార్మిక వర్గం తన రాజ్యాధికారం కోసం చేసిన విప్లవం అది. అంతక ముందు ప్యారిస్ కమ్యూన్ అనుభవం ఉన్నప్పటికీ కార్మిక వర్గ నియంతృత్వం కింద సోషలిజాన్ని నిర్మించడానికి జరిగిన మహత్తర ప్రయత్నం అది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో పొడసూపిన శుష్క పితృదేశ భక్తిని చీల్చుకొని మన మహోపాధ్యాయుడు కామ్రేడ్ లెనిన్ నాయకత్వంలో యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చి రష్యన్ ప్రజలు నవంబర్ విప్లవాన్ని విజయవంతం చేశారు. తాము నిర్మించుకుంటున్న సోషలిజాన్నేగాక మానవజాతి భవితవ్యాన్ని కాపాడటానికి రెండో ప్రపంచ సంగ్రామంలో మన ప్రియతమ నాయకుడు కామ్రేడ్ స్టాలిన్ నేతృత్వంలో రెండు కోట్ల మంది రక్త తర్పణ చేసి కమ్యూనిస్టు త్యాగ నిరతిని చాటి చెప్పారు.

ఇరవయ్యో శతాబ్దంలో బలహీనమైన పెట్టుబడిదారీ విధానమున్న వ్యవసాయక రష్యాలో బోల్షివిక్ విప్లవం జరిగితే.. అత్యంత వెనుబడిన వ్యవసాయక చైనాలో నూతన ప్రజాస్వామిక విప్లవం విజయవంతమైంది. పెట్టుబడిదారీ విధానపు తీవ్ర సంక్షోభంలోంచి పెట్టుబడికి శత్రువు అయిన కార్మిక వర్గం సంఘటితమై విప్లవాల వెల్లువ సృష్టిస్తుందనే మార్క్స్, ఎంగెల్స్ సాధారణ సూత్రానికి భిన్నంగా అనేక చారిత్రక ప్రత్యేకతల్లోంచి, స్థానిక సమాజాల సంక్షోభాల నుంచి ఈ విప్లవాలు విజయవంతమయ్యాయి. దీనికి అక్కడి నాయకత్వ పాత్రతోపాటు విప్లవం రాగల దేశీయ పరిస్థితుల వల్ల కూడా ప్రజలు విజయం సాధించారు. వలస దేశాల్లో విప్లవాల గురించి లెనిన్, స్టాలిన్‌ల అవగాహనలను విస్తరించి కామ్రేడ్ మావో సే టుంగ్ చైనాలో నూతన ప్రజాస్వామిక విప్లవ దశను ప్రతిపాదించాడు.

విప్లవానంతరం సోషలిస్టు నిర్మాణ ప్రయత్నంలో చైనా రైతులు, కార్మికులు ఎన్నో అద్భుత ప్రయోగాలు చేశారు. అయినా సమాజంలోనేగాక కమ్యూనిస్టుపార్టీ కేంద్రంలోనే పెట్టుబడిదారీ శక్తులు పెచ్చరిల్లడంతో 1966 మే 16న మావో మహత్తర శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవానికి పిలుపు ఇచ్చాడు. ఈ ఏడాది మే నెల నుంచి ఈ విప్లవ 50 ఏళ్ల కార్యక్రమాలు జరుగుతున్నాయి. ఇరవయ్యో శతాబ్దంలో బోల్షివిక్ విప్లవం, చైనా నూతన ప్రజాస్వామిక విప్లవం వలె చైనా సాంస్కృతిక విప్లవానికీ అత్యంత ప్రాధాన్యత ఉన్నది.

సోషలిస్టు దశలోనూ వర్గాలు ఉంటాయి.. వర్గాలు ఉన్నంత కాలం వర్గపోరాటం జరగాల్సిందే అనే మావో ఆలోచన మార్క్సిస్టు సిద్ధాంతానికి గొప్ప చేర్పు. సమాజంలోనే కాదు, పార్టీలోని రివిజనిస్టులను, పెట్టుబడిదారీ శక్తులను ధ్వంసం చేయడానికి సాంస్కృతిక, భావజాల విప్లవంగా సాగిన రెండో రాజ్యాధికార విప్లవం అది. కృశ్చేవ్ నాయకత్వంలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ చేపట్టిన వర్గ సామరస్య విధానానికి వ్యతిరేకంగా మావో నాయకత్వంలో జరిగిన గ్రేట్ డిబేట్ నేపథ్యంలో సాంస్కృతిక విప్లవం జరిగింది. ఆ ప్రేరణతోనే మన దేశంలో రివిజనిజాన్ని ఓడిస్తూ 1967 మే 23న నక్సల్బరీ పంథా ముందుకు వచ్చింది.

ప్రపంచ వ్యాప్తంగా పోరాటకారులు నూరేళ్ల బోల్షివిక్ విప్లవం నుంచి, చైనా విప్లవం(1949) నుంచి, యాభై ఏళ్ల చైనా సాంస్కృతిక విప్లవం నుంచి ఉత్తేజం పొందుతున్నారు. ఈ విప్లవాలు ఎలాంటి సమాజాల్లో, ఏ చారిత్రక పరిస్థితుల్లో జరిగాయో, లోపలా, బైటా ఎంత క్లిష్టమైన పరిస్థితుల్లో సోషలిస్టు నిర్మాణ ప్రయత్నాలు అక్కడ జరిగాయో, ఏ కారణాల వల్ల అవి చరిత్రలో కలిసిపోయాయో.. సరికొత్త విశ్లేషణ కోరుకుంటున్న కాలం ఇది. ఇక్కడ నిలబడి వలసానంతర సామ్రాజ్యవాద దశను పరిగణనలోకి తీసుకుంటూ ఇరవై ఒకటో శతాబ్దంలో విప్లవాలకు సన్నాహం జరుగుతున్నది. ఈ నూతన చారిత్రక రాజకీయార్థిక సాంఘిక ప్రపంచంలో విప్లవాలను విజయవంతం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ముఖ్యంగా గత విప్లవాల కంటే చాలా భిన్నంగా పరుచుకొని ఉన్న సాంఘిక జగత్తును పరిగణనలోకి తీసుకొని ఈ ప్రయత్నాలు సాగుతున్నాయి. విప్లవ లక్ష్యంలేని రివిజనిస్టులకు కేవలం ఇవి సంబరాలు చేసుకునే సందర్భాలే. నేల మీద నిలబడి, ప్రజల మధ్య జీవిస్తూ చరిత్రను తమ చేతుల్లోకి తీసుకొని దాన్ని కొత్త పునాదులపై పునర్నిర్మించాలనుకుంటున్న విప్లవశక్తులకు ఇవి వర్గపోరాట చర్చా సందర్భాలు. మార్క్సిస్టు లెనినిస్టు మావోయిస్టు సిద్ధాంత ప్రజ్వలనానికి మరోసారి కలిసి వచ్చిన అవకాశాలు.

సోషలిస్టు శిబిరం పతనమయ్యాక ఇక ప్రపంచ వ్యాప్తంగా తమకు అడ్డం లేదని విర్రవీగుతున్న పెట్టుబడిదారీ శక్తులను నిలువరించాల్సి ఉన్నది. సోషలిజమే ప్రత్యామ్నాయమని భూగోళమంతా వినిపించేలా ప్రపంచ విప్లవ శక్తులు ప్రకటించాల్సి ఉన్నది. చరిత్రలో కలిసిపోయిన సోషలిజాలను చూపి విప్లవం అవుట్ డేటెడ్ పొలిటికల్ ప్రోగ్రాం అనే వెర్రి ప్రేలాపనలకు దీటుగా 21వ శతాబ్దపు విప్లవాలు, సోషలిజాలు ఎలా ఉండబోతున్నాయో జనరంజకంగా ప్రచారంలో పెట్టాలి. రాబోయే నాలుగేళ్లలో చైనా సాంస్కృతిక విప్లవం, బోల్షివిక్ విప్లవం, చైనా విప్లవానికి 70 ఏళ్లు, నక్సల్బరీకి 50 ఏళ్లు, మార్క్స్ 200వ జయంతి, లెనిన్ 150వ జయంతి, విరసం 50 ఏళ్ల వంటి చారిత్రక సందర్భాలుగా రాబోతున్నాయి. సమకాలీన పరిస్థితుల్లో వీటన్నిటి అంతస్సూత్రంగా సోషలిజమే ప్రత్యామ్నాయం అనే నినాదాన్ని ఇప్పటికే విరసం ప్రచారంలోకి తీసుకొని వచ్చింది. రచయితల సంఘంగా సాహిత్య, మేధో రంగాల్లో బోల్షివిజాన్ని ఎత్తిపట్టడానికి విరసం పునరంకితమవుతోంది.

- పాణి

3

అరుణతార నిర్వహణ, శాశ్వత నిధుల కోసం మా ప్రకటన చూసి **ఒక విప్లవ సాహిత్య అభిమాని** - అమెరికా, రూ.1,00,000/-, **మామిడి హరికృష్ణ** -హైదరాబాద్ రూ.5,000/-, **ఎస్. లక్ష్మారెడ్డి** - గుంటూరు, రూ.28,000/-, **ఒక విప్లవ సాహిత్య అభిమాని** - కావలి, రూ.5,000/-, **గంటి సుధీర్** - చెన్నైయ్, రూ.10,000/-, **పుప్పల గోపాల్‌రావు** - హైదరాబాద్, రూ.2,000/-, **నరేందర్** - పెద్దపల్లి, రూ.5,000/-, **ఎన్.వి.ఎస్. నాగభూషణ్** - పాలకొల్లు, రూ.2,000/- విరాళంగా ఇచ్చారు. వీరందరికీ ఉద్యమాభినందనలు. - సం.

**ఎడిటర్**
దుప్పూరి వెంకట రామక్రిష్ణారావు

**రచనలు, విరాళాలు**
**పంపించాల్సిన చిరునామా:**
ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి,
హైదరాబాద్ - 500 040.

* కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్ ల ద్వారా
రచనలు పై చిరునామాకూ,
ఇ-మెయిల్ ద్వారా
**arunatara1977@gmail.com** కూ పంపవచ్చు

**కార్యాలయం:**
12-15-963, మాణికేశ్వరినగర్,
ఉస్మానియా యూనివర్సిటీ క్యాంపస్,
తార్నాకా, హైదరాబాద్-500007.

**సంపాదకవర్గం :**
**ఉజ్వల్, బాసిత్, కూర్మనాథ్**

**విరసం కార్యదర్శి చిరునామా**
**పి. వరలక్ష్మి**
5-1820, గీతాశ్రమం వీధి,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516 360.

**డి. టి. పి. అండ్ లే అవుట్**
**ఆర్. భాగ్యలక్ష్మి, డి. వైజయంతి**
**కవర్ డిజైన్ : పి. వరలక్ష్మి, ఆర్. భాగ్యలక్ష్మి**

**ఫొటోలు :**
**కె. బాల్‌రెడ్డి, గూగుల్ సైట్**

**Like Page:**
//viplava rachayitala sangham arunatara

**facebook :**
//viplava rachayitala sangham virasam

**Virasam website :**
*www.virasam.org,*
*www.virasam.in*
*www.arunatara.in*

గమనిక : మిత్రులారా, కామ్రేడ్స్! అరుణతార డిటిపి, డిజైనింగ్, ప్రింటింగ్, పోస్టింగ్, రవాణా ఇలా అన్ని ఖర్చులు చాలా పెరిగిపోయాయి. అనివార్య పరిస్థితులలో విడి ప్రతి వెలను ఫిబ్రవరి 2016 సంచిక నుంచి రూ. 20 కు పెంచవలసి వచ్చింది. ఇది గమనించగలరు. ఎప్పటిలానే మీ ఆదరాభిమానాలను, సహకారాన్ని ఆశిస్తున్నాం. అలాగే ఫిబ్రవరి 2016 సంచిక నుంచి అరుణతార సంచికల క్రమాన్ని సంపుటి 44 గాను సంచిక 1 గాను సరిచేసాం. ఈ విషయాన్ని గమనించగలరు. - సం.



## అరుణతార చందాదారులకు విజ్ఞప్తి!

ఏ కారణం చేతనైనా మీకు అరుణతార అందకపోతే పిన్‌కోడ్‌తో సహా మీ చిరునామాను మరోసారి **8500809250** మొబైల్ నంబర్‌కు మెసేజ్ పెట్టగలరు. గమనిక : ఈ నెంబర్ కేవలం మెసేజ్‌ల కొరకు మాత్రమే! - సం.

# విషయసూచిక



**www.virasam.org అంతర్జాల పత్రికలో అక్టోబరు సంచికల్లో వచ్చిన రచనల విషయసూచిక:**

## సవరణ

అరుణతార అక్టోబర్ సంచికలో 'తప్పని అవసరంగా రచన' అనే నా వ్యాసంలో ఒక పొరబాటు జరిగింది. రాహుల్ సుప్రసిద్ధ నవల 'ఓల్గా సే గంగా' పేరు(ఓల్గా నుంచి గంగకు) గంగ నుంచి యమునా తీరం వరకు అని వచ్చింది. అలాగే దాని అనువాదం ఆలూరి భుజంగరావు అని కూడా వచ్చింది. ఈ పుస్తకం అనువాదం చాగంటి తులసి. ప్రచురణకు ముందే ఇవి గుర్తించినా కరెక్షన్ చేయకపోవడంతో తప్పుగా వచ్చాయి.

విప్లవాభివందనాలతో..

పద్మకుమారి

* * *

సెప్టెంబర్ అరుణతారలో వరవరరావు రాసిన 'మహత్తర శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవం' వ్యాసంపై నా విమర్శ

- బి.ఎస్.రాజు

**1. వ్యాసం మొదటి పేరాలో మూడో పంక్తి :**

'మావో సే టుంగ్, కమ్యూనిస్ట్ పార్టీ దీనికి( జి.పి.సి. ఆర్ కు) నాయకత్వం వహించారు' అని ఉంది. ఇది నిజం కాదు. చైనా కమ్యూనిస్ట్ పార్టీలో మెజారిటీ దీనికి వ్యతిరేకం. కేవలం ఒక సెక్షన్ మట్టుకే దీనిని సమర్థించారు. (వింతేమిటంటే దీన్ని గట్టిగా సమర్థించిన వారే బహిష్కరణలకు గురవ్వడం). ఇలా ఎందుకనంటే రూపంలో అది శ్రామిక వర్గ కమ్యూనిస్ట్ పార్టీగా బయటకు కనిపించినా, సారంలో అది అప్పటికే దిక్కు మార్చిన పార్టీ కాబట్టి. ఇక మావో నాయకత్వం అన్నది రూపంగా కనబడ్డది నిజమే కానీ అది లెఫ్ట్-రైట్ల మధ్య ఊగిసలాటతో కూడుకున్నది. మింగుడుపడటం కష్టమేగాని, మావోనే మావోవాదు లను ఒక్కొక్కరిని పార్టీలోని పచ్చి రివిజనిస్ట్ శక్తులకు బలిపెట్టాడనేది. 'చెన్ పోడా' దగ్గర నుండి రెడ్-గార్డ్ మిలిటెంట్ నాయకత్వం, షాంగై కమ్యూన్ నాయకత్వాన్ని పూర్వపక్షం చేయడం వరకు, నిక్సన్‌తో చేతులు కలపడం వరకు కొనసాగింది. రివిజనిస్ట్ కుట్రలకు బలైపోయిన సిసలైన మావోయిస్టులు ఎందరో ఇప్పుడు చరిత్ర తవ్వుతుంటే బయట పడుతున్నారు. కమ్యూనిజం సాధనలో ఎన్నో సాంస్కృతిక విప్లవాల అవసరముందని మావో అన్నాడంటేనే, అప్పటికే చైనా కమ్యూనిస్ట్ పార్టీ ఒక నికార్సయిన కమ్యూనిస్ట్ పార్టీగా పతనమైనట్లే కదా! ఒప్పుకోవడం అంత తేలిక కాకపోవచ్చుగాని, మావోయే ఆఖరి దశలో మావోయిస్టు రైలు బండి దిగిపోయాడని ఇప్పుడు వెలుగు చూస్తున్న చరిత్ర చెబుతోంది.

**2. వ్యాసం రెండో పేరా చివరి పంక్తులు:**

'జి.పి.సి.ఆర్' కు ఈ దేశంలో నక్సల్బరీ ఉద్యమానికి లింకు కలుపుతూ 50 ఏళ్ళు పూర్తిచేసుకోబుతున్న ఈ ఉద్యమం 'జి.పి.సి.ఆర్' ప్రేరణతో వచ్చిందని" అంటూ నక్సల్బరీ పోరాటాన్ని ప్రారంభించిన వాడు చారు మజుందార్. ఈ నాటి మావోయిస్టు పార్టీ నిర్మాణానికి మూలపురుషులైన ఇద్దరిలో ఆయన ఒకరు. మరొకరు కామ్రేడ్ కన్నయ్య ఛటర్జీ. వాళ్లిద్దరూ గొప్ప నాయకులు, విప్లవ అధ్యాపకులు. మన దేశంలోని ప్రజాస్వామిక విప్లవ చరిత్రలో నక్సల్బరీ ఒక కొత్త ప్రారంభం" అని రాసేరు. ఇది చదివితే నాకు చిన్నపుడు బడిలో గాంధీ నెహ్రూలమీద చెప్పే పాఠం గుర్తొచ్చింది. గాంధీ ఒక మహాత్ముడు. మనదేశానికి స్వాతంత్రం తెచ్చినాడు. నెహ్రూ గొప్ప పండితుడు. దేశాన్ని ఎంతో ఉద్ధరించాడు అని ఈ పాఠం. ఈ వ్యాసానికి ఈ ప్రస్తావన అసందర్భం. ఈ ప్రస్తావన మరొక వ్యాసం రూపంలో, బహుశా "జి.పి.సి.ఆర్ - నక్సల్బరీ ఉద్యమం - మావోయిస్టు పార్టీ " అనే పేరుతో వస్తే న్యాయం జరుగుతుందనుకుంటా. అలాకాక ఇప్పటి వ్యాస సందర్భంలోకి దానిని ఈడ్చుకు రావడం అతుకు పెట్టినట్లుగ, బూర్జువా పొగడ్తలాగ ఉంది.

**3. వ్యాసం మూడు నాలుగు పేరాలు :**

అసలు ఈ పేరాల్లోని అంశాలు అలా ఎందుకు రాసేరో అర్థంకాలేదు. వరవర రావు ఈ పేరాల్లో ఇచ్చిన సమాచారం ద్వారా ప్రజలకు ఏమి చెప్పదల్చుకున్నారు? వారిని ఏ రకంగా ఎడ్యుకేట్ చేయ దల్చుకున్నారు? అనే సందేహం కలుగుతోంది. మూడో పేరా మొదట్లోనే '1966 మే 16న జి.పి.సి.ఆర్ ప్రారంభించాడు అని రాసేరు. అలాగే నాలుగో పేరా మొదట్లో ఇలా ఉంది: " అప్పటి కమ్యూనిస్ట్ పార్టీకి, చైనా పీపుల్స్

(మిగతా 42వ పేజీలో)

## పాఠకులకు మనవి

అరుణతారలో వస్తున్న రచనల మీద ఉత్తరాలు, సెల్ ఫోన్ మెసేజ్‌లు, ఎక్కువగా మెయిల్స్ వస్తున్నాయి. అయితే వాటిలో ఫలానా రచన బాగుందని మాత్రమే చాలా వరకు ఉంటున్నాయి. అప్పుడప్పుడు ఏదో ఒక రచన బాగా లేదని ముక్తసరిగా అభిప్రాయాలు వస్తున్నాయి. ఈ అభిప్రాయాలను అరుణతార తప్పక గౌరవిస్తోంది. అయితే ఒక రచన బాగున్నా, బాగలేకపోయినా ఎందుకు మీకు అలా అనిపించిందో కొంచెం వివరాలతో రాస్తే పత్రిక నిర్వహణకు, ఆ రచయితలకు కూడా ఉపయోగంగా ఉంటుంది. అరుణతారలో రావాల్సిన రచనలపై కూడా మీ సూచనలు ఇస్తే మరీ మంచిది.

సంపాదకవర్గం

## విరసం అంతర్జాల పక్ష పత్రిక

## www.virasam.org కి రచనలు పంపండి.

మిత్రులారా..

విరసం వెబ్ మాగజైన్‌ను సాహిత్య, విప్లవాభిమానులు ఆదరిస్తున్నందుకు ధన్యవాదాలు. కొన్ని రచనలను విరివిగా చదువుతున్నారు. వీడియోస్‌పట్ల చాలా ఆసక్తి చూపుతున్నారు. అయితే రచనల అవసరం చాలా ఉంది. కవిత్వం, వ్యాసాలు, అనువాదాలు, పుస్తకసమీక్షలు పంపించండి. సామాజిక సమస్యలపై ఎప్పటికప్పుడు విశ్లేషణ వ్యాసాలు రాయండి. అరుణతారకు రచనలు పంపించి సహకరించినట్లే అంతర్జాల పత్రికకు కూడా పంపించాలని మనవి. మీ రచనల కోసం ఎదురు చూస్తున్నాం.

**www.virasam.org team**

**site e-mail ID : virasam1970@gmail.com**

# రాజ్యం చేసిన ముప్పై తొమ్మిది హత్యలు

## పి.వరలక్ష్మి

ఎదురుకాల్పులు ఇప్పుడందరికీ అలవాటైపోయిన స్టోరీ. తెలుగు సినిమా ఫార్ములా లాగా అదే అరిగిపోయిన రికార్డు. అయితే ఇప్పుడు ఎన్ కౌంటర్ పేరుతో ఏకంగా 31 మందిని చంపి ఆంధ్రా ఒడిసా ప్రభుత్వాలు మనుషుల్ని వేటాడి చంపడంలో హద్దులన్నీ చెరిపేశారు. భోపాల్ పోలీసులైతే జైలు నుండి తప్పించుకున్నారని ఎనిమిది మంది రిమాండ్ ఖైదీలను అందరూ చూస్తుండగా కాల్చివేశారు. అక్టోబర్ 24 ఉదయం ఆంధ్రా ఒడిసా సరిహద్దు ప్రాంతంలో జరిగిన ఎన్ కౌంటర్లో 18 మంది మావోయిస్టులు చనిపోయారని వార్త వచ్చింది. తర్వాత రెండు రోజుల్లో ఆ సంఖ్య పెరుగుతూ పోయింది. అక్టోబర్ 29 నాటికి 34 దాకా పోయి చివరికి 31 మంది చనిపోయారని వారిలో 9 మంది ఆదివాసీలని తేలింది. కూంబింగ్ జరుగుతున్నదని పోలీసులంటూ వచ్చారు. శవాలను మల్కాన్ గిరి ఎస్.పి ఆఫీసు వద్దకు దఫదఫాలుగా చేరుస్తూ పోయారు. ఒక్కసారిగా అదుపులోకి తీసుకునో లేక వెంటాడుతూనో చంపుకుంటూ పోయారు. పోలీసులు మాటవరసకు నిజమైనా ఎదురుకాల్పులే అంటున్నా అక్కడ దాచడానికి ఏమీ లేదు. నిబంధనల ప్రకారం పోస్టుమార్టం ఎట్లాగూ చెయ్యరు. కనీసం మానవ ఆకారాలైనా బంధువులకు అప్పగించాలని అనుకోలేదు. మృతదేహాలను స్వాధీనం చేసుకోబోయిన బంధువులకు ఛిద్రమైపోయి, శరీర భాగాలు ఊడిపోతూ, పేగులు బైటపడిన ఆకారాలే కాదు స్తనాలు కోసేసిన మహిళల శరీరాలు, తల లేని మొండెం కూడా కనపడింది. మృతుల పేర్లు కూడా 10రోజుల తర్వాత మావోయిస్టు పార్టీ ప్రకటించేదాకా పూర్తిగా వెల్లడి కాలేదు. వాస్తవాలను దాచి అనేక అబద్ధాలను ప్రచారం చేయడంలో భాగంగా తప్పుడు పేర్లు, ఫొటోలు పత్రికలకిచ్చారు. మావోయిస్టు నాయకుడు రామకృష్ణ పోలీసుల అదుపులో ఉన్నాడని అనుమానం కలిగేలా పెద్ద హైడ్రామా నడిపి చివరికి ప్రజాసంఘాలు అబద్ధాలు ప్రచారం చేస్తారని ఎదురు ఆరోపణలు చేశారు.

ఇంత మానవ హననం జరిగినందున ప్రభుత్వం సమాధానం చెప్పాలని, చట్ట ప్రకారం నడుచుకుని విచారణ జరిపించాలని ప్రజాసంఘాలు రోడ్డెక్కితే పోలీసులు మావోయిస్టు వ్యతిరేక పోటీ ధర్నాలు నిర్వహించారు. కరపత్రాలు ముద్రించి పంచారు. ఎన్ కౌంటర్లు ఇట్లాగే జరుగుతాయి. పౌరహక్కుల గురించి మాట్లాడకూడదు. ప్రభుత్వం తరఫున పోలీసులు ప్రజల్ని చంపొచ్చు. రాజ్యాంగం నీడనే రాజ్యాంగాన్ని ఉల్లంఘిస్తూ సాయుధ శక్తితో పరిపాలించే ప్రభుత్వాలు, దాన్ని వ్యతిరేకిస్తూ ఆయుధాలు పట్టుకున్నవాళ్లను చంపవచ్చు ...దీనికి సాధికారత సాధించుకునే ప్రయత్నం. ఎక్కడా ప్రజాప్రతినిధులు మాట్లాడరు. నక్సలైట్లే దేశభక్తులని, నక్సలైట్ సమస్య సామాజికార్థిక సమస్యని, శాంతి చర్చలని సమయానుకూలంగా మాట్లాడుతూ వచ్చిన పాలకవర్గం, కార్పొరేట్ పెట్టుబడి కోసం ఇక తేల్చుకోవాల్సి వచ్చినప్పుడు, సమస్యను దారిమళ్లించి పోలీసు కోర్టులో నిలబెట్టింది. కాబట్టి పోలీసులే మాట్లాడతారు. పోలీసు భాషలోనే కాదు, తమ పరిధి చాలా విస్తరించింది గనక రాజకీయాలు, సిద్ధాంతాలు కూడా మాట్లాడతారు. ఇది జరుగుతుండగానే భోపాల్ ఎన్ కౌంటర్...

అక్టోబర్ 31 తెల్లవారుఝామున హై సెక్యూరిటీ జైలు గోడలు దాటి ఎనిమిది మంది విచారణ ఖైదీలు తప్పించుకున్నారు. దీపావళి రాత్రిని అవకాశంగా తీసుకుని వీళ్ళు ప్రణాళికను అమలుచేశారట. టూత్ బ్రష్ ను తాళంచెవిలాగా కట్ చేసుకుని, స్పూన్ లు, ప్లేట్లు దుప్పట్లు ఉపయోగించుకుని 32 అడుగుల జైలు గోడల్ని దాటారు. కాపలాగా ఉన్న గార్డు గొంతు కోసేశారు. సిసి కెమెరాలు పనిచేయలేదు కాబట్టి ఇవేవీ రికార్డు కాలేదు. అట్లా పారిపోయినవాళ్ల కొన్ని గంటల వ్యవధిలోనే ఎన్ కౌంటర్ అయిపోయారు. బాలీవుడ్ సినిమా కథలాగా ఉన్న ఈ ఘటనల క్రమం వెనక దాగి ఉన్న విషయం ఏమిటంటే ఈ ఎనిమిది మంది రిమాండు ఖైదీల కేసుల విచారణ ముగిసిపోబోతున్నది. నిర్దోషులుగా విడుదలయ్యే అవకాశాలు మెండుగా ఉన్నాయి.

ఎన్ కౌంటర్ తర్వాత బైట పడ్డ వీడియో, ఆడియోలలో వాళ్లందర్నీ పోలీసులు ఏకపక్షంగా కాల్చిచంపిన విషయం రికార్డయింది. "అందర్నీ లేపేయండి... అయిదు మంది చచ్చిపోయారు... మొత్తం ఎనిమిది మందీ చచ్చారు... కంగ్రాచ్యూలేషన్స్ సర్... అందరూ అయిపోయారు... వెరీ గుడ్, వెరీ గుడ్... మెమక్కడికి వచ్చేస్తున్నాం". ఇది వాకీటాకీల్లో పోలీసుల సంభాషణ. ఇది నిజమైన ఎన్ కౌంటరే అని పోలీసులు చెప్పనుబోతే స్వయంగా మధ్యప్రదేశ్ యాంటీ టెర్రర్ స్క్వాడ్ అధిపతి, 'నిందితులు ఆయుధాలేమీ పట్టుక్కొని లేరు. అయినా వాళ్ళను చంపడం అవసరం. వాళ్ళ వల్ల ప్రమాదం ఉంది. కొన్ని సందర్భాల్లో పోలీసులకు అలా చేయగలిగే అధికారం కూడా ఉండాలి' అని మీడియాతో మాట్లాడాడు.

నిందితులు ముస్లింలు, సిమి ఉగ్రవాదులని ముద్ర వేయబడిన వాళ్ళు కనుక ఈ హత్యలకు సాధికారత ఉంటుంది కూడా. ఈ హత్యలు అందరూ చూస్తుండగానే 'భారత్ మాతా కీ జై' హర్షాతిరేకాల మధ్య జరిగాయి. దేశభక్తి పేర ఇంతగా మత విద్వేషభావం పెచ్చరిల్లిపోయాక రాజ్యం, పోలీసులు ఏం చేసినా చెల్లుబాటవుతుంది. బతుకుతెరువుకు గ్యారెంటీ లేని నిత్య సమస్యల వలయంలో ఉన్న జనానికి ఫలానా వాళ్ళ వల్ల ప్రమాదం ఉంది అని చెప్తూ వస్తే, అది కూడా దేశం పేరో, మతం పేరో అయితే అశాంతిమయమైన ఆ సమూహాలు ఫాసిజానికి దారులు వేస్తాయి. ప్రజలు తమ జైళ్లను తామే నిర్మించుకునేలా చేస్తారు పాలకులు. భోపాల్ ఎన్ కౌంటర్ ముందు మానవత్వం తలదించుకున్న వేళ ప్రజాస్వామ్యం, పౌరహక్కులు వంటివి చాలా పెద్దవిషయాలు.

వారం వ్యవధిలో మావోయిస్టులని, సిమి తీవ్రవాదులని 39 మందిని కాల్చిచంపి ఎన్ కౌంటర్లు చేయడం అత్యంత సాధారణ విషయంగా చేసి రాజ్యం చెలామణి అవుతున్నది. మావోయిస్టుల విషయంలో ఏమైనా చెప్పుకోవాల్సి ఉంటుందేమోగాని, ముస్లింలైతే అది కూడా అక్కర్లేదు. ఇది పౌరహక్కుల సంఘాలు, మావోయిస్టు సానుభూతిపరులు, ముస్లింలకు సంబంధించిన విషయాలుగానే తక్కిన సమూహాలు భావిస్తే, మౌనం వహిస్తే, రాజ్యం అనుకున్నది సాధించినట్లే. ఇక దానికి చట్టం, రాజ్యాంగం, ప్రజాస్వామ్యం అంటూ ఏ విషయంలోనూ ఒత్తిడి పడాల్సిన పనిలేదు.



కవిత్వం

## రామ్‌గుడ

### ★ చిలువేరు అశోక్

ఆ గుట్టలు
గుండెలవిసేలా
ఏడుస్తున్నాయి
రాత్రి తన కడుపున
పడుకున్న బిడ్డలు
రక్తపు ముద్దలైయింర్రని

ఆ అడవంత
శోకంతో తల్లడిల్లుతున్నది
తన నీడన సేద తీరిన
పేదల రాజ్య సారథులు
నేలకొరిగింర్రని

అక్కడి ఆకులలములు
విలపిస్తున్నాయి
నిన్నటిదాక మాతో
ఆడిపాడిన వీరులు
విగత జీవులైనారని

నేల తల్లి హృదయం
ముక్కలైంది
తన విముక్తిప్రదాతను
నెత్తుటి మడుగున చూసి

అక్కడి జంతువులు
సిగ్గుపడ్డాయి
రాజ్యం తమను మించిన
క్రూర మృగమని తెలిసి

ఆదివాసి గెరిల్లా యోధులు
శపథం చేసింర్రు
విప్లవ వీరులను చంపిన
పాలకులను ప్రజాయుద్ధంలో కూలుస్తమని

దోపిడీవర్గ కాపలామూక
కర్కశదాడిలో
అశువులు బాసిన ఓ అమరులారా
అందుకోండి అరుణారుణ జోహార్లు

రామ్‌గుడ నెత్తుటి త్యాగం
రాబోయే తరాలు
చరిత్రగా రాసుకుంటారు
మట్టి ఇంకిన మీ నెత్తుటి చుక్కలు
ఎర్రపూల వనాలై విరబూస్తాయి
ఎర్రజెండాలై ఎగురుతాయి

## అడివి అంతరించదు

### ★ బాలసాని రాజయ్య

అడవిని జల్లెడ పడితే
అంతరించిపోదు ఆశయం
ఈదురుగాలులకు ఆకులు రాలినా
ఎండిపోదు అరణ్యం
ఆకురాలు కాలంతో
అదిరిపోదు వసంతం
చెమ్మగిల్లిన అడవి
కొత్త తీరుగ వికసిస్తుంది
వెన్నెలతో చెలిమి చేసిన అడవికి
చీకటి తాత్కాలికమే
తరాల చరిత్రకు పునాదిగా
వేళ్ళు పాకుతున్నాయి బలంగా
వర్గ దోపిడీ అంతం కోసం
ఆయుధాన్ని అందించింది అడవి
అడవి సంపదపై రాబందుల కన్ను
అన్యాయం అంతానికే పోరాటం
సామ్రాజ్యవాద కుట్రలపై
సాగుతున్న సాయుధ విప్లవం.

## ముగిసి పోని చరిత్ర మీది

### ★ జైసింగ్ రాథోడ్

బంధం
రక్త సంబంధం
ఏమిలేని చోట
పేగు బంధాన్ని తెంచుకొని
మా ఆకలికి అండైనారు
మా దుఃఖాన్ని ఎదలకద్దుకున్నారు
మా కళ్ళలో దివిటీలు వెలిగించి మురిసి పోయారు
ఎప్పుడెప్పుడో కల్సుకున్న దృశ్యాలు
ఆలింగనం చేసుకున్న అనుభూతులు
మనసు పొరల్లో కదలాడుతున్నాయి
ఎక్కడిదో మన బంధం
ఎన్నాళ్ళదో ఈ అనుబంధం

మా నోటికాడి ముద్దను

మా ముడ్డికింది జాగను
తన్నుకపోయేటోళ్ళకు
అడ్డం బడ్డందుకే కదా ఈ జగడం
మీ చూపుడు వేలు
మాకు గమ్యాన్ని చూపినందుకే కదా ఈ యుద్ధం
కలవరపడుతున్న శత్రువు
పాదల మాటున చేరి
మాకు కడుపుకోత పెడుతున్నాడు
మీ దేహాల్ని కొలిమిలో దహిస్తోంటే
మీ గుండెల్ని రంపాలతో కోస్తుంటే
మేమంతా కన్నీళ్ళ వరదయ్యాం
నిలువున ముక్కలై కూలిపోయాం
ఎక్కడిదో మన బంధం
ఎన్నాళ్ళదో ఈ అనుబంధం

మీ నెత్తుటి చిత్తడిలో
అడవి విత్తులు తడిసి పసిగుడ్డులా
ఈ మట్టి పొత్తిళ్ళలో కళ్ళు తెరుచుకుంటాయి
మీరు వదిలిపోయిన యుద్ధాన్ని కలగంటాయి
ఆరిపోని జ్యోతులు మీరు
అన్నార్తులకు ఆత్మబంధువులు మీరు
ముగిసిపోని చరిత్ర మీది
ఓడిపోని యుద్ధం మీది.

## మీ త్యాగం వృథా కానివ్వం

**★ *రమేష్ గొండ్యాల***

పట్నంలో పాలపిట్ట ప్రజల కోసం పాట పాడింది

స్వేచ్ఛ కై పురి విప్పి
నాట్యం చేస్తు
నిశ్శబ్దంగా నిద్రిస్తున్న
జనసంద్రాన్ని
మేల్కొలిపింది

పల్లెల్లో మట్టిగోడల్ని తాకుతూ
పట్నంలో మురికి
వాడలతో ముచ్చటిస్తూ
అడవిలో ఎండిన
గడ్డి పూల బాధ చూసి
గోసగా గానం చేసింది

పట్నం విడిచిన పక్షి
వ్యవస్థలో అవస్థలన్నీ భుజానెత్తుకొని
సాహసోపేతంగా అడవికి చేరింది

అడవి గర్భంలో ఉన్న నిక్షేపాల కాపలాకై
గిరిపుత్రులను జాగృతి
చేసే ఏఓబి పక్షులతో
జత కట్టింది

ఎండిన ఆకులపై మంచు బిందువులై
జీవకోటికి ప్రాణం పొయ్యాలని కలలు కన్నది

రక్తాన్ని చిందిస్తూ
మరణాన్ని స్వాగతిస్తు
పిడికిలి బిగించి విప్లవ నినాదాలు మారు మోగిస్తుంటే
చీకటి సోపతికి అలవాటైనోడు
విరగకాస్తున్న వెన్నెలను చూసి కంగారు పడ్డాడు

సజీవ సాక్షి అయిన
అడవి తల్లి నెత్తుటి ముద్దల్ని
తన ఒడిలోకి చేర్చుకోని మౌనంగా రోదిస్తోంది
ఆ నిబద్ధతను మరణం కూడ
జయించ లేక పోయింది
అందుకే అమరత్వం ముందు
తల వంచుకుని
దారి తప్పుకుంది

భగభగ మండే సూర్యుడిలా
వెలుగును ప్రకాశిస్తూ
చల్లని వెన్నెలై
మీరు అడవిని కాస్తారు

మీ త్యాగం వృథా కానివ్వం
ఆశయాల జెండా ఎత్తుకొని
త్యాగాల చాళ్ళలో
మునుముందుకు సాగుతాం.

**★ *ఉదయమిత్ర కవితలు రెండు***

## ప్రేమికులు

వాళ్ళు ప్రేమికులు

అన్నం అపురూపమైనచోట
ఆకలిని ప్రేమిస్తారు
జీవితం ప్రయాణమైన చోట
అలసటను ప్రేమిస్తారు

యుద్ధం అనివార్యమైనచోట
గాయాల్ని ప్రేమిస్తారు

వాళ్ళు ప్రేమికులు.
ప్రేమ,
ప్రేమించడం వాళ్ళ నైజం

తల్లి బిడ్డను ప్రేమించినట్టు
పువ్వు పరిమళాన్నిచ్చినట్టు
సూర్యుడు వెచ్చదనాన్నిచ్చినట్టు
ప్రేమించడం వాళ్ళ నైజం

ఏ ఊరో తెలువదు
ఏ తల్లి బిడ్డలో తెలువదు
ఏటివాలుకు ఎదురీదే చేపలాగ
దుఃఖపు చారలబట్టుకు
పీడితుని చేరుకుంటారు
పీడన మీద యుద్ధం ప్రకటిస్తారు

ఆస్తి కోసమందామా
ఊరిడిసి వొచ్చారు
కీర్తి కోసమందామా
పేరిడిసివొచ్చారు
భద్రత కొసమందామా
బతుకంతా నిత్యాగ్నిగుండమే

ఎట్లా వెలగట్టేది
కత్తి అంచుమీద
వెల్లివిరిసే త్యాగాల్ని
ఎట్లా వెలగట్టేది
ఒకవిశ్వాసం అంచున
పిక్కటిల్లే వసంత మేఘగర్జనల్ని

వొస్తూనే ఉంటారు
భయానక కుట్రల కింద
అశేష బలసంపత్తి కింద
శవాలు కుప్పలయినా
శరీరాలు ఛిద్రమయినా
శిఖరాలు కూలిపోయినా
అలసిపోని అలల్లాగ
బషాయిటుడులాగ
వొస్తూనే ఉంటారు

వాళ్ళు
స్వేచ్ఛ కోసం
నిర్బంధాలు ప్రేమిస్తారు
బతుక్కోసం
చావును ప్రేమిస్తారు

వాళ్ళు ప్రేమికులు.

# నువ్వేనా?

నువ్వేనా? అది నువ్వేనా?
చిరునవ్వుల జల్లేనా?
ఆకలి తొలి ముద్దేనా?
కరువుల తొలి పంటేనా?
ప్రభాకరుడి వెలుగేనా?

నా పాటకు పల్లవిగమ్మంటే
రాదని కొంటెగ తప్పించుకు
బహిరంగసభలో
చెరపాటనెత్తుకుని
'యువతరమా! నవతరమా!'
అంటూ ఉద్రూతలూగించి
వేలాది గుండెల్లోకి
జీవనదిలా ప్రవహించి
గుండె డప్పు మీద
ఉద్యమ పాటను మోగించిన
ఆ.. నవ్వేనా?

వ్యాసం మంచిగొచ్చిందంటే
విచ్చిన దానిమ్మపండులా నవ్వి
'ప్రయత్నం చేస్తున్న సార్' అంటూ
అప్రయత్నంగానే
అపూర్వ వ్యక్తిత్వాన్ని సంతరించుకు
ఎప్పుడు గలిసినా
నవ్వుల నజరానాలను
నా దోసిళ్లకెత్తిన
అలల మీద దోగాడే వెన్నెల దీపమా!
అడవి పూల మీదుగ వీచే
మలయ మారుతమా!
నువ్వేనా! అది నువ్వేనా!

మా కనుకొసల జారే
అశ్రువుల మీద
అక్షర సంతకం జేసింది నువ్వేనా
ఆ వొచ్చింది
నీ పార్థివ దేహమేనా!
కాకుంటే ఎంత బావుండు.

# నడిచే శ్రీకాకుళం గాలి

## ★ వడ్డెబోయిన శ్రీనివాస్

నాశీనా అని
అతడో ఆశ పుట్టించే మనిషి
అల్లకల్లోలాల అలల కాట్లు
సంక్షోభాల లోతైన గాయాలు
పైకెగరడాలు
పడిపోవడాలు
నిశ్శబ్ద సముద్రమతడు!
దుఃఖం చేయిపట్టుకొని
జీవితాంతం నడిచినవ్వతడు
గాటుపెట్టడు
గాయపడడు
అతడు ప్రజా రాజకీయం
నిరంతర తడి
నిలబెట్టె మట్టికౌగిలి
ఎప్పుడూ -
ఒంట్లో ఇనుపయంత్రం చొరబడని
నడిచే శ్రీకాకుళం గాలి
అతడు ప్రజా సంస్కృతి.

# ఒక గొంతు మూగబోతే....

## ★ కట్టెల లింగస్వామి (కలీమ్)

ఒక గొంతు మూగబోతే
ఒక చరణం ఆగిపోతే
అందుకుంటాం.. అందుకుంటాం
ఆ చరణం అందుకుంటాం
ఒక పాట ఆగిపోతే
ఒక మాట ఆగిపోతే
ఎత్తిపడతాం.. ఎత్తిపడతాం
నీ పాటను ఎత్తిపడతాం.
వినదిస్తాం... వినదిస్తాం
నీ గొంతయి వినదిస్తాం.
ఒక కలాన్ని మూసివేస్తే
ఒక గళాన్ని కోసివేస్తే
గర్జిస్తాం....గర్జిస్తాం
కోట్ల గళాలయి గర్జిస్తాం
ఎక్కుపెడతాం..ఎక్కుపెడతాం
పెన్నులే గన్నులుగా ఎక్కుపెడతాం
అడుగేస్తాం....అడుగేస్తాం....
అమరుల బాటలో అడుగేస్తాం

*(మల్కాన్ గిరి అమరుల స్మృతిలో)*

# శవాలు మాట్లాడుతాయి

## ★ వంగాల సంతోష్

అవును..!
శవాలు మాట్లాడుతాయి
నిజాలు చెప్పుతాయి
కమ్మిన కారు చీకట్ల
మబ్బులా విచ్చిన్నవిగుతున్నావేమో..!?
కానీ రేపటి తొలి వేకువ
పొద్దయి మళ్లీ ఉదయిస్తారు..

కుళ్లిన మీ దేహాల మధ్య
వాడు వణికిపోతున్నాడు
ఎక్కడ ఏ సాక్ష్యం
తనను నిలదీస్తుందోనని
నాలుగు పాదాల రాజ్యంపై
నాలుగు వర్ణాల వ్యవస్థపై
నక్సలైట్ ఉద్యమం
బానాయిట్ల బద్దలైతుందని
వాడు భయపడుతున్నాడు..

బాక్సైట్ గనుల కోసం
బరితెగించినోడు
మానవత్వాన్ని మరిచి
మారణ కాండ సృష్టించినోడు
దేశాన్ని సామ్రాజ్యవాదులకు అప్పగించి
దేశ భక్తి గుర్చి మాట్లాడుతున్నాడు
బదనకల్ నుండి బలిమెల దాక
దశాబ్ద కాలం పాటు
గ్రీన్‌హంట్‌ను వ్యతిరేకిస్తున్న వాళ్ళమే
ఈ నేలపై శాంతి కుసుమాలు
విరబూయాలని కాంక్షించిన వాళ్ళమే..!!

అవును
మేము నక్సలైట్లమే
నూతన సమాజంకై పరితపించి
త్యాగాల దారులను ఎత్తిపట్టే వాళ్ళమే
మొన్నటి బదనకల్
నిన్నటి బలిమెల
ఏదైనా రాజ్య హింసనే
రాజ్యాన్ని ప్రశ్నించిన వాళ్లే
రాలిన మోదుగుపూలు.

*(బదనకల్ నుండి బలిమెల దాక జరిగిన రాజ్య హింసను వ్యతిరేకిస్తూ....)*

# ఆమె దుఃఖం

★ బిఎస్ రాజు

దుఃఖం దుఃఖం దుఃఖం
సంద్రమై పొంగి పొర్లిన దుఃఖం
బీడు హృదయాలను తడిపిన దుఃఖం
గుండెలు పెళ్ళగించిన దుఃఖం
కన్నీళ్ల జలపాతమైన దుఃఖం
తెరిపిలేని దుఃఖం
గుండె పుండై పారిన దుఃఖం
వేల తల్లుల దుఃఖం ఒక్కటై
వరదగా ఉప్పొంగిన దుఃఖం
దుఃఖం దుఃఖం ఆమె దుఃఖం

రక్తం సలసల కాగి ఆవిరై ఎగసి
గుండె పొరల్లో ఘనీభవించి
పర్వతమై పేరుకుపోయిన దుఃఖం
ఈ రోజుదా? నిన్న మొన్నటిదా?
ఏళ్ల తరబడి అమరుల ఛిద్ర మృతదేహాలు
గుండెలపై పేర్చి పేర్చి ముద్రించిన దుఃఖం
ఎందరో అమ్మ నాన్నల అక్కచెల్లెళ్ల
సహచర స్నేహిత దుఃఖం

ఒక గాటా? ఒక వేటా? ఒక తూటా?
కాదు.. కాదు.. వేన వేల తూట్లు తూట్లు
చూసి చూసి దావానలమై
దహించివేస్తున్న దుఃఖం

దుఃఖమా! ఎంతని దుఃఖించగలవ్?
మనసా! ఎంతని విలపించగలవ్?
కన్నీరా! ఎంతని పొంగి ప్రవహించగలవ్?

మన బిడ్డల, మన వీరుల
ఇప్పటి, ఇవాల్టి
శవాల గుట్టలేనా?
అడవి బిడ్డల, ఆదివాసుల
ఛిద్ర దేహాలేనా?
ఆఫ్రికా, ఆసియా,
అమెరికా, యూరోప్
ఖండ ఖండాంతరాల్లో
ఎడతెరిపిలేకుండా
మేటలై పేరుకున్న పెట్టుబడి
ఉత్తరించే కుత్తుకల
లెక్కగట్ట గలమా?

అది మన తరమా?
లోతు ఎంతో కొలవగలమా?
దుఃఖమా! ఎంతని.. ఎంతని.. దుఃఖించగలవ్?

దుఃఖమా! నీ గమ్యం దుఃఖమేనా?
దుఃఖమా! నీ రూపు కన్నీరేనా?
యుద్ధమా?
నీ పేరు ఉన్మాదమేనా?
నీ రూపు కుప్పలుబడ్డ శవాలేనా?

ఊహు .. కాదు కాదు.. కానే కాదు..
ఆమె దుఃఖం.. పీడిత వర్గ దుఃఖం
ఆమె దుఃఖం.. వర్గ యుద్ధపు గుండె ఊట
ఆమె కన్నీరు.. ప్రజాయుద్ధ గెరిల్లాలకు కొత్త రక్తం
ఆమె దుఃఖం.. కొత్త శక్తుల కందుతున్న
పోరు పిలుపు, వినిపిస్తున్న శంఖారావం

ఊహు .. కాదు కాదు.. కానే కాదు..
ప్రజాయుద్ధమంటే కొత్త నిర్మాణం
అన్వేషణ, ఆచరణ, కొత్త వెలుగు,
అస్తమించిన సూర్యుణ్ణి
తిరిగి నూతన మానవ మస్తిష్కాల్లో
ఉదయింపచేసే నిత్య నూతన శక్తి
ప్రపంచ ఆకాశంపై పొడిచే కొత్త పొద్దు

దుఃఖం.. పడిలేచే వర్గ పోరాట కెరటం
దుఃఖం.. సానబెట్టిన ఆయుధం
దుఃఖం.. నిన్నటి అస్తమయం
నేటి సూర్యోదయం.

*(నవంబర్ 7వ విరసం సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో నిర్వహించిన బెజ్జంగి అమరవీరుల సంస్మరణ సభలో.. 'అమరుల బంధు మిత్రుల సంఘం' కార్యదర్శి కామ్రేడ్. పద్మకుమారి దుఃఖాన్ని పంచుకుంటూ..)*

# అమ్మా ఇదిగో నీ కుమారుడు

★ ఎండ్లూరి సుధాకర్

అవునమ్మా!
నీ కొడుకే దొరుకుతాడు
హంతకుల చేతికి ఉరి తాడు
నిజమేనమ్మా !
నీ కొడుకు ఏం నేరం చేసాడని
పొట్టనపెట్టుకున్నారు?
నీ విలాప వాక్యాల నిండా

నీ కడుపుకోత కనిపిస్తూనే ఉంది
నీ గొంతు ఘోష లోంచి
అరణ్య హింస వినిపిస్తూనే ఉంది
నీ కొడుకేమైనా
యువ రాజకీయ నాయకుడా
సినిమా కథా నాయకుడా
నిలువెత్తు ఫ్లెక్సీలలో
నిలబడి కనబడడానికి
నీ కుమారుడేమైనా వీధి రౌడీనా
నెంబర్ వన్ కేడీనా
బలిసిన మంత్రిగారి కుమారుడా
తెలిసిన కుర్రకారు కుబేరుడా
ఏం చేసాడని
మగత నిద్రలో మట్టుపెట్టారు
ప్లాస్టిక్ సంచిలో కలిపికుట్టారు
నీ కొడుకు మానభంగం చెయ్యలేదే
నిర్భయ కేసులో ఇరుక్కోలేదే
తాగి వాహనం నడపలేదే
కారు చక్రాల కింద ఎవరినీ చంపలేదే
బాల చంద్రుడిలాంటివాణ్ణి
బలితీసుకున్నారు కదా
నువ్వు నెత్తీ నోరు బాదుకొని
గుండె బావిలోంచి నెత్తుటి కన్నీళ్ళని చేదుకొని
ఎంత ఏడిస్తే మాత్రం
కొడుకొస్తాడా తల్లీ
వేటగాళ్ళ ఉచ్చుల్లో
ప్రాణం పోయిన పసికూన
రెండు పదులు దాటకుండానే
తెగిపోయిన అడవి వీణ
నువ్వన్నది నిజమే
దొంగల్ని దొంగలు కాపాడుతున్నారు
దుర్మార్గులు బలాదూరుగా తిరుగుతున్నారు
న్యాయం ఇక్కడ అమ్ముడవుతుంది
ధర్మం ధరకు లొంగిపోతుంది
దీన్ని ధిక్కరించిన వాడే నీ కొడుకు
కొత్త సమాజం కోసం
గొంతెత్తిన వాడు
కొత్త సర్కారుని స్వప్నించిన వాడు
శిరీష కుసుమం లాంటి కుమారుణ్ణి కోల్పోయిన దు:ఖితురాలా
నిజంగా నీ కొడుకు
చనిపోలేదమ్మా!
అడవి తల్లి కడుపులో
దాచుకుంది చూడు
తునికాకు పచ్చదనంలో ఉన్నాడు
తుడుం మోతలో ఉన్నాడు
కొమ్ము బూరలో ధ్వనిస్తున్నాడు
తొలి వేకువలో వికసిస్తున్నాడు
పాల పిట్టలా నవ్వుతున్నాడు
పూల బుట్టలా పరిమళిస్తున్నాడు
తేనె తుట్టెలో ఉన్నాడు
అగ్గి పెట్టెలో ఉన్నాడు
రేపటి వాగ్దానం కోసం
వసంత కాల మేఘమవుతున్నాడు
భూమి పుత్రుల నాగేటి చాళ్ళ కోసం
రేపటి భూపాల రాగమవుతున్నాడు
తట్టుకో తల్లీ
కడుపు ఒడిని పట్టుకో తల్లీ
రాబోయే కాలమే మరో కొత్త కొడుకుని ప్రసాదిస్తుంది
కొత్త ఉద్యమ సూర్యుణ్ణి ప్రసవిస్తుంది
కొత్త నక్షత్రమై ప్రభవిస్తుంది
అలా తలెత్తి చూడు తల్లీ
నీ ఇంటి ముంగిట్లో
'మున్నా'గ పూలు విరబూస్తున్నాయి.

# ఎవరు వాళ్ళు?

## ★ మెలనీ

18, 21, 23, 24, 28, 31
అంకెలా, రాలిన పువ్వులా?
పొదువుకున్న ఆశలు రెక్కల అంచునుండి జారినప్పుడు
ఆగిన గుండె లయలు
మనిషితనంపై కోడిగట్టని నమ్మకాల జాడలు
నీకోసం నాకోసం అశ్రువులు రాల్చిన కళ్ళు
భూమి స్వప్నాన్ని అరమోడ్పుగా నిలిపి
సగం తెరిచిన పిడికిట్లో రేపును దాచి ఉంచిన వాళ్ళు
ఈ భూమి మీదే, ఈ తల్లి కడుపునే పుట్టిన నిషిద్ధ మానవులు
ఈ భూమ్మీదే నీకన్నా నాకన్నా ఉన్నతంగా బతికిన మానవులు
నీకన్నా నాకన్నా ఉన్నతమైన కలలు కన్నవాళ్ళు
మనందరి కోసం ఉమ్మడి కలగన్నవాళ్ళు
కళలు సృజించిన వాళ్ళు
శతాబ్దాల చరిత్ర తండ్లాటలో పురుడుపోసుకున్న మట్టి
దేహాలవాళ్ళు
మొలకెత్తుతున్న విత్తనాల వంటి వాళ్ళు
మనుషులు వాళ్ళు
అచ్చమైన మనిషి రూపాలు వాళ్ళు



కథ

# పగిలిన జ్ఞాపకం

## వి. ప్రతిమ

"సునీతా... మే సునీతా" అమ్మ ఎప్పుడూ అట్లు అరిచినట్లే మాట్లాడుతుంది సెల్‌ఫోన్లో...

"ఆఁ ఏమ్మా" మెల్లిగానే అడిగాన్నేను.

"యాందియే ఏమ్మా! ఆడికి బొయిరాలే?" అమ్మకి... ఇలా తలా తోకా లేకుండా మాట్లాడ్డం అలవాటే కానీ, ఇప్పుడు మాత్రం బాబిగాడి సంగతి గుర్తు చేస్తోందని అర్థమై పోయింది నాకు.



"వినుతక్క కుళ్ళి కుళ్ళి యాడస్తుండాదిమేఁ సెలవు దొరకలేదు గిలవు దొరకలేదు అనబాక..." కోపం దిగమింగుకుంటున్నట్లుగా కొంత ఆగింది. నేను పూర్తిగా అప్రమత్తమైపోయి "అమ్మాఁ పోతానమ్మా" అంటూ గారాలు పోతూ దణ్ణం పెట్టాను... అవతల ఆమెకేం కనపడద్దిలే అని. అమ్మ నా కంటే ముందు పుట్టింది కదా "చెప్పిన పని చేస్తే వెయ్యి దణ్ణాలు పెట్టినట్టు" అన్నది. మళ్ళీ గొంతు పెంచి "రేపాదివారం కదాఁ పొద్దున్నే బయల్దేరి పొయ్యి మందలి కనుక్కోనొచ్చి అక్కకి చెప్పు" శాసిస్తున్నట్టే చెప్పింది.

"అట్లేమాఁ" అంటూ ఫోన్ పెట్టేశాను.

వినుతక్క మా పెద్దమ్మ కూతురు. అక్క, చెల్లెలు అన్నదమ్ములను చేసుకున్నారు. పెద్దమ్మకి వినుతక్క, అమ్మకు నేను ఇద్దరే ఆడపిల్లలం కావడంతో పడుగుపాదులో మాకున్న ఇరవై ఎకరాల నేల కరక్కుండా ఉండి పోయింది... వినుతక్కని పదో తరగతవగానే మంచి ఇంజనీర్ని చూసి పెళ్ళి చేసి పంపించేశారు. బాబిగాడు పుట్టిన అయిదేళ్ళకి బావ యాక్సిడెంట్లో పోయాడు. అది వూహించని అఘాతం మా ఇంట్లో. అప్పట్నుండీ ఇంటిల్లిపాదీ వాడిని కంటికి రెప్పలా కాపాడుకొచ్చారు. నెల్లూర్లో పదో తరగతవగానే విజయవాడ చైతన్యలో ఇంటర్ పూర్తి చేశాడు వాడు. లాంగ్‌టర్మ్‌లో చేర్పడానికి, అవసరమయితే డొనేషనయినా కట్టడానికి పెద్దవాళ్ళు సిద్ధమవుతున్నప్పుడు వాడు మొదటిసారే సీటు తెచ్చుకున్నాడు మెడిసన్లో... అదీ విజయవాడ సిద్ధార్థ గవర్నమెంటు మెడికల్ కాలేజీలో.

నాలుగేళ్ళయింది... ఏ ఏడుకాయేడు మంచి మార్కులతో పాసవుతూ వచ్చాడు... ఒక వైపు హౌస్ సర్జన్ చేస్తూ పి.జి. ఎంట్రెన్స్ రాయడానికి కోచింగ్ తీసుకుంటున్నాడు. నాకు ఇటీవలే నెల్లూరు నుండి తణుకుకే ట్రాన్స్‌ఫరయింది. పిల్లలిద్దరూ అకడమిక్ యియర్ మధ్యలో ఉండడంతో మా ఆయన, అత్తగారూ, పిల్లలూ అంతా అక్కడే ఉండిపోయారు. నేనిక్కడ కొత్త ఇంటికీ, ఆఫీసుకీ అలవాటు పడి సర్దుకుంటూండగానే వినుతక్క నుండి ఫోను. మామూలు ఫోను కాదు. దిగులు ఫోను.

"బాబిగాడెవరో అమ్మాయిని ప్రేమించానంటున్నాడు" అంటూ వర్షం కురిసినట్లుగా ఏడవడం మొదలుపెట్టింది. ఇష్టపడ్డం, ప్రేమించుకోవడం మామూలే కదా అన్లేదు నేను. ఎందుకంటే అది మా ఇళ్ళల్లో ఇంకా మామూలు కాలేదు. పైపెచ్చు వినుతక్కకి బాబిగాడి మీద చాల ఆశలున్నాయి. వాడు తండ్రిలా ఆరడుగుల పొడవు, తల్లిలా పచ్చటి పసిమి, చదువూ, తెలివితేటలూ, మంచితనం మొత్తంగా వాడో కథానాయకుడి వంటివాడు వాళ్ళమ్మకి.

తల్లికి అందునా తండ్రిని కోల్పోయిన కొడుకు మీద ఆశలు లేకుండా ఎలా ఉంటాయి? మా బావ చెల్లెలి కూతురు దీపిక, మా ఆయన అక్క కూతురు సంజన వీళ్ళంతా కుందనబ్బొమ్మల్లా ఉంటారు. కాదూ, కూడదూ మేవరికాలొద్దని బాబిగాడంటే నెల్లూర్లోనో, గూడూర్లోనో, నాయుడుపేట లోనో పెద్దింటోళ్ళు ఉండనే ఉంటారు. వాళ్ళల్లో అందమైన, చదువుకున్న అమ్మాయిలుంటే చాలు, కట్నాలు బళ్ళే..." అంటుంది వినుతక్క.

'కట్నాలు బళ్ళే' అనేది కొసమెరుపు. అంతంత ఉన్నవాళ్ళు బిడ్డని వుత్త చేతుల్తో పంపరు గదా...

కారులో షికారు కెళ్ళే పాలబుగ్గల..." అంటూ నా ఫోన్ మోగింది. నా ఆలోచనలకి అడ్డం పడుతూ... వినుతక్క...

ఆ పిల్లెవురో మనోడిని శనిలా పట్టుకుంది. ఎక్కడి పడునుపాడు ఎక్కడి జంగారెడ్డి గూడెం? మనూరు కాదు, మన ప్రాంతం కాదు, మన కులం కాదు. మన ఆచారాలు కాదు, మన భాష కాదు... మన యాస కాదు. మన కంటే చాన తక్కువలో ఉండారు... వాళ్ళు మనకెట్ల కలస్తారు చెప్పు? వీడు అడివిలో బడ్తుండాడు"

"అవునక్కా" అన్నాన్నేను... అక్క ఏకరువు పెట్టిన ఈ అంతరాలలో ఎక్కువగా ఆమెని బాధ పెట్టేవి స్థాయి భేదాలే... నాలుగు రోజులుగా అక్క యివే మాటల్ని రికార్డు వేసి విన్పిస్తోన్నట్లుగా విన్పిస్తోంది. ఇప్పుడు నేను యుద్ధ ప్రాతిపదికన జంగారెడ్డి గూడెం వెళ్ళి వారి స్థితిగతుల్ని చూసి వచ్చి అక్కకి చెప్పాలి. నాకెందుకో అక్కని తలుచుకుంటే జాలేసింది.

"రేపు తప్పకుండా వెళ్తానక్కా. బీ బ్రేవ్" అంటూ నచ్చ చెప్పాను. అక్కతో మాట్లాడుతుండగానే నా ఫోన్ మళ్ళీ మోగింది.

ఈసారి అమ్మాయి ఉంటుంది.

రేపు ఆ ఊరు గాని ఊరికెళ్ళి ఆ పెద్ద మనుషుల్తోనో, చిన్న మనుషుల్తోనో నేను ఏం మాట్లాడాలో మాటలు నాకు నోట్లో పెడుతుంది. 'వుఫ్' మంటూ ఫోనందుకున్నాన్నేను.

* * *

"నేనూ నీతో పాటే వచ్చి అక్కడ పట్టిసీమ అందాలన్నీ చూపించి ఉండే వాడినే కానీ ఇవ్వాళ నాకు చాల పనుందమ్మాయ్. నా పెద్ద మనవడు వస్తున్నాడు" చెప్పాడు మా ఇంటి ఓనరు నేను తాళం వేస్తుండగా. ఆయనే టాక్సీ మాట్లాడి పెట్టాడు... బతుకు జీవుడా అనుకుంటూ మొహమాటంగా నవ్వాను.

"అక్కడ గ్రామాలన్నీ పోయాయట కదండీ ముంపులో. ఇంకా అందాలేమున్నాయి?" అన్నాన్నేను నా పరిమిత జ్ఞానంతో.

"పోతాయమ్మా.. పోతాయి. అభివృద్ధి జరిగేప్పుడు చిన్న చిన్న విధ్వంసాలు జరుగుతాయి తప్పదు. ప్రాజెక్టులు కట్టేదెవరి కోసం? ఈ జనం కోసమే కదా... అయినా లిఫ్టులు పెట్టారు కదా ప్రాజెక్టు పూర్తయ్యే లోపల నీటికి ఇబ్బంది లేకుండా. అక్కడ భావ నారాయణ స్వామి గుడి కూడా ఉంది" ఒక దబాయింపు స్వరంతో అన్నాడతను.

"ప్రాజెక్టు పూర్తయితే ఈ లిఫ్టులన్నీ వేస్టయిపోతాయి కదండీ... అయినా అవి ఏ రైతుల ప్రయోజనాల కోసం నిర్మించబడ్డాయి?" అనబోయి ఆగి జీవం లేని నవ్వొకటి అతడి మీదికి విసిరి కారెక్కాను. అతడు డ్రైవరుకి జాగ్రత్తలు చెప్పాడు.. అచ్చు మా అమ్మలాగే.

"కొందరింతేనండి... చాలా అభివృద్ధి కోరేసుకుంటారు. మిగతా ప్రపంచమంతా ఏమయిపోయినా వీళ్ళకు పట్టదు... మనుషులక్కడ సామూహికంగా సమాధయి పోయినా సరే వీళ్ళకి మాత్రం అభివృద్ధి జరిగిపోవాలి. ఏ జనం కోసమండీ ఈ ప్రాజెక్టులు?... ఏ జనాన్ని కొప్పెట్టి ఏ జనానికి నీళ్ళందిస్తోంది ప్రభుత్వం?" విసురుగా డోర్ మూసి కార్ స్టార్ట్ చేసి అన్నాడు డ్రైవరు.

విస్తుపోయి చూశాను అతడికేసి.

ఏమనుకున్నాడో గానీ "అయ్యగారు వాళ్ళు నాకు చాలా కాలంగా తెలుసండి... మంచోరే గాని అభివృద్ధి కావాలి... పేదోళ్ళకు కాదు, పెద్దోళ్ళకు మాత్రమే..." అన్నాడతడు నవ్వుతూ.

"నీ పేరేమిటి?" నవ్వుని కొని తెచ్చుకుంటూ అడిగాన్నేను.

"అశోకంటారండీ... గూడెవేం కదండీ."

"తాడేపల్లి గూడెం కాదు, జంగారెడ్డి గూడెం."

"చెప్పేరండి పెద్దాయన..." అన్నాడతడు ఏకాగ్రతగా రోడ్డుకేసి చూస్తూ... నేను పేపరు తీసి చూడ్డం మొదలుపెట్టాను.

పేపరు పూర్తి చేసి తలెత్తేటప్పటికి రోడ్డు వెంబడి మమ్మల్ని వెంటాడుతూ వస్తోన్న వంటకాలవ... అందులో అక్కడక్కడా నిండుగా విరబూసిన తెల్ల కలువలూ, ఎప్పుడో బాల్యంలో చూసిన జ్ఞాపకాలు.

"ఏ వూరో ఇది?" అనుకుంటూ చుట్టూ చూశాను.

"చేబ్రోలు దాటేమండి... దోబచెర్ల, లక్కవరం, గురవాయి గూడెం. ఆ తర్వాత జంగారెడ్డిగూడెం..." అశోక్ ఇక్కడి ఊర్లన్నీ ఏకరువు పెడుతూ "అటేపు పాపికొండలు సైట్ సీయింగ్ సూసేరండీ?" అన్నాడు హఠాత్తుగా.

"ఊఁ లేదు."

"ఇంకేం సుస్తారైండి? ఆ అందాలన్నీ పోతన్నాయిగా... ప్రాజెక్టు కింద మనుషులే పోతన్నారు. అందాల్దేముంది లెండి. అక్కడ తెలంగాణ వేపేమొగానండి. ఇక్కడ మాత్రం ఇరవై రెండు గ్రామాలు పోతన్నయి... ఇప్పటికి ఏడు గ్రామాలు బలిమిని ఖాళీ చేయించేసేరండి... శానామంది వెళ్ళమని ఎదురు తిరిగారు గానీ పోలీసుల్ని పెట్టి బెదిరించి, లాఠీ దెబ్బలు రుచి చూపించి, కొన్ని కొన్ని ఆశలు పెట్టి ఉన్న పళాన జీబులెక్కించేసేరండి... నమ్మరు గానండి..తింటున్నోళ్ళను తింటున్నట్లే ప్లేట్లతో సహా ఎక్కించి అక్కడికెళ్ళి తినమన్నారండి... ఉరుకుతున్న అన్నం గిన్నెని కూడా నెట్టేసేరండి. నిజంగా ఆ రోజు తలుచుకుంటే ఏడుపు తప్ప మరోటుండదు..." అతడి గొంతు ఉద్వేగంగా ఉంది...

"మీదీవూరేనా?" అడిగాన్నేను... మూడు రాష్ట్రాల్లోనూ కలిపి పోలవరం మూలంగా మూడు లక్షలకు పైగా నిర్వాసితులవుతున్నారని చదివిన వార్తని గుర్తు చేసుకుంటూ... "కాదండి... మాది తణుకే... మా అక్కా, బావ పోలవరం దగ్గర దేవరగొందిలో ఉండేవోరు. వేం కోయలమండి. దేవరగొందంతా కోయలేనండి. మా బావ తండ్రి, తాత అరవయ్యేళ్ళు పైబడి సాగు చేసుకుంటోన్న భూమికి పట్టా కాగితాల్లేవని వాళ్ళని ఉత్త సేతుల్తో పంపిసేరండి... అయినా ఎప్పటి కాలం, ఎప్పటి కాగితాలండి? శానా మంది శానా కర్చు పెట్టి పట్టా కాగితాల్తెచ్చు కున్నారటండి. మా బావకి మరి అంత సీన్ లేదు... ఆళ్ళకి ఇల్లు కూడ నేదండి... చేతులూపుకుంటూ తనుకొచ్చేరు. మా ఇంట్లోనే ఉండారు... అక్కకి, మాయావిడకీ పడదండీ... నాకు తెలవకడగతానండి... ఎల్లకాలముండి పోతారేటండి? ఆల్లకీ మంచికాలమొస్తదండి... మా బావకి ఆటో ఇప్పించాను నడుపుకోమని..."

నేను వింటున్నానా, లేదా?... అతడు చెప్తోన్న దానిపట్ల నాకు ఆసక్తి ఉందా, లేదా అన్నది ఏ మాత్రం పట్టించుకోకుండా చెప్పుకుపోతున్నాడతడు.

"ఇంకో అయిదు గ్రామాలను ఇట్లాగే బలిమిని ఖాళీ సేయించేత్తారండి... తర్వాత నీళ్ళొచ్చేయనుకోండి మిగిలినవోళ్ళు ఆళ్ళే పోతారు గదండి... నష్ట పరిహారాలుండవు, పాప పరిహారాలుండవు ప్రభుత్వానికి... అట్టా మిగిలిన డబ్బుల్తో ప్రెభుత్వం అన్నీ మంచి పనులే సేసుద్దిగదండి..." అతడి గొంతులోని తీవ్రమైన వ్యంగ్యం నన్ను ఆశ్చర్యచకితను చేసింది.. అతడి భాషలోని యాస, అతడు చెప్తోన్న విషయమూ, మేం వెళ్తోన్న ఈ దారీ అన్నీ కలుపుకుని ఒక కొత్త జ్ఞానవేదో నన్ను కమ్ముకుంటున్నట్టుగా ఉంది...

అతడి పెదవులు మాట్లాడుతున్నాయి

గానీ, ఒక దుఃఖపు జీర ఏదో కడుపులోపలి నుండి బయల్దేరి అతడి గొంతును కదుపుతోంది... చాలా సేపు మౌనంగా గడిచాక ఏదో ఊళ్ళోకి ప్రవేశించింది వాహనం.

కొత్త పెళ్ళి కూతురు వంటి పునరావాస కేంద్రమేదో మాకు ఆహ్వానం పలికింది. అదే జంగారెడ్డి గూడెమని అర్థమయింది. "ఎవరిల్లన్నారండి?" అని అశోక్ ప్రశ్నతో...

"సత్యం రామారావుగారిల్లు."

కారు స్లో చేసి ఎవరినో ఎంక్వయిరీ చేస్తున్నాడతడు.

చిన్న పిల్లలు కొందరు బ్యాగులు తగిలించుకుని ఆ పునరావాస కేంద్రాల్లోనే ఒక పోర్షనులోకి వెళుతున్నారు... అదే బడి కాబోలు. ముప్పయి, ముప్పయ్యయిదేళ్ళ వయసున్న పంతులమ్మ ఒకామె వాళ్ళని ఒక్కొక్కరుగా ఆహ్వానించి లోపలికి తీసుకెళ్తోంది. టైము చూస్తే తొమ్మిదీ ముప్పావయింది. ఎండ చురుక్కుమని తాకుతోంది అద్దంలో నుండి.

కారు దిగి ఆమె వద్దకెళ్ళి "ఈ ఇల్లు బడా?" అన్నాను ఆశ్చర్యంగా. "అవునండి... మేమంతా ఇక్కడి కొచ్చి నాలుగయిదు నెలలయింది. అదిగో అటేపెక్కడో కడ్తారటండి బడి. ఈలోపు పిల్లలు వచ్చింది మర్చిపోగూడదు కదండి... అందుకే ఆదివారమయినా యిలా మధ్యాన్నం దాకా... ఆదివారం కదా అన్న నా అనుమానాన్ని గ్రహించిన దానిలా ముందే చెప్పింది. విస్థాపన సమయంలో పిల్లలు చాలా నష్టపోయారని ఆమె మాటల్లో అర్థమయింది. ఇంతలో ఆ ఇల్లు అద్దెకిచ్చిన ముసలమ్మ పక్క ఇంట్లో నుండే తొంగి చూసి ప్రశ్నించింది "ఏడి కెల్లాలండీ?" అని.

ఆమె కోడలు కాబోలు చేస్తోన్న వనాపేసి బరబరా నడుచుకుంటూ రోడ్డుమీది కొచ్చేసింది. మా వైపు పల్లెల్లో, కొత్త మనుషులొచ్చినా, లేదా ఒక కొత్త కారొచ్చినా, బండొచ్చినా ఇదంతా మామూలే కానీ, ఇక్కడ మాత్రం ఏదో తేడా కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది...

"ఎవరిల్లండీ?" ప్రశ్నించిందామె అవసరమున్నదానిలా.

చెప్పాన్నేను.

"ఓఁ సత్యంగారా? ఆయనదసలు రామయ్యపేటండి. ఇదిగో ఇక్కడ ఇంత దూరానిచ్చేరు ఇల్లు... మా తోటి కోడలు మైలిపిల్లి లచ్చిమికి యిల్లు రాలేదండి. ఆళ్ళు మాతోనే వుంటన్నారు. ఎలగయినా వాళ్ళకి యిల్లొచ్చేలా రాయండమ్మగోరూ'' బతిమాలుతున్నట్టు దండం పెట్టింది.

నాకర్థమై పోయింది... నేనిలా ఒంటరిగా కారులో వచ్చి దిగి రోడ్డమ్మట నడుస్తూంటే, ముంపు బాధితుల సర్వే కోసం వచ్చిన ఆఫీసరమ్మనని, నేనేదో సాయం చేసేస్తానని భ్రమ పడుతోందావిడ్మాయి... అవునూ, కాదూ అనకుండా ఆమె కళ్ళల్లోకి చూసి నవ్వాను. కానీ నా పెదవులు విచ్చుకోలేదు.

"ఒక్కో ఆడబిడ్డకీ అయిదు లక్షలా ఎనభయి వేలిచ్చారండీ... నాకు ముగ్గురూ ఆడపిల్లలే, ఏడెనిమిదేళ్ళ వాళ్ళు. మా ఆయన్ని గట్టిగా అడగమంటే పదేళ్ళ లోపు వాళ్ళకి కాదన్నారటండీ... అవన్నీ ఇస్తామని ఆశపెట్టి లేపేసేరండి మమ్మల్ని. ఈ ప్రభుత్వం మాకు న్యాయం చేసి పంపలేదండీ... పెద్ద పిల్లలకు పెద్దగా, చిన్న పిల్లకు చిన్నగా నేయం సెయ్యాల గదండీ... ముగ్గురూ ఆడపిల్లలేనండి...'' ఆమె మాట్లాడ్డం మొదలు పెట్టినప్పట్నుండీ పెద్ద పెద్ద ఆమె కనుగుడ్ల నిండా నీళ్ళు కదలాడుతూనే ఉన్నాయి...

ఒడ్డున పడిపోయిన చేపపిల్లలు తిరిగి నీళ్ళలోకి చేరుకోవడానికి కొట్టుకులాడుతున్నట్టుగా ఉంది... గబుక్కున వంగి చేపపిల్లల్ని నీటిలోకి వదలాలన్నంత ఉద్వేగం కలిగింది నాకు.

"మేడం గారూ రండి త్వరగా వెళ్ళాలి" తొందర పెడుతోన్న అశోక్ కేసి చూస్తూ మౌనంగా అతడ్ననుసరించాను.

'వత్తారు... ఎల్తారు... మనకి నేయం సేసేటోళ్ళెవరూ లేరు...' నా వెనుక నుండి ఆమె మాటలూ, చప్పున రాలిపడ్డ కన్నీటి బొట్టు చప్పుడూ విన్పించాయి.

* * *

మేం వెళ్ళేసరికి ఇంటి చుట్టూ ప్రహరీ గోడవంటి దడి కట్టడంలో నిమగ్నమై ఉన్న రామారావుగారు చప్పున లేచి తలగుడ్డ విదిలించి చేతులూ, మొహమూ తుడుచుకుంటూ మాకెదురొచ్చాడు.

నేను ఫలానా అని తెలిసి ఎంతో గౌరవంగా లోపలికి ఆహ్వానించారు. అక్కడ గోడకి వారగా ఒకవైపు బిగించి అల్లబడిన నవారు మంచం, మరోవైపు పాతకాలం నాటి సోఫా కం బెడ్ వేసి ఉన్నాయి. దానిమీద పాతదే అయినా శుభ్రమైన బెడ్‌షీటొకటి పరిచి ఉంది. నేను సంకోచించకుండా దానిమీద కూర్చున్నాను.

అతడు మంచం మీద కూర్చుంటూ మంచినీళ్ళు పట్రమ్మని భార్యని పురమాయించాడు. నేనోసారి ఆవిడకేసి పరికించి చూశాను. పొడవాటి కర్రపుల్లకి మరో నాలుగు చిన్న పుల్లల్ని చేతులూ, కాళ్ళూగా అమర్చి శిల్కు చీర చుట్టి ఎవరో నడిపిస్తే నడుస్తున్నట్టుగా ఉందామె... రెండే రెండు గదులు, ఒక పెద్ద నిరుపాటి వరండా అదీ ఆ ఇల్లు.. కాటన్ చుడీదార్లు వేసుకున్న టీనేజీ అమ్మాయిలు ముగ్గురు ఇంట్లో నుండి తొంగి చూసి వెళ్ళారు.

"సుజీ ఇలా రండమ్మా' అంటూ సృజన, మేఘన తన కూతుళ్ళనీ, మూడో అమ్మాయి శ్రావణి తన తమ్ముడి కూతురనీ పరిచయం చేశాడాయన.

వీళ్ళల్లో సృజన విజయవాడలో మెడిసిన్ చేస్తోందనీ, చిన్నమ్మాయి మేఘన రాజమండ్రిలో ఇంజనీరింగ్ ఫస్టియరనీ, యిప్పుడు ఇద్దరికీ సెలవులనీ చెప్పడంతో నాకు అర్థమైపోయింది. ఇంటావిడ మంచినీళ్ళు తెచ్చేలోపు ఘనీభవించిన నిశ్శబ్దమేదో కొంచెం ఇబ్బంది పెట్టింది నన్ను.

ఆ ఇంట్లోనే కాదు, మొత్తంగా ఆ వూరి గాలిలోనే స్మశానం మీది నుండి వచ్చే విషాద సంగీతమేదో వినవస్తున్నట్లుగా ఉంది. వాళ్ళంతా చాల బలహీనంగా ప్రేతాల్లా ఇంట్లో తిరుగాడుతున్నట్లుగా ఉంది. సృజన చామన ఛాయలోనూ, మేఘన నల్లగానూ ఉన్నా ఇద్దరూ కళగా ఉన్నారు. ఇంటావిడొచ్చింది ఎవరో నడిపిస్తే నడుస్తున్నట్లుగా...

మా ఊళ్ళో అయితే ఒకటి, రెండెకరాలున్న వాళ్ళు కూడా ఆడవాళ్ళు బన్సులెక్కరు. నెల్లూరెళ్ళాలంటే కారెక్కాల్సిందే... మా అమ్మా, పెద్దమ్మా అయితే ఆ మూల అంతఃపురంలో మహారాణుల్లా ఉంటారు. చాకింటి నుంచి

తెచ్చిన ఖరీదైన కాటన్ చీరలే తప్ప యిటువంటి సిల్కు చీరలు వాళ్ళు ఒంటిమీద నేనెప్పుడూ చూడలేదు. మా వినుతక్క అయితే సరేసరి... నేనొక్కదాన్నే ఆ ఇంట్లో చెడబుట్టాననీ, వొద్దన్నా ఈ ఉద్యోగం వెలగబెడ్తున్నాననీ ఇంటిల్లిపాదికీ నా మీద కోపమే... నాకు తెలీకుండానే, లోలోపల నేను మా ఇంటినీ, ఇక్కడి వాతావరణంతో బేరీజు వేస్తూ ఉన్నాను.

కాఫీలూ, మర్యాదలూ అయ్యాక.

"మెడిసినయ్యాక ఏం చేద్దామనుకుంటున్నావు?" అంటూ సమాధానమాశించని పిచ్చి ప్రశ్నొకదానిని సృజన మీదికి విసిరి అమ్మాయి బోడీ లాంగ్వేజ్‌ని గమనించసాగాను. అమ్మాయేం మాట్లాడలేదు. చిరునవ్వు నవ్వింది.

ఆ నవ్వులో ఎన్నో ఆశలూ, ఆశయాలూ, ఆందోళనలూ కూడ కన్పించాయి నాకు.

"వారం రోజులుగా భారీ వర్షాలండి... ఇవ్వాళే కాస్త తెరిపిచ్చింది కొత్తగా వచ్చేం కదండీ... ఇంకా డ్రైనేజీల పని కాలేదు..." కావేమోనన్న అపనమ్మకపు జీర అతడి గొంతులో... దాపున ఉన్న మురిక్కాలువ నుండి వస్తోన్న దుర్గంధం, దోమలు... నేనేమనుకుంటానో అని కాబోలు అతడి సంజాయిషీ..

నేనదేమీ పట్టించుకోనట్టుగా సృజనకేసి తిరిగాను.

ఆశ్చర్యంగా నిశ్శబ్దమే మా ముగ్గురి నడుమా సంభాషణని నడుపుతోంది... మిగిలిన ముగ్గురూ వంటగదిలో ఏదో చప్పుళ్ళు చేస్తున్నారు... దూరంగా అశోక్ వచ్చీరాని ఎండలో ఉన్న కారుని మళ్ళీ మళ్ళీ తుడుస్తూనే ఊరి వాళ్ళతో మాట కలిపాడు.

కాసేపటికి సత్యంగారే నోరు విప్పారు.

"మాదసలు ఈ ఊరు కాదు, ఈ వాడకాదండి. మాది రామయ్యపేట ఇప్పుడది పాతూరండి... ప్రాజెక్టు కింద చదరమయిపోయింది... ఎనిమిదెకరాల నల్లరేగడి నేల. బంగారం పండేదండి... తక్కువ పెట్టుబడితో ఎక్కువ లాభాలొచ్చేవి. మూసేసేరండి... బంగారం లాంటి నేలను ప్రాజెక్టు కింద సమాధి చేసేరు." గొంతుని సవరించుపోదానికన్నట్టు ఆగాడతడు.

"మా సృజన తొమ్మిదో తరగతి చదివే నాటికి మాకీ ప్రాజెక్టనీ గానీ మా ఊరంతా మునిగిపోద్దని గానీ తెల్దండి... నా పొలంతో పాటు మరికొంత కౌలుకి కూడా చేసేవోడ్ని... పెద్దగా కోరికలు కూడ ఏమీలేవు. ఉన్నది ఇద్దరాడ పిల్లలు. బాగా చదివించి ఉద్యోగాలు చేయించాలని మాత్రం ఉండిందండి. అదే చెప్పేవోడ్ని చిన్నప్పట్నుండీ... సృజనకి డాక్టరవ్వాలన్న కోరిక తనకే ఏర్పడింది. ప్రోత్సహించాను, చదివింది... సీటు తెచ్చుకుంది. పిల్లల చదువులూ మా అమ్మా, నాన్న అనారోగ్యాలు, ఆడపడుచుల రాకపోకలూ మంచీ, చెడ్డా అయ్యీ సరికి అయిదెకరాలు మాత్రం మిగిలిందండి... అయితేంటి గొప్పగానే బతికేను. నాకింద ఎందరు పని చేసేవోరు" అంటూ గాద్గదిక మవుతోన్న గొంతుని మళ్ళీ మళ్ళీ సవరించుకుంటూనే ఉన్నాడతడు.

"లేపేసేరండి... మా తాత ముత్తాతల కాలం నుండి మేం బతికిన చోటు నుండి మమ్మల్ని బలిమిని లేపేసేరండి. పోన్లేపితే లేపేరు. కొత్త రామయ్య పేటలో మా వాళ్ళందరితోనే ఉంచాలి కదండి... ఈ మారుమూల వడేసేరు. అంతా చెల్లాచెదురయి పోయింది" అలా అంటున్నపుడు అతడి బుగ్గలు సాగి కనురెప్పలు కుచించుకుపోయి కళ్ళు మూసుకుపోయాయి.

ఆ రెప్పల వెనుకవున్న ఉప్పెనలని అంచనా వేస్తూ మౌనంగా అతడికేసి చూడసాగాను. పెద్దగా పెద్ద పెద్ద కలలున్నవాడు కాకపోయినప్పటికీ గుప్పెడు మట్టికోసం, బంగారం లాంటి గుప్పెడు మట్టికోసం కలలు కంటున్నవాడిలా ఉన్నాడతడు... ఎండిన విత్తనాన్ని గుండెల్లో దాచుకుని పదును పడగానే బోధించిన చేతుల్లా బంగారపు మొలకల్ని మీదికి పంపే గుప్పెడు మట్టికోసం కలలు కంటున్నవాడిలా ఉన్నాడతడు.

"మరి మీకు పొలం ఇవ్వలేదా ఇక్కడ?" గొంతు పెగుల్చుకుని అడిగాన్నేను... అతడు నవ్వాడు "ఎస్సీ ఎస్టీలకు మాత్రమేనండి పొలానికి పొలం. ఆళ్ళ క్కూడ రెండెకరాలున్నోళ్ళకి ఎకరమున్నర... మూడునోళ్ళకి రెండూ అలా ఇచ్చేరు. అవీ బంజరు భూములు... వర్షాధారం.. కాపోతే వాళ్ళు రోడ్డు పాయింటుకొచ్చేం కదాని సంబురపడ్తున్నారు. మాకు మాత్రం పరిహారమిచ్చేరు. అదీ ఎప్పటి అంచనాల ప్రకారం? మరి అదే అంచనాల ప్రకారం ఇప్పుడు ప్రాజెక్టు పూర్తి చేయగలరేటండీ?..."

నాకు గుండె గొంతులో కొచ్చినట్టయింది. అతనేమంటున్నాడు? 2014లో ప్రాజెక్టుకయ్యే ఖర్చు అంచనా పదహారు వేల కోట్లు. అయితే ఇవ్వాళ నలభయ్యెనిమిది వేల కోట్లని అంచనా వేస్తున్నారు. పోలవరాన్ని జాతీయం చేయాలనీ, కేంద్రం నుండి నిధులు కావాలని పట్టుబడుతున్నారు. మరి నిర్వాసితులకివ్వాల్సిన పరిహారపు అంచనా కూడా పెరగాలి కదా అంటున్నాడు.

సృజన అందుకుంది.

"ఆ పరిహారం కాస్తా కౌలుకి, వ్యవసాయానికి చేస్తూ వచ్చిన అప్పులకీ సరిపోయిందండి... డబ్బులయిపోయినయి, భూమి లేదు, ఉపాధి కూడ లేదు. చేతిలో పనిలేకపోవడం... మగాళ్ళు తడుముకుని, తడ్ముముకుని దూర ప్రాంతాలకెళ్ళి కూలి డబ్బులు తెస్తున్నారు. అదీ రోజూ వుండదండి..." తండ్రి గొంతులోని ఆ వేదనని లోపలికి తీసుకుంటున్నట్లుగా వుందా పిల్ల... జొయ్యి, జొయ్యిమంటూ వస్తూ ఇప్పటి దాకా విషాద సంగీతాన్ని విన్పించిన గాలి వేరే వూరి మీదికి మళ్ళిందేమో వెచ్చబడిన చిరు ఎండ చురుక్కుమంటోంది.

ఈ పరిస్థితుల్లో పెళ్ళి మాటలేం మాట్లాడను? అసలు సృజన మనసులో ఏముంది? ఇక్కడి పరిస్థితి చూసి, లేదా విని బాబిగాడేమంటాడు? ఇప్పుడే పెళ్ళి చేయడం సరయినదేనా? వీళ్ళు చదువులు కొనసాగించగలరా? కొడుకుని రేడియాలజీ చేయించాలని ఆశ పడుతోన్న వినుతక్క సృజనని మెచ్చుతుందా? వంటి ప్రశ్నలు ఈగల్లా ముసిరి నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తోంటే ఎడమ చేతితోనయినా వాటిని తోలలేక ఆలోచనలో పడ్డాన్నేను.

హఠాత్తుగా అన్నాడతడు.

'మా రామయ్యపేట చూపెడ్తాను.

వెళ్దామా అమ్మా... ఇటు కొయ్యలగూడెం మీదుగా వెళ్దాం. దగ్గరవుతుంది... మళ్ళీ మీరటేపు ఎల్లిపోదురు గాని, నేనిటొస్తాను...'' అతడి కళ్ళల్లో ఏదో తళుక్కున మెరిసింది,

విస్తుపోయి చూశాన్నేను.

''ఒక్క రామయ్య్య పేటనేం? సూడాల్సిన వూళ్ళెన్ని లేవు? ఇంటావిడ గొంతులో ఏదో సామూహిక కసి విన్పడింది. చిన్న కూతురి సాయంతో వంట ముగించి మా అందరికీ ప్లేట్లు అమరుస్తున్న తీరు కూడ కసిగానే వుంది. మొత్తంగా ఆమె ప్రతి పనిలోనూ, మాట్లాడుతోన్న తీరులోనూ కసి కన్పిస్తూనే ఉంది.

''నాన్న వారానికోసారయినా మా ఊరెళ్ళ చూసి వస్తుంటారు. అంతంత భ్రమలు అవసరం లేదనీ, ప్రభుత్వా లెప్పుడూ పేద ప్రజల పక్షం కాదనీ అమ్మ ఉద్దేశం. అభివృద్ధి అంటే ఉన్న జీవికను లాగేసుకుని ఊర్నుండి వెళ్ళ గొట్టడమేనా అంటుంది అమ్మ...'' అలా చెప్పడంలో తల్లిదండ్రులిద్దరి మీద ఎనలేని ప్రేమ విన్పించింది సృజన గొంతులో. మొత్తం మీద ఇంటావిడ పైకి కన్పిస్తోన్న మామూలు గృహిణి మాత్రం కాదని అర్థమయింది నాకు.

* * *

ఊళ్ళు మునిగిపోడమంటే బతుకులు మునిగిపోవడమేనని పూర్తిగా అర్థమయింది... ఎన్నెన్నో వనరులు, వృక్షజాతి, పక్షిజాతి మొత్తంగా గిరిజనులకు వివిధ రకాలుగా జీవికనిచ్చే వేల ఎకరాల అడవి నీట మునిగిపోతుంది... అడవి బిడ్డలు, వృత్తి పనివాళ్ళు, సన్నకారు రైతులూ, వ్యవసాయ కూలీలు అంతా బతుకుల్ని కోల్పోతారు. అభివృద్ధి కింద ఇన్ని లక్షల మందిని సమాధి చేసి ప్రాజెక్టులు ఆధునిక దేవాలయాలంటూ పెద్ద పెద్ద మాటలు చెప్తారు నాయకులు... గత యాభయ్యేళ్ళలో కొన్ని కోట్ల మంది ప్రజలు అభివృద్ధి కింద నిలవ నీడ లేకుండా గాలికి కొట్టుకుపోయారని చరిత్ర చెబుతోంది. నిజానికివి దేవాలయాలు కావు.. సామూహిక సమాధులని, ఇలా అక్కడక్కడా నేను చదివిన వార్తలు ముక్కలు, ముక్కలుగా కొన్ని అర్థమయ్యా, కానట్లుగా నా మనోఫలకం మీద నుంచి మాయమవుతూ ఉన్నాయి.

కారు వేగంగా పోలవరం వైపు దూసుకుపోతోంది.

రామయ్యపేట పోలవరం పంచాయితీ లోని ఏకైక గ్రామం.

''పోలవరం వల్ల కొత్త ఆయకట్టు వస్తుందనుకుంటే అది నిజం కాదు, భ్రమే నమ్మా.... అదీకాక కుడి కాలువ నుండి కృష్ణా బ్యారేజీకి తీసికెళ్ళే నీళ్ళలో వారి వాటాగా మహారాష్ట్రకి కొంత, కర్ణాటకకు కొంత ఇవ్వాల్సుంటుంది. ఏ.పి.కి వచ్చే 22 టిఎంసిల నీళ్ళు రాయలసీమకు వెళ్ళాల్సి ఉంటుంది న్యాయంగా. నిజానికి ఇక్కడికంటే గోదారి తెలంగాణ ప్రాంతంలో ఎక్కువగా డెబ్బయ్యయిదు శాతం క్యాచ్‌మెంట్ ఏరియాలో ప్రవహిస్తోంది... దీనివల్ల అక్కడి అయిదు జిల్లాల నంగతేమోగానీ, ఖమ్మం జిల్లాలో భద్రాచలం డివిజన్‌కి భారీ నష్టం జరిగిపోతుంది. చెప్పొచ్చో, చెప్పరాదో గానండి దీనివల్ల ఎక్కువగా లాభపడేది మాత్రం కోస్తాంధ్రలోని పెద్ద రైతులే... వారి కోసమే కదండి కోట్ల ఖర్చుతో లిఫ్ట్‌ల ఏర్పాటు జరిగిపోయింది. ప్రాజెక్టు పూర్తయితే ఇవుండవు. తాడిపూడి, పుష్కరం, ఏలేరు ఇప్పుడీ పట్టిసీమ అన్న వృథా అయిపోతయి ప్ప..''

గాలిలో గిరికీలు కొడుతూ, కాలువ నీటిలో తేలియాడుతూ ముందుకెళ్ళడానికి ప్రయత్నిస్తోన్న ఎండుటాకులా ఉన్నాడతడు. ముడతలు పడుతోన్న అతడి ముఖంలో, జీవం లేకుండా ఉన్న ఆ కళ్ళలో చిన్ని ఆశ ఏదో మెరుస్తూనే ఉంది ఇంకా.

అశోక్ మా మాటల్ని శ్రద్ధగా వింటూ ''మా వాళ్ళు దేవరగొండిలో ఉన్నారండి... ఇప్పుడటేపెల్తామేంటండి?'' అడిగాడు సత్యంగారిని... ఆ మాటంటూనే 'మనకి ఆలశ్యమవుద్దేమోనండి' అన్నట్టుగా నావైపు చూశాడు.

నాకు మాత్రం ఏదో కొత్త ప్రపంచంలోకి వచ్చినట్లుగానూ, నా రోజువారీ ఈతిబాధలు చాలా నెగ్లిజబుల్‌గానూ అర్థం కాసాగింది...

కొత్త రామయ్యపేట పాత రామయ్యపేటకి పది పన్నెండు కిలోమీటర్లలోపే ఉంది... ముందు మేము కొత్త రామయ్యపేటలో ఆగాం. కొత్త రామయ్య పేటలో పెద్ద రైతుల ఇళ్ళన్నీ విడిగానూ, పునర్నివాస కేంద్రం మరికొంత దూరంలోనూ ఉంది. అక్కడ కారాపి సృజన, సృజన తండ్రి దిగగానే పాత బంధువులు వచ్చినట్లుగా అంతా వారిని చుట్టుముట్టారు... దుమ్ములేస్తోన్న మట్టిరోడ్లతో మరా ఎడారిలా ఉంది ఈ ప్రాంతం.

''ఇంకా ఇక్కడ డ్రైనేజీలు కట్టనేలేదన్నయా. అక్కడ పెద్ద రైతులకు మాత్రం వెంటనే కట్టేశారు కదన్నయా.. రేత్రీ, పాగలూ దోమల్తో చచ్చిపోతన్నామనుకో...'' తమ గోడు, గోస వెళ్ళబోసుకోవడానికి దేవుడు దొరికినట్లుగా సమస్యలన్నీ కలగాపులంగా విన్పించసాగారు వాళ్ళంతా,

సృజన ఆడవాళ్ళని పలకరిస్తూ తనకి తెలిసిన వాళ్ళ గురించి పరామర్శిస్తోంది...

''గోదాట్ని మాకు దూరం సేసేరు గదా... సేతిలో పన్లేకుండా పోయింది. పనేమీ లేకుండా నోట్లోకి ముద్దెలా ఎల్తంది'' ఒకామె కళ్ళ నీళ్ళ పర్యంతమైంది.

''ఇక్కడికి గోదారి పది పన్నెండు కిలోమీటర్లుంటుంది... మగాళ్ళు సైకిల్ మీదో, ఆటో మీదో ఎల్లి గోదాట్లో తడుములాడుతున్నారు గానీ ఆడోరు ఇంటికాడే ఉండిపోయారు. పనిలేకపోవడం వారిని బంధిస్తోంది. ఐటిడిఏ వాళ్ళు కొంత మందికి పశువుల్నిచ్చారు గానీ ఇక్కడ మేత లేకపోవడంతో పెంచలేకపోయారు. ఆటోలిస్తామన్నారు గానీ వూరికొక్క ఆటో మాత్రమే రిలీజయింది...'' పరిహారాలు సమాన స్థాయిలో లేకపోవడమనేది అందరిలోనూ అంతరాలని, అపనమ్మ కాలనీ, అసమానాన్నీ పెంచుతోందని అర్థవవుతోంది. వాళ్ళందరితోనూ మాట్లాడుతూ, ఓదారుస్తూ, తాను ఓదార్పు పొందుతూ సత్యంగారు ఒక విధమైన పారవశ్యంలో ఉన్నారు.

నేను సృజన కేసి చూశాను.

ఆ పిల్ల కళ్ళల్లో ఏదో తెలీని నమ్మకం, ఆశ.

చిన్నదో, పెద్దదో సాధ్యమో, అసాధ్యమో, దురాశో, అత్యాశో, ఆశ తప్ప

జీవితం మరేముంది? అన్నట్టు చాలా నిబ్బరంగా ఉందామ్మాయి... ఎంతసేపు అలా గడిచిందో తెలీదుకానీ అందరికీ వీడ్కోలు చెప్పి మేము మళ్ళీ కారెక్కాం.

"కొత్త దేవరగొండిలో పదే పది నిముషాలు ఆగుదామా అండి. మా వాళ్ళున్నారు. అసలు దేవరగొండి అంతా కోయలేనండి. బొంగరం ఎంకటలచ్మి అని నిర్వాసితుల తరపున పని చేస్తోందండి... ఒకసారి కలిసి మాట్లాడొస్తాను" బతిమాలుతున్నట్టుగా అడిగాడు అశోక్...

పర్మిషనిస్తున్నట్టుగా నవ్వాన్నేను. అప్పటికే అయిదయింది గంట.

కొత్త దేవరగొండి దాటి మరికొంత దూరమెళ్ళేసరికి ప్రాజెక్టు కోసం విధ్వంసం చేసిన ఊళ్ళ తాలూకూ శిథిలాలు మానవ నిర్మిత కొండల్లాగా చాలా ఎత్తుగా వరుసలు, వరుసలుగా ఆహ్వానిస్తున్నాయి... నిరంతరాయంగా అటు, ఇటు ప్రయాణిస్తోన్న జె.సి.బి.లూ, జీపులూ, కార్లూ, అదంతా చూస్తోంటే ఇక ఈ ప్రాజెక్టు ఆపడం సాధ్యమైనదేనా? అన్పిస్తోంది. ఆ స్థాయి నుండి చాలా దూరం వెళ్ళిపోయారు కాబట్టి, కనీసం ముంపు ప్రాంతాల వారికి, నిర్వాసితులకు తగిన సౌకర్యం కల్పించి, వారిని అనాథలు కాకుండా అప్పుడు ఇచ్చిన హామీలనన్నింటినీ ప్రభుత్వం అమలు పరిస్తే చాలునన్పించింది.

ఉన్నట్టుండి అతడు వూగిపోతూ "ఇదిగో ఇక్కడే ఉండేదండి నా పొలం... బంగారం, బంగారం పండేది... నా పొలం బంగారం..." అన్నారు ఉద్వేగంతో...

వెనక సీట్లో కూర్చున్న సృజన ముందుకొంగి తండ్రి భుజాల మీద చేతులు వేసింది, అతడి ఉద్వేగాన్ని చల్లబరుస్తూ. ఒక విధంగా సృజన కూడ ఉద్వేగంగానే ఉంది. ఎందుకోగాని ఇందాక గోదారిని మాకు దూరం సేసేరండి" అంటూ ఏడ్చిన పారమ్మ నా కళ్ళముందు నిలిచింది.

ఇది కేవలం ఒకరి దుఃఖమూ, ఒకరికి సంబంధించిన విషాదమూ కాదు. అందరి దుఃఖమూ అదే... కాలం గడిచి ప్రాజెక్టు వ్యయం పెరిగినప్పుడు ఎల్లగొట్టే వాళ్ళకిచ్చే పరిహారమూ పెరగాలి కదా అని.

వీరి మానసిక క్షోభనీ, భావోద్వేగాలనీ, అభద్రతనీ ఎవరయినా అర్థం చేసుకోగలరా? నిలుచున్న భూమితో, నివసించిన ఇంటితో, ఇంటి చుట్టూ అల్లుకున్న పచ్చాదనంతో వీరికున్న లోతయిన అనుబంధాన్ని ఎవరయినా తూకం వేయగలరా? ఇక్కడందరి గోడు ఎవరు పట్టించుకుంటారు? మా అందరి కోసం మీరు త్యాగం చేస్తున్నారు. మా లాభాలతో మీకు భాగం పంచుతామంటూ ఎవరయినా వారిని దగ్గరికి తీసుకోగలరా?

"అదిగో ఆ వైపునే మా ఇల్లు... పక్కనే పశువుల కొట్టం" చెప్పింది "ఎన్నెన్ని పూలమొక్కలుండేవో, అన్నీ తొవ్వేసేరండి... అమ్మ, బామ్మ అయితే చాల కూరల మొక్కలు పెంచేవారు..." అక్కడ్నుండి లేపేసిన నాటి దుఃఖాన్ని వాళ్ళు మళ్ళీ తలచుకుని ఊరడిల్లుతున్నట్టుగా ఉందామ్మాయి.

ఎవరో ఆపమన్నట్లుగా పొలం వద్ద కారాపాడు అశోక్. అందరం కిందికి దిగాం ఎవరో మంత్రించినట్టుగా.

అప్పటికే అక్కడొక వ్యక్తి కూర్చుని ఉన్నాడు.

గుప్పెళ్ళతో నల్లరేగడి మట్టిని పోగు చేస్తూ, కాలు దూర్చి ఇసుక గూళ్లలా మట్టితో గూళ్లు కట్టడానికి ప్రయత్నిస్తూ తనలో తను ఏదో మాట్లాడుకుంటూ ఉన్నాడు. మా రాక అతడికేమీ అంతరాయం కలిగించినట్లుగా లేదు. కానీ అతడికి దూరంగా కూర్చుని ఆకాశం కేసి చూస్తూ ఏడుస్తుందని కుక్క ఒకటి పరిగెత్తుకుంటూ వచ్చి సత్యంగారి ఎద మీద తన ముందరి కాళ్ళను మోపింది... అతని చుట్టూ వెనక్కి, ముందుకీ తిరుగుతూ ముద్దులాడింది. మధ్య మధ్యలో సృజనని పలకరిస్తూ ఆయాసపడుతోంది.

అందాకా మట్టితో ఆడుకుంటోన్న ఆ అనామకుడు ఉన్నట్టుండి పైకి లేచి మట్టిని ఆకాశంలోకి విసురుతూ నాట్యం చేయసాగాడు. మధ్య మధ్యన భూమిని తంతున్నాడు పాదాలతో, మళ్ళీ కిందికి వొంగి అరచేతులు తాకించి కళ్ళకద్దుకుంటున్నాడు... అప్పటికి పొద్దువాలుతోంది.

మా డ్రైవర్ అశోక్ ఉన్నట్టుండి ఏదో ఆవరించిన వాడిలా పైకి లేచి మట్టిని ఆకాశంలోకి విసురుతూ అపరిచితుడి పక్కనే, అలాగే నాట్యం చేయసాగాడు. సరిగ్గా అప్పుడే ఎక్కడ్నుండి వచ్చాయో మూడు ఆవులు, రెండు గేదెలు మెల్లిగా నడుచుకుంటూ వచ్చి నేలకు తలనానుస్తూ మోరలెత్తి ఆకాశంలోకి చూస్తూ కన్నీరు కార్చసాగాయి. ద్రవీభూతమయిన ఆ దృశ్యం నిజంగా వర్ణనాతీతం.

ఆ నృత్యం, ఆ అనామకుడి పాట ఎన్నో ఏళ్ళుగా ప్రాజెక్టుల కింద కప్పెట్టబడిన, తన పూర్వీకులనందరినీ పేరు పేరునా పిలుస్తున్నట్లుగా ఉంది. ఉన్నట్టుండి సత్యంగారు భోరు భోరుమంటూ తువ్వాలు ముఖానికడ్డం పెట్టుకుని ఏడవసాగాడు. నేను పొద్దున్న చూసినప్పటి నుండీ ధీర గంభీరంగా ఉన్న ఆ వ్యక్తి. ఎకరాల కొద్దీ సేద్యం చేసి, పుట్లకొద్దీ ధాన్యం పండించి వూరికంతటికీ అన్నం పెట్టిన వ్యక్తి, జీవన క్రమంలోని అనేక కష్టనష్టాల కోర్చి గండ శిలలా మారిన వ్యక్తి అలా ఏడవడం జీర్ణించుకోవడం సాధ్యం కాలేదు.

సృజన తండ్రిని చేతుల్లోకి తీసుకుంది.

ఒక్కసారిగా స్పృహలోకొచ్చాన్నేను. నేనెక్కడున్నాను? ఏం చేస్తున్నాను? అసలెందుకొచ్చానిక్కడికి? వీళ్ళతో నాకేంటి సంబంధం కడుపులోలోపలి నుండి ఏదో దుఃఖపు తెర నన్నల్లుకు పోసాగింది.

హఠాత్తుగా సృజనని తండ్రి నుండి పక్కకి జరిపి గాఢంగా కౌగలించుకున్నాన్నేను. మా హృదయాలేవో మాట్లాడుకున్నట్టే ఉన్నాయి.

కారులో షికారు కెళ్లే పాలబుగ్గల పసిడీ దానా" అంటూ నా ఫోను నిరంతరాయంగా మోగుతోంది.

"థాంక్యూ ఆంటీ" చెప్పింది సృజన.

"ఆంటీ కాదు అత్తమ్మ" అన్నాన్నేను గుసగుసగా.

ఆనయిన నా ఫోన్లోనుండి

"సునీతా॰ మే సునీతా॰" అంటూ అమ్మ అరుస్తోంది.

సెల్‌ఫోన్లో అమ్మ ఎప్పుడూ అరిచినట్లే మాట్లాడుతుంది.





# రాడికల్ వర్ధనరావు

వరవరరావు

అమలాపురంలో బొజ్జా తారకం గారి సంస్మరణ సభలో పాల్గొని తిరుగు ప్రయాణంలో ఉన్నాను. తెలతెలవారకుండానే సిఎస్ఆర్ ప్రసాద్ నుంచి ఎస్ఎంఎస్. పి.జె. వర్ధనరావు రాత్రి ఒంటి గంటకు గుండెపోటుతో మరణించాడు అని. నిన్ననే కదా, నిన్న ఏమిటి, తారకం గారు చనిపోయిన నాటి నుంచి పిజె వర్ధనరావు గారి గురించి నేను మాట్లాడిన ప్రతిచోటా ప్రస్తావిస్తున్నాను. 1992 నుంచి ఆయన కన్నుమూసే దాకా చుండూరు మారణకాండ తారకం గారికి ఎజెండాలో ఉన్నది. చుండూరు దళిత ఉద్యమ విజయాపజయాల్లో ఆయన మేధస్సు, గుండె అలసిపోయాయి. అటువంటిదే పిజె వర్ధనరావుకు చుండూరుతో ఉన్న అనుబంధం. అది తెనాలికి, చుండూరుకు, అది అయితా నగర్‌కు, చుండూరుకు, అది దళిత పాంథర్స్‌కు, పిజె వర్ధనరావుకు, చుండూరుకు ఉన్న రక్తబంధం. వర్గ బంధం కూడా.

చుండూరు రాచపుండుకు శస్త్రచికిత్స జరిగేదాకా, రోహిత్ వేముల స్మృతిబద్ధ హత్యకు న్యాయ ప్రతీకారం తీర్చుకునేదాకా, రత్నం సూర్యవర్మ విప్లవ స్వప్నం సాకారమయ్యే దాకా ఇవాళ అయితానగర్ మట్టిలో శాశ్వత నిద్రలో ఉన్న వర్ధనరావు గుండె ఆటుపోట్లు ఆగుతాయని నేను నమ్మలేను.

తారకం గారి గురించి రాస్తూ, 1992 చుండూరు మారణకాండ తరువాత అక్కడికి వెళ్లి నిందితుల భూములు స్వాధీనం చేసుకొని బాధితులకు పంచాలని చెప్పి వస్తూ విరసం సభ్యులం, తారకం గారు, మరికొందరు ప్రజాస్వామిక, దళిత వాదులు తెనాలిలో తారకం గారిని అధ్యక్షులుగా, స్థానికంగా ఉండి, అయితానగర్‌లో చుండూరు బాధితుల పునరావాసం చూస్తున్న పిజె వర్ధనరావుగారిని కన్వీనర్‌గా ఏర్పాటు చేసి వచ్చామని, ఆ మరునాడే అప్పటి శాసనసభ స్పీకర్ ఆలపాటి ధర్మారావు ఆయన ఇంటి మీద దాడి చేయించాడని ప్రస్తావించాను.

ఇటువంటి సందర్భాలు వర్ధనరావు గారి జీవితంలో ఎన్నిమార్లు వచ్చాయో. ఎన్నిమార్లు ఆయన మీద దాడులు, చిత్రహింసలు, అరెస్టులు, హత్యా ప్రయత్నాలు జరిగాయో. ఎందుకంటే ఆఖరిశ్వాస దాకా కూడా ఆయన విప్లవ భావజాలం మీద, విప్లవోద్యమం మీద అచంచలమైన విశ్వాసం పెట్టుకున్నాడు. తన చుట్టూ ఉండే సమాజాన్ని అందులో భాగం చేయాలనుకున్నాడు.

నక్సల్బరీ ఉద్యమం నేపథ్యంలో ఆ ఉద్యమం సెట్‌బ్యాక్‌కు గురైన తరువాతనే బొంబాయిలో దళిత్ పాంథర్స్ ఏర్పడి, అది మహారాష్ట్ర అంతా విస్తరించి ఎమర్జెన్సీ దాకా కూడా అద్భుతమైన పాత్ర నిర్వహించింది. తనకు తానుగా తెనాలిలో దానికొక శాఖను ఏర్పాటు చేసి ఆ ఉద్యమాన్ని విప్లవోద్యమంలో భాగంగా నిర్వహించినవాడు వర్ధనరావు. ఆయన రాజకీయ, సాహిత్య, సాంస్కృతిక కార్యకలాపాలు అట్లా ప్రారంభమయ్యాయి. నామ్‌దేవ్ ధసాల్ నాయకత్వంలో దళిత్ పాంథర్స్ ఏర్పడిన తరువాత దళిత్ పాంథర్స్ మానిఫెస్టోను అనువాదం చేసి అయితా నగర్ మొదలుకొని తెనాలి ప్రాంతంలో దళిత యువతరాన్ని చైతన్యవంతం చేయడానికి బృందాలుగా ఏర్పాటు చేసి, గ్రామాలు తిరిగి ఎన్నో ఉద్యమాలు నిర్మాణం చేశాడు. అందుకే పోలీసులు, ప్రభుత్వం మాత్రమే కాదు, భూస్వామ్య, పెత్తందారీ వ్యవస్థ, బ్రాహ్మణీయ హిందుత్వ వ్యవస్థ ఆయన మీద కక్ష కట్టింది. పోలీసులు మాత్రమే కాదు, అగ్రవర్ణ, రాజకీయ రౌడీలు కూడా ఆయన మీద దాడులు చేశారు. బెదిరించారు. వర్ధనరావు సహచరి కర్లపూడి రత్నమ్మ స్కూల్ టీచర్‌గా ఆయనకు సహకరిస్తూ ఆయనకు అండగా నిలబడింది.

చిన్నతనంలోనే పోలియో వచ్చి కుడికాలు పూర్తిగా పడిపోయింది. కుడికన్ను కనిపించదు. ఇటువంటి శారీరక వైకల్యంతో కూడా ఎంతో దృఢమైన వ్యక్తిత్వం కలిగిన శక్తిగా ఆయన నిలిచాడు. అందరూ 'మాస్టారు' అని పిలుచుకునే కామ్రేడ్ పిజె వర్ధనరావు తాను దళిత పాంథర్స్‌ను విస్తరించిన క్రమం నుంచి ఎన్నోమార్లు ప్రభుత్వ నిర్బంధాలను, జైలు శిక్షలను అనుభవించాడు.

ఇరవై ఏళ్లకే ఎం.ఎ. పూర్తిచేసి, స్థానిక వివిఎస్ఆర్ & ఎన్‌విఆర్ కాలేజీలో ఇంగ్లిష్ లెక్చరర్‌గా చేరి, విద్యార్థులతోనే కాదు ఆయనతో సంబంధంలోకి వచ్చిన ప్రతి ఒక్కరితో మాస్టారు అనిపించుకున్న అద్భుతమైన విప్లవ మేధావి ఆయన.

నాటకాలు, నాటికలు రచించి, ప్రయోక్తగా, దర్శకుడుగా దర్శింపజేసి, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించి, వక్తగా, సాహిత్య ఉద్యమం మార్గదర్శిగా ఆయన 1978 నాటికే ఎంత ఎత్తుకు ఎదిగిపోయాడంటే, 1978 మే లో గుంటూరులో ఏర్పడిన రాడికల్ యువజన సంఘం మహాసభల్లో ఆయన మొదటి

అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు. 1978 ఫిబ్రవరిలో వరంగల్‌లో జరిగిన ఆర్ఎస్‌యు రెండవ మహాసభలతో పాటు విద్యార్థి యువజనులకు 'గ్రామాలకు తరలండి' పిలుపు ఇచ్చి తెలుగు సమాజంలో ఒక లెజండరీ ప్రజాసంస్థగా పనిచేసిన ఆర్‌వైఎల్‌కు ఆయన 1980 దాకా అధ్యక్షుడుగా పనిచేశాడు. ఎమర్జెన్సీ తరువాత 1978లో చీరాలలో జరిగిన విరసం మహాసభల్లో విరసం సభ్యుడిగా చేరాడు. 1978 నుంచి 85 వరకు విప్లవోద్యమంలో విద్యార్థులకు, యువజనులకు గతితార్కిక భౌతికవాదం గురించి, మార్క్సిజం-లెనినిజం-మావోయిజం గురించి పాఠాలు చెప్పడానికి తెలంగాణ, ఉత్తరాంధ్రలతో సహా ఆయన తిరగని ప్రాంతం లేదు. శారీరక వైకల్యం ఉండి కూడా పాఠాలు చెప్పడానికి మాత్రమే కాదు, అవి నెల్లూరు (1981), కరీంనగర్ (1983) రైతు కూలీ సంఘం సభలు కావచ్చు, విప్లవ ప్రజాసంఘాలకు సంబంధించిన ఏ సభలైనా కావచ్చు, సభల కన్నా ముందు పది పదిహేను రోజుల ముందే సిఎస్ఆర్ ప్రసాద్‌తో పాటు వచ్చి సభల ఏర్పాట్లు, ప్రజాసంఘాల కార్యకర్తలతో సంబంధాలు, వాలంటీర్లతో సంబంధాలు నెరిపే నేపథ్య కార్యక్రమాల్లో కూడా పాల్గొనకుండా జరిగేది కాదు.

1975 ఎమర్జెన్సీలో గుంటూరు జిల్లాలో ఏ మూల ఏ సంఘటన జరిగినా వర్ధనరావును అరెస్టు చేసేవారు. ఎమర్జెన్సీ కాలంలో కట్టేవరం వంతెన కింద ఆ వంతెనను కాల్చడానికి కిరోసిన్ డబ్బాలతో కూర్చున్నారనే నెపంపెట్టి అరెస్టు చేశారు.

ఈ సందర్భంగా నా ప్రత్యక్ష అనుభవంలోని రెండు విషయాలు ప్రస్తావించాలి. 1979లో ఖమ్మంలో జరిగిన రాడికల్ యువజన సంఘం రెండో మహాసభల కన్నా ముందు ప్రతి జిల్లా ఆర్‌వైఎల్ సభలకు కూడా ఆయన రాష్ట్ర అధ్యక్షుడుగా హాజరవుతుండేవాడు. అటువంటి సభ ఒకటి 1979 ఏప్రిల్ నెల ఆఖరులో మందమర్రిలో జరిగింది. ఆ సభకు ఆయన అధ్యక్షుడు. ఆ సభ ఏర్పాటు చేసినవాళ్లలో గజ్జెల గంగారాం, పెద్దిశంకర్ వంటి విప్లవోద్యమంలో తరువాత కాలంలో ప్రసిద్ధులై అమరులైన వారు ఉన్నారు. వాళ్లంతా అప్పుడు సింగరేణి కార్మికుల బిడ్డలు, ఆర్‌వైఎల్ కార్యకర్తలు. సభలో నేను మాట్లాడుతూ ఉండగా కరెంట్ ఆఫ్ చేసి పోలీసులు లాఠీచార్జ్ చేస్తూ వేదిక మీదికి వచ్చి మమ్ములను అందరినీ కొడుతూ అరెస్టు చేశారు. అట్లా మా మీద మందమర్రిలో హత్యా ప్రయత్నపు కేసు మోపారు. ఆ తరువాత కాలంలో నన్ను కొట్టి, లాఠీచార్జ్ చేసిన పోలీసు అధికారి క్షమాపణ చెపుతూ లేఖ రాసినప్పటికీ ఆ కేసు కోసం మేం కోర్టుకు తిరగాల్సి వచ్చేది. గజ్జెల గంగారాం, పెద్దిశంకర్ కొద్దికాలంలోనే అజ్ఞాత జీవితానికి వెళ్లిపోయారు.

1985లో గుంటూరు పట్టణంలో గోరంట్ల అనే ప్రాంతంలో ఒక గదిలో బాంబు పేలి ఆ గది కూలిపోయింది. అది పెద్ద సంచలనం అయింది. నేను, సిఎస్ఆర్ ప్రసాద్ మద్రాస్‌కు ఏదో పని మీద వెళ్లి ఉదయమే గుంటూరులో దిగి, సిఎస్ఆర్ ఇంట్లో ప్రవేశిస్తున్నాం, ప్రసాద్ సహచరి నల్లూరి రుక్మిణి "జిల్లా అంతటా రాడికల్స్‌ను, విరసం వాళ్లను అరెస్టు చేస్తున్నారు. గందరగోళంగా ఉన్నది. మీరిట్లా వచ్చారేమిటీ?" అన్నది. మేమిద్దరం తప్పుకుని హైదరాబాద్‌కు వచ్చేశాం. రెండు మూడు రోజులు పోయాక తెలిసిందేమిటంటే ఈ ఘటన జరగగానే పిజె వర్ధనరావును అరెస్టు చేసి, హైదరాబాద్‌కు తీసుకువచ్చి ఎసిగార్డ్స్‌లో రోజుల తరబడి నిర్బంధించి, చిత్రహింసలు పెట్టి, గోరంట్ల బాంబు కేసు అని పెట్టి జైలుకు పంపారు. 1980లో ఏర్పడిన సిపిఐ (ఎంఎల్) (పీపుల్స్‌వార్) గుంటూరు జిల్లా కార్యదర్శి చింతల వెంకటస్వామి (సూర్యం) గారికి పిజె వర్ధనరావు చాలా సన్నిహితుడని, గుంటూరులో ఈ బాంబు పేలిన గది సూర్యం గారు ఉపయోగించుకుంటున్న ఒక డెన్ అని పోలీసుల అనుమానం. అయితా నగర్‌లో, తెనాలిలో పీపుల్స్‌వార్ కార్యకలాపాలకు, లేదా పీపుల్స్‌వార్ భావజాలానికి పిజె వర్ధనరావు ఒక చిరునామా అనేది పోలీసులకే కాదు, భూస్వామ్య పెత్తందారీ వ్యవస్థకూ ఒక బలమైన అనుమానం.

నేను ఆరంభంలో రోహిత్ వేములతో పాటు రత్నం సూర్యవర్మ ప్రస్తావన కూడా తెచ్చాను. రోహిత్ వేముల గురించి ఇవాళ నేను ఎవరికీ చెప్పవలసిన అవసరం లేదు. ఈ రత్నం సూర్యవర్మ ఎవరు అని ఎవరికైనా అనిపించవచ్చు. ఎమర్జెన్సీలో తెనాలి పరిసర ప్రాంతాలలోనే అరెస్టు చేసి నెల్లూరు జిల్లా తెట్టు దగ్గర తీసుకువెళ్లి బూటకపు ఎన్‌కౌంటర్‌లో పోలీసులు చంపేసిన విప్లవకారుడు అతడు. జయరావు వంటి మరికొందరు మహదేవ్ ముఖర్జీ గ్రూప్‌కు చెందిన విప్లవకారులతో పాటు చెరుకుపల్లి పోలీసు స్టేషన్‌పై దాడి చేసి, తుపాకులు ఎత్తుకుపోయిన వాళ్లలో రత్నం సూర్యవర్మ ఉన్నాడు. పిజె వర్ధనరావుకు అత్యంత ప్రేమాస్పదుడైన స్నేహితుడు. పరస్పర ప్రభావాలున్న వ్యక్తులు. గుంటూరులో రాడికల్ యువజన సంఘం మహాసభలు 1977 మే నెలలోనే జరగాల్సి ఉండే. ఈ చెరుకుపల్లి పోలీసు స్టేషన్‌పై దాడి వల్లనే ఆ సభలు వాయిదా పడ్డాయి. పిజె వర్ధనరావు గారు ఆ రత్నం సూర్యవర్మ తీసుకున్న విప్లవ వైఖరితో విభేదించాడు గాని, ఆయన విప్లవ స్వప్నం నిష్కల్మశమైంది, నిఖార్సైందని ఆయన స్పష్టంగా నమ్మాడు.

1984లో విప్లవ రచయితల సంఘం ఆలకూరపాడులో ప్రజాకళల వర్క్‌షాప్ నిర్వహించింది. 1984లోనే మొదటిసారిగా విరసం వివిధ సాహిత్య ప్రక్రియలలో వర్క్‌షాప్ నిర్వహించాలనే కార్యక్రమాన్ని చేపట్టింది. ఒక వారం రోజులపాటు కళ్యాణరావు, ఆలకూరపాడు విప్లవాభిమానుల ఆధ్వర్యంలో నిర్వహింపబడిన ఈ వర్క్‌షాప్‌కు పిజె వర్ధనరావు గారు ప్రిన్సిపల్‌గా వ్యవహరించారు. ఆ వర్క్‌షాప్‌లో త్రిపురనేని మధుసూదనరావు గారు నాటకోపన్యాసాలు ఇచ్చారు. నాటకం, నాటిక రచన, ఒగ్గు కథ, బుర్ర కథ, స్ట్రీట్ ప్లే వంటి వివిధ ప్రక్రియలపై వల్లంపట్ల, కాకరాల, సుమతి మొదలైన నిపుణులతో శిక్షణా కార్యక్రమాలు ఈ వర్క్‌షాప్‌లో ఇవ్వబడినాయి. వారం రోజుల వర్క్‌షాప్ తరువాత బహిరంగ సభలో కేవలం విరసం సభ్యులే చెరబండరాజు 'గంజి నీళ్లు' నాటిక ప్రదర్శించారు. ఈ చరిత్రాత్మకమైన వర్క్‌షాప్‌కు వర్ధనరావు గారు ప్రిన్సిపల్‌గా వ్యవహరించారంటేనే ఆయన బహుముఖమైన ప్రజ్ఞను, విప్లవ సాహిత్య, సాంస్కృతికోద్యమంపై ఆయనకున్న పట్టును అర్థం చేసుకోవచ్చు.

ప్రగాఢమైన క్రైస్తవ మత విశ్వాసాలున్న ఒక దళిత క్రైస్తవ కుటుంబంలో వర్ధనరావు అక్టోబర్ 2, 1947లో పుట్టాడు. తల్లి కర్లపూడి అన్నమ్మ, తండ్రి జేసుపాదం ఇద్దరూ ఉపాధ్యాయులే.

ఐదుగురు సంతానంలో వర్ధనరావే పెద్దవాడు. ముగ్గురు కొడుకుల్లో చిన్నవాడు మోసెస్ చిన్నతనంలోనే చనిపోయాడు. వర్ధనరావు డిగ్రీ వరకు తెనాలిలోనే చదువుకున్నాడు. ఎంఎ ఇంగ్లిష్ చదవడానికి మాత్రమే ఆంధ్రా యూనివర్సిటీకి వెళ్లాడు. సరిగ్గా అప్పటికి ఆయన వయస్సు నవయవ్వనంలో ప్రవేశిస్తున్నది. నక్సల్బరీ, శ్రీకాకుళ ఆదివాసీ రైతాంగ పోరాటాలు కూడా అప్పుడప్పుడే నవనవోన్మేషంగా రగుల్కొంటున్నాయి. సహజంగా ఆయన ఆ భావాల వైపు ఆకర్షితుడయ్యాడు. ఇరవయ్యవ సంవత్సరానికే తెనాలిలో లెక్చరర్‌గా చేరి, జీవితమంతా విద్యార్థులకు బోధిస్తూనే ఉన్నాడు. కాలేజీలో మాత్రమే కాదు, తెనాలిలో నలుగురు కూడే చోట, ఆయన అడ్డాలలో, చాయ్ హోటల్లో, ఇంట్లో ఎక్కడ అయినా అది ఒక పాఠశాలనే. ఆ పాఠశాలలో ఆయనే మాస్టారు.

1985లో గోరుట్ల బాంబు కేసు సందర్భంగా పెట్టిన చిత్రహింసలు, కేసు తరువాత ఆయన ఆరోగ్యం దెబ్బతిన్నది. ఆ తరువాత ఇంక ఆయన ఎక్కువగా తిరగకుండా తెనాలికే పరిమితం అయ్యాడు. 1985లో కారంచేడు మారణకాండ సందర్భంలోను, తిరిగి 1992లో చుండూరు మారణకాండ సందర్భంలోను తెనాలి, గుంటూరు జిల్లాల్లో క్రియాశీలంగా పనిచేయడం మినహాయించి, గత ముప్పై సంవత్సరాలుగా ఆయన ఎక్కువగా తెనాలికే పరిమితమై ఉన్నాడు కాని, ఎన్నడూ ఉద్యమ జీవితం నుంచి పక్కకు జరగలేదు. విద్యార్థి, యువజనులను, ముఖ్యంగా దళితులను విప్లవోన్ముఖంగా చైతన్యం చేసే విషయంలో ఆయన జీవితాన్నంతా ఆరోగ్యాన్ని కూడా లక్ష్య పెట్టకుండా కొవ్వొత్తి వలె కరిగించాడు. తెనాలిలోనే గర్భదరిద్రంతో వీధిలో హోటల్ పెట్టుకొని బతుకుతూ 'మంచీ చెడూ', 'పరిసరాలు', 'ఏది సత్యం?' వంటి నవలలు, మరెన్నో కథలు రాసిన శారద (నటరాజన్) సాహిత్య సర్వస్వాన్ని ప్రచురించాలనే పూనికతో శారద సాహిత్య వేదికను ఏర్పాటు చేసి, చివరి దాకా ఆయన అధ్యక్షుడుగా వ్యవహరించాడు.

వర్ధనరావు నిత్య జీవితాచరణ చాలా మందికి తెలియక పోవచ్చు కాని, ఉద్యోగంలో చేరిన దగ్గర నుంచి కన్నుమూసే దాకా నలభై మంది వృద్ధులకు క్రమం తప్పకుండా తన జీతం నుంచి పోషణ కోసం పించను ఇచ్చేవాడు. ముప్పై ఎనిమిది సంవత్సరాల ఉద్యోగ జీవితంలో అరవై శాతం జీతాన్ని చుట్టూ ఉన్న సమాజానికి ఖర్చు చేసిన నిరాడంబర జీవి ఆయన. ఎందరో పేద విద్యార్థులకు పుస్తకాలు, బట్టలు, స్కాలర్‌షిప్‌లు ఏర్పాటు చేసి చదువుకోవడానికి ప్రోత్సహించాడు. ఎన్నోమార్లు ఎన్నో ప్రజాసంఘాలు, కళా సాంస్కృతిక సంఘాలు ఆయనకు సన్మానాలు, సత్కారాలు చేయాలని ప్రయత్నిస్తే వాటిని సున్నితంగా తిరస్కరించి, అందుకోసం చేసే ఖర్చంతా పేద విద్యార్థుల కోసం ఖర్చు చేసేట్టుగా చూసేవాడు.

అక్టోబర్ 16న ఆయన మరణాంతరం గాని ఆయనకు దళిత సార్వత్రిక విశ్వవిద్యాలయం 'దళిత అనువాద సార్వభౌమ' అనే బిరుదును ఇవ్వగలిగింది. ఇంగ్లిష్ అండ్ ఫారెన్ లాంగ్వేజెస్ ఇన్‌స్టిట్యూట్‌లో పిజి డిప్లొమా తీసుకున్న తరువాత ఆయన ఇంటర్, డిగ్రీ, పిజి విద్యార్థుల కోసం ప్రయోజకరమైన వాచకాలను రెండు వందలకుపైగా రాశారు. అనేక కథలను, వ్యాసాలను ఇంగ్లిష్‌లోకి అనువాదం చేశారు. వీటిలో చాలా వరకు జర్మనీ భాషలోకి కూడా అనువాదమయ్యాయి. వీటికి గుర్తింపుగానే ఆయన బతికుండగా స్వీకరించలేదు కాబట్టి ఈ బిరుదు ఆయనకు మరణాంతరం ఇస్తున్నామని ఆ విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ ప్రకటించారు.

ఆయనకు పౌరాణిక నాటకాలన్నా, పద్యాలన్నా విపరీతమైన ప్రేమ, అభిమానం. పట్టణంలో అనేక సాహితీ సంస్థలకు బాధ్యుడుగా ఉన్నారు. అస్తిత్వ ఉద్యమాలు తీవ్రంగా ఉన్న రోజుల్లో కూడా ఆయన విప్లవ దృక్పథాన్ని వీడలేదు. కారంచేడు, చుండూరు మారణకాండలను ఆయన ఈ విప్లవ దృక్పథం నుంచే పరిశీలించి, విశ్లేషించి ప్రతిఘటనా ఉద్యమంలో పాల్గొన్నాడు.

2016 అక్టోబర్ 23న ఆయన సంస్మరణార్థం 'భిన్నస్వరాలు' సాహితీ సాంస్కృతిక వేదిక, తెనాలి, శారద సాహిత్య వేదిక, తెనాలి ఏర్పాటు చేసిన సభ సందర్భంగా వెలువడిన కరపత్రంలో పేర్కొన్నట్లు "చివరి వరకూ తను నమ్మిన విప్లవ దృక్పథంతో నిలిచి, ఆయా ఉద్యమాలకు అండగా నిలిచిన" ఇంటెలెక్చువల్ యాక్టివిస్ట్ వర్ధనరావు. వర్ధనరావు పరిపూర్ణ వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోవాలంటే నిత్యమూ ఆయన చుట్టూ ఆయనతో వ్యవహరిస్తూ ఆయన నుంచి స్ఫూర్తి పొందిన సన్నిహితులు, విద్యార్థి యువజనులు, సాహిత్య కళాసాంస్కృతిక రంగాల కార్యకర్తలు, దళితులు, పీడితులు, తాడితులు, అధ్యాపకులు, సన్నిహితుల హృదయాల్లో ఆయన శాశ్వతంగా ఏర్పర్చుకున్నటువంటి స్థానంలోకి వెళ్లి మనం చూడగలగాలి. ఎందుకంటే కా. కొండపల్లి సీతారామయ్య ప్రభావంతోనే ఆర్‌వైఎల్ అధ్యక్షుడైన వర్ధనరావు తన చుట్టూ ఉండే స్నేహితులతో ఎప్పుడూ "నేను మరణించాక నన్ను కూడా విజయవాడలో ఆయనను దహనం చేసిన శ్మశానంలోనే ఖననం చేయాల''ని కోరేవాడట. ఆయన మరణించడానికి ఒక రోజు ముందు వాట్సప్‌లో "భారత పీడిత ప్రజల విముక్తికి జనతన సర్కారే సరైన మార్గం" అని తన అభిప్రాయం పెట్టాడట.

ఆ విధంగా వర్ధనరావు నిరంతరం పరిణతి చెందుతూ వచ్చిన విప్లవ వర్ధనరావు.

కా. వర్ధనరావుకు జోహార్లు! విప్లవం వర్ధిల్లాలి!



# లెనిన్

మయకోవ్‌స్కీ

## వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్

కావ్యం

వ్ల. మయకోవ్‌స్కీ

**ఇదే** అదను లెనిన్ కథను
రచించెదను నేను,
లెనిన్ బ్రదుకు జనం కొరకు
ధ్వనించెదను నేడు.
మనోవేదన నాలోన
నశించెనని కాదు,
విశాలమగు విషాద గుహ
వసించితిని నేడు.
లెనిన్ కథాక్రమం సదా
జపించితిని నేను
విషాదాశ్రు తుషారాల
నిషా నాకు లేదు.
లెనిన్ నేడు లేదూ? చూడు
జనంలో ఉన్నాడు,
లెనిన్ మన పరాక్రమం
కామ్రేడ్ లెనిన్ ఆయుధం
మన ఆసరా, మన జ్ఞానం.

ప్రజలు నౌకలు
పొడినేల అడ్డం కాదు
ఇప్పుడులో జీవిస్తూ మనం
ఈ నౌకను పట్టిన తుప్పుడు విదిలించి
పడవ చెక్కలకి అంటుకున్న
సున్నపు గుల్లలు దుల్లించి
తుప్పు వదలించి
తుపానులను జయించి
సూర్య కాంతికి సమీపంగా
దించి లంగరు,
నౌకా యాన ప్రయాసం
పెరిగిన గడ్డాల నాచు
సముద్రపు చెత్త
పరిహరించి పరిశుభ్రంగా స్నానం చేద్దాం
లెనిన్‌లో స్నానం చేసి
పునీతుణ్ణవుతున్నాను;
విప్లవ సముద్రంలో
ఇంకా ఇంకా దూరానికి
ఈ పడవ నడుపుతున్నాను
అయినా ఏం కవిత్వం ఇది?
అమాయిక బాలుడు కావ్యం అంటే
భయపడినట్టు
భయపడుతున్నాను ఈ అక్షరాలు
లిఖించడానికి
కిరీటధారి లెనిన్
అతనికి సముచితమైనదేనా
ఈ నా కవిత్వం?
లెనిన్‌కి తగ్గ
కవిత్వం ధ్వనించాలంటే
అనంతాకాశాన్ని చుంబించే
అతని కిరీటాన్ని తాకాలంటే
**ఈ** నా శక్తిలేని వాక్కులు
ఆ మానవుణ్ని అర్థం చేసుకోవద్దూ?
ఆ ప్రదీప్త విశాల లలాటానికి నా మాటలు
అడ్డుపడే తెరలు కాకూడదు
అధికార లాంఛనాలంటే
అసహ్యం నాకు;
ప్రభుత్వం పురమాయించిందని
పద్యం రాయలేను నేను!
సమాధీ, సర్కారుత్సవాలూ
నియమాలూ, ఇచ్చకాలూ

లెనిన్ నిరాడంబరతను కప్పి పుచ్చుతాయని
నా భయం.
లెనిన్ నా కనుపాప!
క్షుద్ర కావ్యంతో అవమానిస్తానా?
హృద్రక్తం ఉప్పొంగి రాస్తున్నాను
అంతరాత్మ శాసనాన్ని
అంగీకరిస్తున్నాను
ఇది నావిధి.
ఈ నా ధర్మం నిర్వహిస్తున్నాను.

**మా**స్కో సమస్తం
గడ్డ కట్టిన ధాత్రి
గజ గజ వణికింది.
గజ్జె కట్టిన రాత్రి
గణ గణ మోగింది.
కారు హారన్ల మోత
విద్యుద్దీపాల కూత
విద్యుద్దీపాల రాత్రి
వెలుతురు జాగరం చేస్తోంది.
ఎక్కడనుంచి వచ్చాడు
ఎవరాయన? ఏం చేశాడు
ఏమిటీ జన సమ్మర్దం
ఎవరికింత మర్యాద?
జ్ఞాపకాల ఖజానాలోంచి
ఒక్కొక్క మాటనే తీస్తున్నాను,
గొంతుక మాత్రం పెగలదు
నోటిదాకా వచ్చిన మాటలు
దిగజారుతున్నాయి,
స్తంభించిన శబ్ద ప్రపంచం

**మా**టల ఫాక్టరీ పనిచెయ్యదు
అతణ్ని స్పష్టంగా వర్ణించడానికి
అగపడవేం మాటలు?
వారానికేడు రోజులు మనకి
రోజుకిరవై నాలుగు గంటలు
వాడుకో, మానుకో అంతే!
అంతే జీవితం
హఠాత్తుగా వస్తుంది మృత్యువు
అడక్కుండా తీసుకుపోతుంది.
గడియారాన్ని బద్దలు చేసుకుని
కాలం ప్రవహిస్తే
పంచాంగాల ఆవరణ దాటి
కాలం పరుగెత్తితే
"అహో! అదో శకం" అంటాం;
"ఓహో! అదో యుగం" అంటాం.
రాత్రి పడగానే నిద్రిస్తాం,
పగ లేవో పనులు
నలుపుని తెలుపు చేస్తాం.
సోమరితనాన్ని సమర్థిస్తాం
కాని ఒకానొకడు మన కోసం
చరిత్ర గమనాన్ని శాసిస్తే
"వాడుగో ఒక ప్రవక్త" అంటాం;
"చూడరా ఒక ప్రతిభాశాలి" అంటాం.
మనం పెద్ద పరుగులకి సోము
పిలవనిదే కదలం
వెళ్లాలని ప్రేమిస్తాం
స్తబ్ధుగా జీవిస్తాం.

**శ**రీరం ఆత్మా ఒక్క లయకు
స్పందించే మహానుభావుడు వస్తే
"క్షత్ర వర్చస్వి" అంటాం;
"దైవ ప్రసాది" అంటాం;
"వాడెపో మగవా" డంటాం;
"వాడుగో మొనగా" డంటాం!
అదీ మామూలు పద్ధతి
తెలివీ కాదు మూర్ఖం కాదు
అర్థంలేని మాటలు
మంచులా కరిగిపోయే మాటలు.
ఈ నిర్జీవపు గుడ్లలోంచి
భావాలను పొదగలేము.
మామూలు ఊహలతో
మహత్వాన్ని కొలవలేము
చేతులూ మెదడూ చాలవు
అతణ్ని తెలుసుకోవడానికి
ఈ కొలతలతోనా లెనిన్
ఎవరని నిర్ణయించేది?
ఏం?
అందరి కళ్ల ముందరే
ఆ యుగం ప్రవేశించింది,
తలుపుల దడదడలు లేకుండా
తీగల గలగలలు లేకుండా.
జనం లెనిన్ చుట్టూ మూగి
"దేవుడిదయ వల్ల ఈయన మన
నాయకుడు" అంటే
ఆయన నొక రాజునీ దేవుణ్ణీ చేస్తే
ఆగ్రహంతో నేను
ఒళ్లు మరిచిపోతాను



ఊరేగింపు ముందర
ఒక్కణ్నే నిలిచి
శవపేటిక చుట్టూ మూగిన
జన సమూహాన్ని ఎదిరిస్తాను.
చెవులు బద్దలయ్యే లాగ
శాపాలు కురిపిస్తాను,
నన్ను బలవంతంగా ఊరుకోబెట్టే లోపుగా
ఆకాశం దాకా తిట్లను విసురుతాను,
క్రెమ్లిన్ మీద "నశించు" "నశించు" అని
బాంబులదాడి చేస్తాను.
శవపేటిక పక్కని
జెర్‌జీన్‌స్కీ1 అడుగులు దృఢంగా
పడుతున్నాయి,
"చెకా"2 కూడా ఇవాళ
సెలవు తీసుకుంది.
శత లక్షల నేత్రాల నుండి
అశ్రువులు ఉప్పొంగుతున్నాయి,
ఎర్రబడ్డ చెక్కిళ్లమీద
హిమాశ్రవులు గడ్డ కడుతున్నాయి,
లాంఛనపు కన్నీళ్లకు
అలవాటు పడ్డాడు దేవుడు.
నేడో ఒక నిజమైన విషాదం మన
హృదయాలను బద్దలు కొడుతోంది.

*(మయకోవిస్కీ రాసిన 'లెనిన్' కావ్యం నుంచి ..)*



...ఇతడు కేవలం వజ్రం లాంటి వాడేగాక, హిమఖండం లాంటి వాడు కూడా! ఇతడి నైతిక ప్రకృతి కూడా వాటిలాగే పూర్తి స్వచ్ఛమైందీ, చల్లనిదీ, అలాగే సూక్ష్మమైందీ. ఇతని స్వచ్ఛత ఎలాంటిదంటే, అందులో స్వంత కోర్కెలు గానీ, స్వంత ఆలోచనలు గానీ ఉండవు. అందువల్ల ఇతడు స్వంత ముఖం లేని కార్యకర్త అని చెబితే సరిపోతుంది. ఇతడు ప్రతి విషయంలోనూ అధికారిక అభిప్రాయాలు కలిగినప్పటికీ, సాధారణ ప్రజల అభీష్టాన్నీ, పార్టీ వైఖరినీ కూడా ప్రతిబింబిస్తాడు. అతడెప్పుడూ ఏ ప్రత్యేక విషయాన్నీ ప్రారంభించడు గానీ, సెంట్రల్ కమిటీ నుంచీ, అప్పుడప్పుడు వ్యక్తిగతంగా లెనిన్ నుంచీ స్వీకరించిన విషయాల్ని మాత్రమే ప్రచారం చేస్తాడు. అతడు వాటిని ఊరక ప్రచారం చెయ్యడం గాక, తనవిగా భావించి మరీ ఆ పని చేస్తాడు.

# అవిశ్రాంత బోల్షివిక్ పోరాటయోధుడు యాకోవ్ స్వెర్డ్‌లోవ్



(లునచార్‌స్కీ రాసిన "వెలుగు నీడల్లో విప్లవకారుల రేఖా చిత్రాలు" గ్రంథం నుండి)

స్వేచ్ఛానువాదం : ఎన్.వి.ఎస్. నాగభూషణ్

నేను రష్యాకు తిరిగి రాగానే మొట్టమొదట కలుసుకున్నది యాకోవ్ మిహయ్‌లొవిచ్ స్వెర్డ్‌లోవ్‌నే. అంతకు ముందు అతని గురించి ఇతరుల ద్వారానే విన్నాను. సోషల్ డెమోక్రసీ శ్రేణుల్లోనూ, బోల్షివిజమ్‌లోనూ కూడా అతడొక అవిశ్రాంత యోధుడని నాకు తెలుసు. అంతేకాదు, అతడు తరచుగా జైళ్లకూ, ప్రవాస శిక్షలకూ గురయ్యేవాడనీ, అయితే ప్రతిసారీ తప్పించుకునే వాడనీ కూడా నాకు తెలుసు. ఇంకా చెప్పాలంటే, ఎప్పుడు అతణ్ణి పట్టుకుని కటకటాల వెనక్కి నెట్టినా, వెంటనే తప్పించుకునే వాడని తెలుసు. ఏ కొద్ది రోజులు అవకాశం దొరికినా, అతడు బోల్షివిక్ కమిటీల్ని గానీ, గ్రూపుల్నిగానీ ప్రారంభించి, నిర్వహించాడన్న మాటే! ఆ రోజుల్లో రహస్య జీవితంలో ఉన్న బోల్షివిక్ కార్యకర్తలకు అతడొక ఆదర్శ నమూనాగా ఉండేవాడు. ఆ విషయంలో అతడు చెప్పుకోదగిన రెండు నైపుణ్యాలను సంపాదించాడు. ఇలాంటివి బయట (చట్టబద్ధ ఉద్యమాల్లో - అను.) కనబడవు. ఒక్క రహస్య ఉద్యమాల్లోనే కనిపిస్తాయని నా అభిప్రాయం. అవేమిటంటే, ఒకటి : యావత్తు పార్టీకి సంబంధించిన సమస్త విషయాలూ తెలిసి ఉండటం, రెండు : పదుల వేల వ్యక్తుల చేత నిర్మించబడిన పార్టీలోని ప్రతి వ్యక్తి గురించీ సంపూర్ణ అవగాహన కలిగి ఉండటం! అతడు 'కమ్యూనిజానికి సంబంధించిన సమస్త వ్యక్తుల జీవిత చరిత్రల నిఘంటువు' అని చెప్పవచ్చు. ఆయా వ్యక్తుల నడవడికలోని అన్ని కోణాలూ, విప్లవకారులుగా పనిచేసేందుకు వారు ఖచ్చితంగా సరిపోయేదీ లేనిదీ నిర్ణయించగల అసాధారణమైన, సున్నితమైన నిశితదృష్టి అతడికి ఉన్నది. ఈ విషయంలో అతడికి ఆయా వ్యక్తుల ఉన్నత ప్రవర్తన, సాధించిన విజయాలూ తెలుసు, అదే విధంగా వారి లోపాలూ, పొరపాట్లూ కూడా తెలుసు. అజ్ఞాత జీవితంలోని పార్టీ పని ద్వారా స్వెర్డ్‌లోవ్ సాధించిన మొదటి నైపుణ్యం ఇది. రెండోది నిస్సందేహమైన అతడి నిర్వహణా సామర్థ్యం. క్రమక్రమంగా మన విప్లవ సిద్ధాంతాలలోని సత్యానికి గుర్తింపు పెరిగే కొద్దీ, అజ్ఞాత కార్యక్రమాల్ని, అలాగే రోజువారీ ఆర్థిక, రాజకీయ కార్యక్రమాల్ని స్వెర్డ్‌లోవ్ అంత ఉన్నతంగా ఎలా నిర్వహించగలిగే వాడన్నది సహజంగానే నేను చెప్పజాలను. కానీ తన విధి నిర్వహణలో అతడు చూపిన ప్రజ్ఞ అత్యద్భుతమని మాత్రం చెప్పగలను. ఈ అనుభవమే మన రాజ్యాంగాన్ని రచించడంలో అతడికి విశేషంగా తోడ్పడింది. అంతేగాక అఖిల రష్యా సోవియట్ల కార్య నిర్వాహక వర్గానికి ప్రేరణ కలిగించిన ఛైర్మన్‌గా పని చెయ్యడంలోనూ, అలాగే పార్టీ సెక్రటేరియట్‌కు నాయకునిగా పనిచెయ్యడంలోనూ తోడ్పడిందని కూడా చెప్పగలను.

జులై రోజుల దాకా స్వెర్డ్‌లోవ్ బోల్షివిక్ పార్టీ జనరల్ స్టాఫ్‌లో ఒకనిగా, లెనిన్, జినొవ్యేవ్, స్టాలిన్‌లకు దగ్గరగా ఉంటూ, కార్యక్రమాలకు మార్గదర్శకత్వం వహించేవాడు. జులై రోజులలో అతడు ఒక్కసారిగా వెలుగులోకి వచ్చాడు. పెట్రోగ్రాడ్, క్రాన్‌స్టాడెట్‌లలో కార్మికవర్గం చేసిన జులై ప్రదర్శనల గురించి వివరంగా తెలపడం ఈ సందర్భంలో సరికాదు గానీ, ఈ ప్రదర్శనల సాంకేతిక నిర్వహణ ఎలాంటిదంటే, వాటిని ఏ విధంగానైనా ఆపగలగడం అసాధ్యం అని రుజువైంది. ఇందులో ఎక్కువ భాగం స్వెర్డ్‌లోవ్ పాత్రే ఉంది. పదుల వేల మంది సాయుధులైన మనుషులు బోల్షివిక్ పార్టీ ఆఫీసున్న క్షెసిన్స్‌కయా భవనం వద్ద నుండి పోరాట స్ఫూర్తి గల నినాదాల్ని పెద్ద గొంతులతో హోరెత్తిస్తూ, బృందాలుగా ఊరేగుతూ సాగించిన మహా ప్రదర్శనలను అతడే పర్యవేక్షించాడు.

అసాధారణమైన, ఏదో ఒక పెద్ద కారణంతో లెనిన్, జినొవ్యేవ్‌లను అరెస్టు చెయ్యాల్సిందిగా ఆజ్ఞలు జారీ కావడమేగాక, నన్నూ, ట్రాట్స్కీ, మరి పలువురు బోల్షివిక్కుల్నీ, అలాగే వామపక్ష సోషలిస్టు రివల్యూషనరీలనూ జైళ్లలో ఉంచిన సమయంలో, స్వెర్డ్‌లోవ్ మాత్రం నిర్బంధించబడకుండా ఉన్నాడు. 'అల్లర్ల'కు నాయకత్వం వహించింది స్వెర్డ్‌లోవేనని బూర్జువా పత్రికలు ప్రత్యక్షంగా అతని పేరు బయటపెట్టినప్పటికీ, ఇది జరిగింది. ఇలా ముఖ్యమైన అన్ని సంఘటనల్లోనూ స్వెర్డ్‌లోవ్ సమర్థవంతమైన

నాయకత్వంలో పార్టీ కొన్ని సార్లు విజయాల్ని సాధించింది. అపజయాలు పొందినప్పుడు కూడా అతడు పార్టీ పటిష్టతకు చేసిన కృషి సాటిలేనిది.

యూకొవ్ మిహయ్‌లొవిచ్ మరొకసారి చరిత్రలో మకుటాయమానంగా ప్రకాశించిన సందర్భం రాజ్యాంగ పరిషత్తుకు అతడు కన్వీనర్ వ్యవహరించినప్పటిది. ఆ సభకు అధ్యక్ష వర్గాన్ని ఎన్నుకోక ముందు, అతడు దానికి ఛైర్మన్‌గా నియమించబడ్డాడు.

నేను రాసిన విప్లవకారుల పరిచయ వ్యాసాల్లో ఆయా సందర్భాల్లో ఒకటి కన్నా ఎక్కువ సార్లు ఒక విశిష్ట గుణాన్ని గురించి నేను పేర్కొనడం జరిగింది. ప్రముఖ విప్లవకారుల్లో ఉండే ఆ గుణం నన్నెప్పటికీ ఆశ్చర్యచకితుణ్ణి చేస్తుంది. అదేమిటంటే, తీవ్రంగా శ్రమించి కూడా నిరాశపడాల్సిన క్షణాల్లో వారు పరిపూర్ణమైన ఆత్మ నిగ్రహాన్ని ప్రదర్శించడం! ఈ గుణం స్వెర్డ్‌లోవ్‌లో ఉన్నత స్థాయిలో ఉండడం మాత్రమే కాదు, నేను గమనించిందేమంటే, ఈ గుణం అతడి స్వభావంలో సహజంగానే ఇమిడి ఉండటం! స్వెర్డ్‌లోవ్ యావత్తు విప్లవ జీవితం, అతడిలో స్వల్పంగా కనిపించే ఆఫ్రికన్ లక్షణాలూ ఈ రెండూ కలిసి అతణ్ణి ఒక అసాధారణ వ్యక్తిగా మలిచాయన్న ఆలోచన నాకెప్పుడూ కలుగుతూంటుంది. నిజానికి అతడిలో సహజంగానే తీవ్రమైన అంతరాగ్ని ఉన్నప్పటికీ, బయటకు మాత్రం మంచులా పరమశాంతంగా కనిపిస్తాడు. ప్లాట్‌ఫాంపై ఏ మాత్రం మార్పులేని ఒకే కంఠస్వరంతో ఉపన్యసించడం, మెత్తగా నడవడం, నెమ్మదైన శరీర కదలికలూ - ఇవన్నీ తన చుట్టూ ఉన్నవారికి చెప్పకనే తెలుస్తాయి "వేగంగా, కానీ తొందరపాటు లేకుండా" అని! ఈ వ్యవహార సరళినే అంతా 'ఆత్మ నిగ్రహం' అంటారనుకుంటాను.

ఇందుకు సంబంధించిన ఒక ఉదాహరణ ప్రాయమైన సంఘటనను గమనించండి: సోవియట్ ప్రభుత్వానికీ, రాజ్యాంగ పరిషత్తుకూ తీవ్రమైన విభేదాలు పొడసూపినప్పుడు, రాజ్యాంగ పరిషత్తు వ్యవహారాలు చూసే మంత్రి ఉరీత్‌స్కీ జ్వరం వచ్చిన వాడిలా వణికిపోయి ప్రజల్ని అమితాశ్చర్య చకితుల్ని చెయ్యగా, ఆ పరిషత్తుకి ఛైర్మన్‌గా ఉన్న స్వెర్డ్‌లోవ్ మాత్రం ఏమాత్రం ఉద్రేకపడకుండా, బయటకు పరమ శాంతమూర్తిలా ఉండటమేగాక, మానసికంగానూ గొప్ప ఆత్మ విశ్వాసంతో ఉన్నాడు.

> తాత్కాలిక ప్రభుత్వానికి వ్యతిరేకంగా జూలై 4న జరిగిన సైనికుల, నావికుల, కార్మికుల అతిపెద్ద సాయుధ ప్రదర్శనలను అత్యంత పకడ్బందీగా నిర్వహించడంలో ప్రధాన పాత్ర స్వెర్డ్‌లోవ్‌దే. ఆ ప్రదర్శనల అనంతరం ప్రభుత్వం సాగించిన అణచివేత చర్యల్లో భాగంగా ప్రధాన నాయకులంతా అరెస్టైనప్పుడు, లెనిన్‌ని హత్య చెయ్యాలన్న ప్రభుత్వ రహస్యోద్దేశాల్ని గమనించి, ఆయన్ని సురక్షితంగా అజ్ఞాతవాసానికి పంపించింది స్వెర్డ్‌లోవే. ఈ విషయంలో లెనిన్ సోదరి మరీయా ఉల్యానోవ్ తన స్మృతుల్లో స్పష్టంగా పేర్కొన్నది కూడా.

కమ్యూనిస్టుల, ఎస్.ఆర్‌ల (సోషలిస్టు రివల్యూషనరీలు)లోని మెజారిటీ ప్రతినిధులు ఆసక్తితోనూ, అలాగే తీరీద్ పాలెస్ (పరిషత్తు జరిగే భవనం - అను) అంతా కోపంతో నిండిన కేకలతోనూ ఎదురు చూస్తుండగా, బోల్షివిక్కులు రాజ్యాంగ పరిషత్తులోని మితవాద, మధ్యే వాదాల్ని రూపుమాపబోతున్నారని ఎస్.ఆర్.లు పుకార్లు పుట్టించారు. అదే విధంగా, ఎస్.ఆర్.లు తమ ఆశలు వమ్మయినందున ప్రమాదకరంగా పెద్ద ఎత్తున సాయుధ ప్రదర్శనకు దిగబోతున్నారని అంతే స్థాయిలో బోల్షివిక్‌లు కూడా ప్రచారం చేశారు. అయితే 1922లో జరిగిన విచారణలో తెలిసిందేమంటే, రాజ్యాంగ పరిషత్తును బోల్షివిక్కులు రద్దు చేసినట్లయితే, సాయుధంగా తీవ్రస్థాయిలో పోరాడాలనీ, సైన్యం సహాయంతో రద్దు చెయ్యడానికి పూనుకున్న ప్రభుత్వ పెద్దల్ని కొందర్ని చంపి, తద్వారా తమ పార్టీ వీరోచిత కృత్యాన్ని ప్రపంచానికి చూపాలని అనుకొని, సాయుధంగా సిద్ధమై కూడా, వారు అందుకు పూనుకోలేదనీ తెలిసింది.

నిజానికి బోల్షివిక్కులుగానీ, ఎస్.ఆర్.లు గానీ ఎవరూ కూడా ఎలాంటి చట్టవ్యతిరేక చర్యలకూ, తీవ్రమైన పనులకూ దిగలేదు. రెండు పార్టీలు పని విధానంలోని భేదాలే ఇలాంటి పుకార్లకు దారి తీశాయి తప్ప, బోల్షివిక్కులకు ఆయుధాల నుండి రక్షణ తీసుకోవాల్సిన అవసరం రాలేదు. నావికుడు 'ఘెలెజ్ న్యాక్' (అప్పుడు కాపలానిధులు నిర్వర్తిస్తున్న వ్యక్తి -అను) చప్పట్లు కొట్టి, "చర్చలు ఆపి, ఇక ఇళ్లకు దయ చేయండి!" అనడంతో అంతా సర్దుకుంది. ఎస్.ఆర్.లు గొప్ప విధేయత చూపారు. వారిలో కొందరు తర్వాత బిగ్గరగా అసంతృప్తిని వ్యక్తం చేశారనుకోండి! ఎందుకంటే వారు రాజ్యాంగ పరిషత్తు ద్వారా ఏదో ఒరుగుతుందన్న భ్రమలతో ఉన్నారు. అందువల్ల తమ పార్టీ ప్రతిష్ఠకు అలా ఊరుకోవడం ద్వారా భంగం కలిగిందని వాపోయారు.

ఉత్కంఠపూరిత వాతావరణం నెలకొని ఉండగా, ప్రతి ఒక్కడూ తన సీటును అంటిపెట్టుకొని ఉండగా, ఉద్రిక్తత తీవ్ర స్థాయికి చేరి, కుడి, మధ్య పక్షాల వారు సెషన్ మొదలు పెట్టాల్సిందని ఒత్తిడి చెయ్యడం మొదలుపెట్టారు. దాంతో స్వెర్డ్‌లోవ్ బయటకు వెళ్లిపోయాడు. ఇంతకీ అతనెక్కడున్నాడు? కొందరు ప్రతినిధులైతే నిరుత్సాహంతో నిలబడ్డారు. అక్కడున్న వారిలోకెల్లా వృద్ధుడుగా కనిపిస్తున్న ఓ వ్యక్తి వేదిక వద్ద నుండి బిగ్గరగా అరుస్తూ బెల్లు కోసం చేతులు జాపాడు. దాంతో ఎస్.ఆర్.లు చొరవ తీసుకుని స్వంతంగా సెషన్ ప్రారంభించాలన్న నిర్ణయానికి వచ్చారు. పరిషత్తుకు ఎంపిక చెయ్యబడ్డ పెద్దల్లో ఒకరిని అందుకుపయోగించా లనుకున్నారు. కానీ అదే సమయంలో వారలాంటి తొందరపాటుతో కూడిన, వేగవంతమైన చర్యకు దిగకముందే, స్వెర్డ్‌లోవ్ ఆకారం అక్కడ ప్రత్యక్షమైంది. అతడు సభలో ఒక్కసారిగా లేచి నిలబడ్డాడు. తన స్వతస్సిద్ధమైన, హుందా అయిన నడకతో అతడు వేదిక వద్దకు చేరుకునే సరికి, వయసులో పెద్ద అయిన ఎస్.ఆర్.లు ఏ మాత్రం మర్యాద లేకుండా, తన సహజసిద్ధమైన ప్రశాంతమైన గొంతులో, బిగ్గరగా, రాజ్యాంగ పరిషత్తు మొదటి సెషన్ ప్రారంభమైందని ప్రకటించాడు!

ఈ సంఘటనను ఇంత వివరంగా నేను చెప్పడానిక్కారణం,

ఈ మొత్తం సెషన్ నడక తీరును యావత్తూ ఈ సంఘటన మానసికంగా నిర్దేశించింది గనుకనే! ఆ క్షణం నుంచి వామపక్షవాదులు అతికిపోకుండా పూర్తి ఆత్మ నిగ్రహంతో వ్యవహరించాల్సి వచ్చింది!

మధ్యేవాదులు కోపంతో ఉడికిపోతూనే, బిగబట్టుకుని కూర్చోగా, స్వెర్ద్‌లోవ్ కొద్ది బాధతో వాడిపోయి, జలుబుతో మలినమైన ముఖంతో కనిపించాడు. జలుబువల్ల బొంగురు పోయిన ఆ గొంతులోనే అంతా విప్లవ ప్రభుత్వం పూర్తి అంకిత భావాన్నీ, నిర్ణయాత్మక చిత్తాన్నీ గ్రహించగలిగారు. విప్లవం తొలి సంవత్సరాల్లో స్వెర్ద్‌లోవ్‌ని కలిసినప్పుడుగానీ, ఆయనతో కలిసి పని చేసినప్పుడుగానీ పై సంఘటన గురించి గానీ, ఇంకే నిర్దిష్ట విషయాలను గురించి గానీ మాట్లాడిన అంశాల్ని ఇప్పుడు నేను వివరించను గానీ, కొన్ని విషయాల్ని నేను క్లుప్తంగా గుర్తు చేసుకుంటాను.

మానవ పరిమితుల్ని మించినరీతిగా అలసటలేని కార్యకార్తల్ని పెద్ద సంఖ్యలో విప్లవం బయటపెట్టిందని చెప్పినట్లయితే, అలాంటి యోధులందరికన్నా ముందువరుసలోనే స్వెర్ద్‌లోవ్ తప్పనిసరిగా నిలుస్తాడని నేను చెప్పగలను. ఆ మానవుడు ఎప్పుడు భోజనం చేస్తాడో, ఎప్పుడు నిద్రిస్తాడో నాకైతే తెలీదు. రాత్రీ, పగలూ భేదం లేకుండా ఎల్లప్పుడూ పని చేస్తూనే ఉండటం నాకు తెలుసు.

ఏమైనా, లెనిన్, మరికొద్ది మంది ఇతరులూ విప్లవానికి మేధోపరమైన మార్గదర్శకత్వాన్నిచ్చినప్పటికీ, వారికీ - ప్రజలకూ మధ్య, పార్టీ, సోవియట్ యంత్రాంగం, చిట్టచివరికి రష్యా మొత్తానికీ మధ్య, నూలు కండెకూ - చేతికీ మధ్య దారంలా, ఒక వైరు ద్వారా అంతటినీ సంధానించినట్టుగా స్వెర్ద్‌లోవ్ సంధానిస్తాడు! అదీ స్వెర్ద్‌లోవ్ స్థానం!

అతడు ఒకానొక సందర్భంలో తన అంతర వ్యక్తిత్వానికి తగిన దుస్తుల్ని - తల నుంచి పాదాల దాకా ఉన్న తోలు దుస్తుల్ని - ఎంపిక చేసుకుని వేసుకోవడం మొదలెట్టాడు. మొదటి వాటినతడు ఎన్నిక చేసుకోవడానికి కారణం కేవలం తనకవి సౌకర్యవంతంగా ఉన్నాయనే. (వాటిని తీసెయ్యడానికి తగిన సమయం లేక, వాటినే చాలా కాలం ధరించాడు) వాటినతడు ధరించడం ద్వారా వాటికొక గుర్తింపు రావడమే గాక, ఆపై అవి కమిస్సార్‌లు పని ప్రదేశంలో వేసుకునే దుస్తులుగా గుర్తింపు పొందాయి కూడా. చిన్నదైన, ప్రత్యేక ప్రాధాన్యతలేని అతని విగ్రహం - ఆ నల్లతోలు దుస్తుల్లో ఎలా కన్పించేదంటే, నల్లగా నిగనిగ మెరిసేలా జుట్టు బ్రష్ చెయ్యబడ్డ లాబ్రడార్ కుక్కలా అతడు తీతరుల సేవ కోసమే ఉంటూ, ఎల్లప్పుడూ పూర్తి సన్నద్ధత గలిగి, గట్టి పట్టుదలతో పని చేసే ఔన్నత్యం వ్యక్తిలా అతడు కనబడేవాడు.

నిజానికి ఈ మనిషి ఒక వజ్రం! ఇందులోని కాఠిన్యం పని విషయంలో ఎక్కడా తేడా లేకుండా, ఎవరి ఎడలా మెత్తగా లేకుండా, మొదటి నుంచీ చివరి దాకా ఒకే విధంగా కొనసాగేందుకే.

అయితే ఇతడు కేవలం వజ్రం లాంటి వాడేగాక, హిమఖండం లాంటి వాడు కూడా! ఇతడి నైతిక ప్రకృతి కూడా వాటిలాగే పూర్తి స్వచ్ఛమైందీ, చల్లనిదీ, అలాగే సూక్ష్మమైందీ. ఇతని స్వచ్ఛత ఎలాంటిదంటే, అందులో స్వంత కోర్కెలు గానీ, స్వంత ఆలోచనలు గానీ ఉండవు. అందువల్ల ఇతడు స్వంత ముఖం లేని కార్యకర్తగా చెబితే సరిపోతుంది. ఇతడు ప్రతి విషయంలోనూ అధికారిక అభిప్రాయాలు కలిగినప్పటికీ, సాధారణ ప్రజల అభీష్టాన్నీ, పార్టీ వైఖరినీ కూడా ప్రతిబింబిస్తాడు. అతడెప్పుడూ ఏ ప్రత్యేక విషయాన్నీ ప్రారంభించడు గానీ, సెంట్రల్ కమిటీ నుంచీ, అప్పుడప్పుడు వ్యక్తిగతంగా లెనిన్ నుంచీ స్వీకరించిన విషయాల్ని మాత్రమే ప్రచారం చేస్తాడు. అతడు వాటిని ఊరక ప్రచారం చెయ్యడం గాక, తనవిగా భావించి మరీ ఆ పని చేస్తాడు. ప్రజల వద్ద ఉపన్యసించినప్పుడు అవి ఎప్పుడూ ప్రభుత్వ ముద్ర గలిగి కొంత విసుగు తెప్పిస్తాయి కూడా. ప్రభుత్వ అధికారిక పత్రాల్లో (గజెట్)ని వ్యాసాల్లా ఉంటాయవి. అయితే అతడు జాగ్రత్తగా ఆలోచించాకే చెబుతాడు. ఏంత వరకూ అవసరమో అంతవరకే, అంతకుమించి ఉండదు. ఇందులో నమ్మకాలకు తావులేదు. అలాగే మేధోపరమైన వాదనలక్కూడా.

మొత్తానికి ఒక ప్రభుత్వాజ్ఞ వెలువడే ముందు, మొదట, సూచించబడ్డ ఒకచోట, ప్రకటన రూపంలో అది నమోదయి, ఆపై అక్కడి వారితో చదవబడి, వారి ఆమోదం పొందాక, అప్పుడతడు సామాన్య జనాభిప్రాయాన్ని ప్రతిబింబించే సూచనలు చేస్తాడు. ఆపై వాటితో కలిసి అది చర్చించబడి, చరిత్ర సృష్టించేందుకు ప్రభుత్వ చట్టంగా మారుతుంది!

ఫలానా అధిక శ్రమవల్ల స్వెర్ద్‌లోవ్ అనబడే ఈ మన వజ్రం పగిలి ముక్కలయిందని నేను చెప్పజాలను. అదే ప్రధానకారణం అని చెప్పడం చాలా కష్టం. ఏ విప్లవకారుడైనా అలాగే పని చేస్తాడు కాబట్టి, అతడి డాక్టర్లు అతని శ్రమ గురించి తక్కువ అంచనా వేశారని నేను భావిస్తున్నాను. వారి నుంచి ఈకింది వాదనను నేను తరచు వింటాను. "మొత్తంమ్మీద అధిక శ్రమ అనేది అతడి విషయంలో పెద్ద పాత్రనే వహించింది. కానీ అతడి జబ్బుకు దారి తీసిన కారణం మాత్రం స్పష్టంగా తెలీడం లేదు. తర్వాత తెలియవచ్చు."

నా అభిప్రాయం ప్రకారం వారు చెప్పింది సరికాదని నమ్ముతున్నాను. వారు చెప్పిన వ్యాధి అతని కణజాలంలో ప్రవేశించింది గానీ, అది ముదరలేదు. అయితే ఇతర ప్రమాదాలు కూడా అతణ్ణి చుట్టుముట్టి ఉన్నాయి. వాటన్నింటితో పాటు అధిక శ్రమ - ఇవన్నీ కలిసినందునే అతనికి మరణం సంభవించింది. అతని మరణానికి ప్రధాన కారణం అదే.

ప్రాంతీయ ప్రభుత్వాలున్న చోట్ల పర్యటిస్తూ వరుస ఉపన్యాసాలు ఇస్తున్న సందర్భంగా ఓ ఉపన్యాసానంతరం అతడు జలుబుకు గురయ్యాడు. అయినప్పటికీ అతడు తన పర్యటనలు ఆపడాన్ని నిరాకరించి, వాటిని కొనసాగించాడు. నిజానికి అతడు మానవాతీత లక్ష్యాలను సాధించాలన్న పట్టుదలతో అతడిలాంటి వాటిని లెక్కజెయ్యడం ఎప్పుడో మానుకున్నాడు. పలువురు విప్లవకారులు యుద్ధ భూమిలోగాక, ఇతర ప్రదేశాల్లో మరణించినట్లే, అతడూ పై కారణం వల్ల జబ్బుపడి మరణించాడు. ఈ విధంగా ఇతరులకు సేవ చెయ్యడంలోనే అతడు మరణించాడని చెప్పవచ్చు.

ఇతడి స్మృతి సందర్భంగా లెనిన్ చెప్పిన మాటలు ఎంతైనా సముచితం : "ఇలాంటి మానవులు మనకు ఎంతో అవసరం. ఇతడి

స్థానాన్ని భర్తీ చెయ్యడానికి మిగిలిన వారంతా కలిసికట్టుగా శ్రమించాలి."

* * *

## స్వెర్డ్‌లోవ్ గురించి కొన్ని విశేషాలు

లెనిన్‌కు అత్యంత ముఖ్య సహచరుడైన స్వెర్డ్‌లోవ్ (జననం : 3-6-1885, మరణం: 16-3-1919) నిర్నూ నొవ్‌గొరొడ్ నగరంలో యూదు దంపతులైన మిహాయిలొవిచ్, ఎలిజవేతాలకు జన్మించాడు. చెక్కడపు పనివాడైన తండ్రికి ప్రవృత్తి మాత్రం అసలు ఏమాత్రం తీసిపోని నకిలీ పత్రాల్ని, రాజముద్రల్ని తయారు చెయ్యడం. తద్వారా విప్లవకారులకు అప్పుడప్పుడమే గాక, కొంత సంపాదన కూడా చేసేవాడు. తండ్రికి వేరే ఓ రహస్య వృత్తి ఉండేది. అదే అధికారిక పత్రాలకూ, స్టాంపులకూ నకిలీలు తయారు చెయ్యడం వాటిని విప్లవకారులకు అందించి, వారిచ్చిన సొమ్ముతో పిల్లల్ని చదివించాడు. ఇతడు సృష్టించిన నకిలీ పత్రాలూ, స్టాంపులూ అసలును ఖచ్చితంగా పోలి ఉండటం వల్ల, పోలీసులు వాటిని ఏమాత్రం గుర్తించలేక పోయేవారు. అంతేగాక మిహాయ్‌లోవిచ్ అక్రమ ఆయుధాలను నిల్వవుంచి, వాటిని విప్లవకారులకు అమ్మేవాడు. అందువల్ల అతడి ఇల్లు విప్లవకారులు కలుసుకునే ఒక రహస్య కేంద్రంగా పని చేసేది. తద్వారి స్వెర్డ్‌లోవ్‌కి చిన్నతనంలోనే పలువురు విప్లవకారులతో పరిచయం లభించింది.

స్వెర్డ్‌లోవ్‌కి 10 సంవత్సరాల వయసులో, తండ్రి అతణ్ణి ప్రాంతీయ జిమ్నా జియమ్ (వీటిలో మొత్తం 8 తరగతులుంటాయి. ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులయిన వారినే అందులో చేర్చుకుంటారు. జిమ్నా జీయమ్‌లో ఉత్తీర్ణులయిన వారిని విశ్వవిద్యాలయంలో డిగ్రీ తరగతుల్లో చేర్చుకుంటారు)లో చేర్పించాడు. అక్కడ ఉపాధ్యాయులతో అతడికి సరైన సంబంధాలు లేవు. స్కూలు నిబంధనల్ని స్వెర్డ్‌లోవ్ తీవ్రంగా వ్యతిరేకించేవాడు. దాంతో వారు అతడి పట్ల కోపాన్ని వెలిగక్కేవారు. ఈ వ్యతిరేకత పెరిగిపోవడం చివరకు అతణ్ణి స్కూలు నుంచి బహిష్కరించడంగా పరిణమించింది.

ఆ దశలోనే స్వెర్డ్‌లోవ్ తన శక్తియుక్తులన్నింటినీ శ్రామిక ప్రజల హక్కుల్ని సమర్థించడానికే అంకితం చెయ్యాలన్న నిశ్చయానికి వచ్చాడు. స్కూలు నుంచి బహిష్కరించబడ్డాక, స్వెర్డ్‌లోవ్ ఒక రసాయనాలు అమ్మే షాపులో పని నేర్చుకునేందుకు చేరాడు. ఆ షాపు నిర్నూ నొవ్‌గొరొడ్ నగరానికి శివార్లలో గల 'కనావినా' పట్టణంలో ఉంది. ఆ పట్టణంలోనే ఓ పెద్ద ఫర్నీచర్ కార్ఖానా ఉంది. అందులో పెద్ద సంఖ్యలో పనిచేసే కార్మికులతో నెయ్యం గరిపిన స్వెర్డ్‌లోవ్, వారినుండి, వారు చేసే రోజువారీ శ్రమలోని తీవ్ర ఇబ్బందుల్ని గురించిన కథనాలు వింటూండేవాడు. అదే కాలంలో అతడు ఓ ముసలి నరోద్నిక్ నడిపే పుస్తకాల షాపులో విప్లవకారుల జీవిత చరిత్రలు చదువుతూ, విప్లవ భావాలు సంతరించుకున్నాడు.

ఆ విధంగా స్వెర్డ్‌లోవ్ తన 16వ ఏటనే సోషల్ డెమొక్రటిక్ కార్మిక సంఘంలో చేరి, నిర్నూ నొవ్‌గొరొడ్ నగరంలో తొలి నగరంలో ఏర్పడ్డ రహస్య కమిటీలో పాలుపంచుకున్నాడు. అంతేగాక పార్టీ నిధిని సేకరించడంలోనూ, రహస్య ప్రచురణాలయాన్ని నెలకొల్పడంలోనూ ముఖ్య పాత్ర వహించాడు. అతికొద్ది కాలంలోనే అతడు రహస్యోద్యమంలో ప్రముఖుడై అధ్యయన కేంద్రాల నిర్వహణను, ప్రచార సాహిత్య ప్రచురణ సాగిస్తూ, లండన్, జెనీవా వగైరా విదేశీ కేంద్రాల నుంచి పార్టీ ప్రచురణల్ని రహస్య మార్గాల ద్వారా తెప్పించడంలో ఆరితేరాడు.

పార్టీ పని కోసం స్వెర్డ్‌లోవ్ కజ్జాన్, ఉరాల్స్‌లకు వెళ్లి రహస్య కమిటీల్ని నిర్వహించాడు. 1905 తొలి విప్లవం నాటికి "శ్రామిక సహాయకుల సోవియట్" (Soviet of Worker's deputies) ఆ ప్రాంతంలో అకస్మాత్తుగా తలెత్తడానికి కారకుడయ్యాడు. అంతేగాక, ఆ కాలంలో పార్టీ ప్రచారకునిగా, బహిరంగ వేదికలపై ఉపన్యాసకునిగా తన సామర్థ్యాన్ని నిరూపించుకున్నాడు. 1906లో తన చట్ట వ్యతిరేక కార్యక్రమాలకు గాను స్వెర్డ్‌లోవ్ తొలిసారిగా అరెస్టయ్యాడు. ఆపై 1917 దాకా గల మధ్య కాలంలో ఎక్కువ భాగం జైల్లోనైనా ఉన్నాడు, లేదా ప్రవాస శిక్షకైనా పంపబడ్డాడు. అయితే అరెస్టయిన ప్రతిసారీ తప్పించుకున్నాడు. ఆ విధంగా అతడు ఆ 11 సంవత్సరాల కాలంలో 14 సార్లకు పైగా అరెస్టయ్యాడు. తాను జైల్లో ఉన్నా, బయట ఉన్నా, శ్రామికవర్గ రాజకీయాలతో తన సంబంధాల్ని కొనసాగిస్తూ, రష్యన్ విప్లవం కోసం అహర్నిశలూ శ్రమించాడు.

ఈ నిర్బంధాల మధ్యనే, రష్యన్ కార్మికులు తమ సమ్మె పరంపరల ద్వారా బహిరంగంగా పనిజేసే అవకాశాన్ని గెలుచుకున్న క్రమంలో, 1912లో 'లేనా' గని కార్మికుల సమ్మెపై గుర్రపు దళాలతో ప్రభుత్వం సాగించిన క్రూర హత్యాకాండ అనంతరం జరిగిన సమ్మెల సమయంలో, స్వెర్డ్‌లోవ్ పార్టీ పత్రిక 'ప్రావ్ద'కు సంపాదకత్వం వహించాడు. 1912లో తిరిగి అరెస్టులు, సైబీరియా సుదూర ప్రాంతమయిన తురుహాన్స్క్‌లో ప్రవాస శిక్ష అనుభవించాడు. అక్కడే అతడు మరో ప్రవాస శిక్ష అనుభవిస్తున్న జోసఫ్ స్టాలిన్‌తో కలిసి ఒకే అపార్టుమెంటులో మూడేళ్లున్నాడు. 1917 ఫిబ్రవరి విప్లవం దాకా అక్కడే శిక్ష అనుభవించి, అనంతరం విడుదలై స్వెర్డ్‌లోవ్, సామ్రాజ్యవాద యుద్ధంలో రష్యా పాత్రకు వ్యతిరేకంగా బోల్షివిక్కులు సాగిస్తున్న ప్రచారంలో చురుకైన పాత్ర నిర్వహించాడు. అనంతరం ఉరాల్స్, ఎకతెరిన్ బర్గ్‌లలో పార్టీ పనిని సమర్థవంతంగా సాగించాడు.

తాత్కాలిక ప్రభుత్వానికి వ్యతిరేకంగా జూలై 4న జరిగిన సైనికుల, నావికుల, కార్మికుల అతిపెద్ద సాయుధ ప్రదర్శనలను అత్యంత పకడ్బందీగా నిర్వహించడంలో ప్రధాన పాత్ర స్వెర్డ్‌లోవ్‌దే. ఆ ప్రదర్శనల అనంతరం ప్రభుత్వం సాగించిన అణచివేత చర్యల్లో భాగంగా ప్రధాన నాయకులంతా అరెస్టైనప్పుడు, లెనిన్‌ని హత్య చెయ్యాలన్న ప్రభుత్వ రహస్యోద్దేశాల్ని గమనించి, ఆయన్ని సురక్షితంగా అజ్ఞాతవాసానికి పంపించింది స్వెర్డ్‌లోవే. ఈ విషయంలో లెనిన్ సోదరి మరీయా ఉల్యానోవ్ తన స్మృతుల్లో స్పష్టంగా పేర్కొన్నది కూడా. ఆ ఒక్కసారే కాదు, మరింకెన్నోసార్లు లెనిన్‌ని ప్రాణాపాయాల్నుండి స్వెర్డ్‌లోవ్ కాపాడాడు. జూలై అరెస్టుల తర్వాత, క్లిష్ట పరిస్థితుల్లో ఉన్న పార్టీని విచ్ఛిన్నమై పోకుండా ఒంటి చేత్తో స్వెర్డ్‌లోవే కాపాడి, పునర్నిర్మించాడు. ఆగష్టు నుండి సెంట్రల్

కమిటీ ఆర్గనైజింగ్ బ్యూరో అధిపతిగా పనిచేస్తూ, తన అసాధారణమైన ప్రజ్ఞా నైపుణ్యాలతో పార్టీకి జవజీవాలనందించి, పార్టీ నిర్వాహకుడు (ఆర్గనైజర్) అంటే ఇలా ఉండాలి అనేట్లుగా ఒక ఉదాహరణగా నిలిచాడు. అంతేగాక, అక్టోబరు విప్లవానికి తగిన పథకం రూపొందించడంలోనూ ముఖ్య భూమిక వహించాడు. అలాగే అక్టోబరు విప్లవ సమయంలో కేంద్ర కమిటీ నియమించిన సైనిక విప్లవ కమిటీ సభ్యునిగా గొప్ప ప్రజ్ఞను కనబరిచాడు. కేంద్ర కమిటీ సమావేశాలకు లెనిన్ గైర్హాజరీలో స్వెర్డ్‌లోవే సమావేశాలకు అధ్యక్షత వహించేవాడు. అంతేగాక అన్ని కీలక సమయాల్లోనూ స్వెర్డ్‌లోవ్ లెనిన్‌కు ఎన్నడూ ప్రశ్నించరాని విధంగా విధేయత ప్రదర్శించాడు.

అక్టోబరు విప్లవ సమయంలో జరుగుతున్న రెండో అఖిల రష్యా సోవియట్ల అధ్యక్షునిగా ఉన్న కామెనెవ్ ద్రోహ పూరితంగా లెనిన్ ప్రతిపాదనలకు వ్యతిరేకత ప్రదర్శించినప్పుడు, అధ్యక్షునిగా అతణ్ణి తొలగించి, అతని స్థానంలో స్వెర్డ్‌లోవ్‌ని పార్టీ ఎన్నుకుంది. ఆ విధంగా స్వెర్డ్‌లోవ్ అఖిల రష్యా సోవియట్ల కార్యనిర్వాహక కమిటీకి అధ్యక్షుడై, పదవీ రీత్యా సోషలిస్టు రష్యాకు మొదటి అధ్యక్షత బాధ్యతలు చేపట్టాడు. ఒక పక్క పార్టీ కేంద్ర ఆర్గనైజర్‌గా పని చేస్తూనే, మరోపక్క ప్రభుత్వాధ్యక్షునిగా నవజాత సోషలిస్టు దేశానికి అవసరమైన ఏర్పాట్లు చెయ్యడంలో లెనిన్‌కు గట్టి తోడ్పాటు నందించాడు.

1917 అంతంలో "విప్లవ కార్యక్రమ వేగం" (Work flow of Revolution)గా పిలవబడే కార్యక్రమం మొత్తానికి యూకొవ్ స్వెర్డ్‌లోవే పూర్తి బాధ్యునిగా ఉన్నాడు. అంతేందుకు, అక్టోబరు విప్లవ సమయంలో కూడా విప్లవానికి ముందు విప్లవ కమిటీలోకి జరిపిన వ్యక్తుల నియామకాలకు స్వెర్డ్‌లోవ్ వ్యక్తిగతంగా బాధ్యత వహించాడు. విప్లవం ముగిసే దాకా తాత్కాలిక ప్రభుత్వంలోని సభ్యులపై చర్యల్ని నియంత్రించాడు. (మొదటి రోజే మంత్రులంతా వింటర్ పాలెస్‌లోని నివాసాల్లో అరెస్టయ్యారు.) ఇక విప్లవ విజయానంతరం ఏర్పడ్డ నూతన ప్రభుత్వానికి అవసరమైన రాజ్యాంగ యంత్రంలోని వ్యక్తుల నియామకాలు జరపడంలో కూడా స్వెర్డ్‌లోవే పూర్తి బాధ్యత వహించాడు. పార్టీలోని వ్యక్తులందరికి సంబంధించిన పూర్తి విషయ పరిజ్ఞానం ఈ నియామకాల విషయంలో అతడికి తోడ్పడింది. ఎందుకంటే ఈ నూతన ప్రభుత్వం ఒక పూర్తి కొత్త తరహా ప్రభుత్వం. ఇది జాతీయ సోవియట్ల అనుసంధానమే పునాదిగా గల శ్రామిక రాజ్యం నిర్మించడం కోసం ఏర్పడింది. ఈ నియామకాల్లో ఆయా ప్రభుత్వ శాఖల అధ్యక్షులదగ్గర్నుంచి ప్రతి వ్యక్తీ ఉన్నాడంటే అతిశయోక్తి కాదు. ఇదంతా అతడు నిర్వహించింది. తన వ్యక్తిగత బాధ్యత తోటే అంటే స్వెర్డ్‌లోవ్ ఆ రోజుల్లో ఎంతటి ముఖ్య బాధ్యత వహించిందీ తెలుసుకోవచ్చు. సహజంగానే దీనికంతా లెనిన్ పూర్తి మద్దతు వుంది.

లెనిన్‌కు ముఖ్య సహచరునిగా ఉన్న స్వెర్డ్‌లోవ్, సెంట్రల్ కమిటీలో ఏదైనా ఒక చర్యకు ఆమోదం పొందాల్సిన సమయంలో విప్లవానికి ముందూ, తర్వాతా కూడా, లెనిన్ ప్రతిపాదించిన వ్యూహానికి ఎలాంటి సంశయం లేకుండా బేషరతుగా మద్దతునిచ్చే ఒకే ఒక్క సభ్యుడు స్వెర్డ్‌లోవ్. అతని తర్వాత మిగిలిన వారి మద్దతు, ఆయనకు లభించేది. వివాదాస్పద పలు నిర్ణయాల్లో, ఉదాహరణకు రాజ్యాంగ పరిషత్తును రద్దుచెయ్యడంలో, అలాగే బ్రెస్ట్ - లితోవిస్క్ శాంతిసంధిని కుదుర్చుకోవడంలోనూ స్వెర్డ్‌లోవ్‌దే కీలక పాత్ర. రాజ్యాంగ పరిషత్తు రద్దు విషయంలో స్వెర్డ్‌లోవ్ సలహా మేరకే లెనిన్ వ్యవహరించాడు. శాంతి సంధిని అడ్డుకునేందుకు ప్రతిపక్షాలతో పాటు, పార్టీలోనే ఉన్న ట్రాట్స్కీ, వామపక్ష కమ్యూనిస్టులూ తీవ్రంగా దుష్ప్రచారం సాగిస్తున్నప్పుడు, సంధికి మద్దతుగా జరిగిన ప్రచారానికి స్వెర్డ్‌లోవ్ సారథ్యం వహించాడు.

పార్టీ పత్రికలోనే ప్రకటించబడ్డ ట్రాట్స్కీ వ్యాసాన్ని బట్టి, లెనిన్‌తో సహా, పార్టీలోని ముఖ్య నాయకులంతా ఏ క్లిష్ట సమస్య వచ్చినా స్వెర్డ్‌లోవ్ వంకే చూసేవారు. ఆ క్లిష్ట సమస్యలన్నింటినీ అతడు తన నిర్వహణా సామర్థ్యం ద్వారా, పార్టీపై తనకు గల గట్టి పట్టు ద్వారానే అధిగమించేవాడు విజయవంతంగా. ఒకానొక క్లిష్ట సందర్భంలో, పార్టీ కేంద్రం తన కార్యకర్తలపై తగినంత పట్టు లేనందున సోవియట్లలో బలహీనంగా తయారయినప్పుడు, కేవలం

**....ఇతడెలాంటి నిర్వాహకుడంటే, ఎవరితోనూ పోలికే లేని, సందేహాలకు అతీతుడైన వానిగా ప్రతిష్ఠను గెలుచుకున్నవాడు! ఇంకా ఎలాంటి వాడంటే, యావత్తు రష్యా అంతటా సోవియట్ల అధికారానికి నిర్వాహకుడు! అంతమాత్రమేనా? ఇతడికి గల జ్ఞానంలో ఇంతటివాడు మరొకడు లేడంటే అతిశయోక్తి లేదు.**

**... ప్రపంచంలోని అన్ని ప్రాంతాలకన్నా, అన్ని దేశాలకన్నా ముందుగా, క్లిష్టతతో పాటు అలసట కలిగించిన, బాధాకరమైన, రక్తాన్ని చిందించిన, కానీ విజయానంతరం అత్యంత ఆనందదాయకమైన సోవియట్లను తయారు చెయ్యడానికీ, ఆపై సోవియట్ ప్రభుత్వ ఏర్పాటుకూ కారణమైన పార్టీని నిర్వహించడంలో కూడా అతడికి ఆ జ్ఞానం ఎంతగానో తోడ్పడింది.**

**... మనం ఎన్నటికీ ఈ మనిషి స్థానాన్ని భర్తీ చెయ్యలేం. ఎందుకంటే, ఇతడు ఒక మినహాయింపు కలిగిన నిర్వహణ నైపుణ్యాన్ని సానబట్టి, ఆ విద్యలో ఆరితేరిన వాడు. అతడి స్థానాన్ని భర్తీ చెయ్యడమంటే, మన అర్థంలో, అతడికి గల అన్ని నైపుణ్యాలూ ఉన్న మనిషిని, ఓ కామ్రేడ్‌ని వెతికి పట్టుకోవడం! అయితే ఏ ఒక్కరూ యాకోవ్‌స్వెర్డ్ దరిదాపుల్లోకి కూడా రాలేరు.**

రెండు మూడు రోజుల్లోనే పార్టీ కేంద్రం పట్టును బిగించి, ఆ పగ్గాలన్నీ తన చేతుల్లోకి తీసుకున్నట్లు ట్రాట్స్కీ రాసిన పై వ్యాసం ద్వారా గమనించగలం. మొదటి సోషలిస్టు రష్యా రాజ్యాంగాన్ని కూడా రచించిన స్వెర్డ్‌లోవ్, ప్రభుత్వ చట్టాలు రూపొందించబడే క్రమంలో ఎలాంటి ముఖ్యపాత్ర వహించేవాడో కూడా పై ట్రాట్స్కీ వ్యాసం ద్వారా తెలుస్తోంది.

పార్టీలో, ప్రభుత్వంలో ఇంత ప్రాముఖ్యమున్న స్వెర్డ్‌లోవ్, అనూహ్యంగా, ఎంతో ఉజ్వల భవిష్యత్తు ముందుండగా, అతి చిన్న వయస్సులోనే, కేవలం 34 సంవత్సరాల వయస్సుకే విషాద మరణం పాలు కావడం విప్లవాభిమానులకూ, శ్రామికవర్గానికే, నిజం చెప్పాలంటే ఏ ఒక్కరికన్నా ఎక్కువగా లెనిన్‌కు ఒక శరాఘాతమేనని చెప్పాలి! స్వెర్డ్‌లోవ్ చనిపోయినప్పుడు అఖిల రష్యా కేంద్ర కార్యవర్గ సమావేశంలో రెండు గంటలకు పైగా సాగిన ఆయన ఉపన్యాసంలో స్వెర్డ్‌లోవ్ ప్రాముఖ్యాన్ని గురించి ఇలా చెప్పాడు :

"... అతడు ఒంటరిగా, కార్మిక వర్గ ఉద్యమానికి సంబంధించిన మనుషుల్ని నడవడంలో అసాధారణమైన జ్ఞానాన్ని సంపాదించగలిగాడు... ఆచరణలో ఉన్న కార్యకర్తగా అతడు ఆశ్చర్యకరమైన సామర్థ్యాన్ని సాధించగలిగాడు, ఒక నిర్వాహకుని ఆశ్చర్యకరమైన సామర్థ్యం, పోలికేలేని, పోటీపడలేని ప్రతిష్ఠ - కొన్ని అతిపెద్ద శాఖలు గల పని - అఖిల రష్యా కేంద్ర కార్య నిర్వాహక వర్గం (All Russian Central Executive Committee) నకు సంబంధించిన పని - కొందరు సామాన్య కార్యకర్తలు ఒక బృందంగా కలిసి కట్టుగా నిర్వహించగల పనిని అతడొక్కడే పూర్తి బాధ్యతతో తీసుకోవడానికి తగిన శక్తిని కలిగి ఉన్నందుకు అతడికెన్నయినా కృతజ్ఞతలు చెప్పాలి! పైన పేర్కొన్న అంత పెద్ద సంస్థను నడపడంలో ఆచరణలో ఎదురయ్యే సమస్యలు సంఖ్యలో అధికమేగాక, అతి పెద్దవీ, అత్యంత ప్రాధాన్యత గలవీ. అయినప్పటికీ, అతడు వాటిని ఒంటరిగానే ఎదుర్కొని, విజయం సాధించాడు. అతడు చెప్పే ఒకే ఒక మాట, ఎలాంటి వ్యతిరేకతలూ లేని, చర్చకోసం ఎలాంటి సభలూ జరపని ఓటింగ్ నిబంధనలు పాటించని, అంతిమ పరిష్కారంగా ఆమోదించబడేది. ప్రతి ఒక్కరూ సంతృప్తి చెందినట్లుగా భావిస్తుండగా, గొప్ప ఆచరణాత్మకమైన జ్ఞానం, నిర్వహణాపరమైన సామర్థ్యం ప్రాతిపదికన, వారి సందేహాలన్నీ తీర్చబడేవి. కేవలం వందల, వేల అభివృద్ధి చెందిన కార్మికులు మాత్రమే కాదు, అసంఖ్యాకమైన ప్రజానీకం కూడా దాన్ని అంతిమ పరిష్కారంగా ఆమోదించేవారు.

....ఇతడెలాంటి నిర్వాహకుడంటే, ఎవరితోనూ పోలికే లేని, సందేహాలకు అతీతుడైన వానిగా ప్రతిష్ఠను గెలుచుకున్నవాడు! ఇంకా ఎలాంటి వాడంటే, యావత్తు రష్యా అంతటా సోవియట్ల అధికారానికి నిర్వాహకుడు! అంతమాత్రమేనా? ఇతడికి గల జ్ఞానంలో ఇంతటివాడు మరొకడు లేడంటే అతిశయోక్తి లేదు.

... ప్రపంచంలోని అన్ని ప్రాంతాలకన్నా, అన్ని దేశాలకన్నా ముందుగా, క్లిష్టతతో పాటు అలసట కలిగించిన, బాధాకరమైన, రక్తాన్ని చిందించిన, కానీ విజయానంతరం అత్యంత ఆనందదాయకమైన సోవియట్లను తయారు చెయ్యడానికీ, ఆపై సోవియట్ ప్రభుత్వ ఏర్పాటుకూ కారణమైన పార్టీని నిర్వహించడంలో కూడా అతడికి ఆ జ్ఞానం ఎంతగానో తోడ్పడింది.

... మనం ఎన్నటికీ ఈ మనిషి స్థానాన్ని భర్తీ చెయ్యలేం. ఎందుకంటే, ఇతడు ఒక మినహాయింపు కలిగిన నిర్వహణ నైపుణ్యాన్ని సానబట్టి, ఆ విద్యలో ఆరితేరిన వాడు. అతడి స్థానాన్ని భర్తీ చెయ్యడమంటే, మన అర్థంలో, అతడికి గల అన్ని నైపుణ్యాలూ ఉన్న మనిషిని, ఓ కామ్రేడ్‌ని వెతికి పట్టుకోవడం! అయితే ఏ ఒక్కడూ యాకోవ్‌స్వెర్డ్ దరిదాపుల్లోకి కూడా రాలేడు.

...యాకోవ్ స్వెర్డ్‌లోవ్ స్మృతి - ఒక విప్లవకారుడికి తన ఆశయం యెడల గల విధేయతకు ఒక శాశ్వతగుర్తుగా ఉపయోగపడుతుంది. అంతే కాదు, ఆచరణలో స్వీయ నియంత్రణను ఎలా సమన్వయం చెయ్యాలన్న దానికి కూడా ఒక ఉదాహరణ ప్రాయంగా పనికొస్తుంది. అంతేనా, ఆచరణాత్మక నైపుణ్యానికీ, ప్రజలతో సన్నిహిత సంబంధాలకీ, అలాగే వారికి ఎలా మార్గనిర్దేశం చెయ్యాలన్న దానికి కూడా ఆ స్మృతి ఉపయోగపడుతుంది..."

లెనిన్‌కి ఆయా విప్లవకారుల స్మృతి ఉపన్యాసాలలో ఉన్నదాని కన్నా అధికంగా చెప్పే అలవాటు లేదు. మరి ఆయన స్వెర్డ్‌లోవ్ స్మృతి ఉపన్యాసంలో ఇంతగా అతడి గురించి చెప్పాడంటే, ఆయనపై స్వెర్డ్‌లోవ్ ఎలాంటి ముద్రవేసిందీ, స్వెర్డ్‌లోవ్ లేని లోటు పార్టీనీ, ప్రభుత్వాన్నీ, తననీ కూడా ఎంతగా బాధించేదీ మనం తెలుసుకోవచ్చు.

* * *

ఇంతటి మహోన్నత వ్యక్తిత్వం గల స్వెర్డ్‌లోవ్ గురించి విప్లవాభిమానులైన తెలుగువారిలో చాలా మందికి తెలీదు. వారు కేవలం ఈ పేరు వినడం తప్ప, (కొందరికి ఈ పేరు కూడా వినలేదు), ఆయన గురించిన వివరాలు తెలీదు. ఇందుకు కారణం, బహుశా, ట్రాట్స్కీ రాసిన రాతలు కారణం కావచ్చు. ట్రాట్స్కీ 1925లో రాసిన వ్యాసం వాస్తవమైనదే. అందుకే దాన్ని పార్టీ పత్రికలో 1926లో ప్రకటించారు. కానీ అతడు స్టాలిన్‌తో తనకు గల విభేదాలు ముదిరిన తర్వాత రాసిన రాతల్లో, స్టాలిన్‌ని కించపరిచేందుకు, స్టాలిన్‌తో స్వెర్డ్‌లోవ్‌ని పోలుస్తూ, స్వెర్డ్‌లోవ్‌ని ఉన్నతీకరిస్తూ, స్టాలిన్‌ని కించపరుస్తూ రాశాడు. ఇవి దురుద్దేశంతో రాసిన రాతలు తప్ప వేరు కాదు. స్టాలిన్ పని చేసిన రంగం వేరు. స్వెర్డ్‌లోవ్ పని చేసిన రంగం వేరు. అంతేగాక, ఒక్కో సమయంలో ఒక్కో వ్యక్తి రాణిస్తాడు. స్వెర్డ్‌లోవ్ తన కాలంలో రాణించాడు. మరి స్టాలిన్ సోవియట్ అధినేతగా చేసిన కృషి, రెండో ప్రపంచ యుద్ధంలో ప్రపంచాన్ని నియంతల నుంచి రక్షించిన విషయాన్ని మర్చిపోగలమా? కనుక ఇద్దరినీ పోల్చుతూ ట్రాట్స్కీ రాసిన రాతల వల్ల, బహుశా ఇద్దరికీ నిజంగానే విభేదాలున్నాయనుకొని, విప్లవాభిమానులు స్వెర్డ్‌లోవ్ చేసిన కృషి గురించి దృష్టిసారించి ఉండకపోవచ్చు. కానీ వారి మధ్య విభేదాలు లేవు. సోవియట్ విప్లవం (అక్టోబరు విప్లవం) విజయం సాధించి శత వసంతాలు పూర్తి చేసుకోబోతున్న ఈ తరుణంలో, ఆ విప్లవంలో పాల్గొన్న ప్రముఖ యోధుల గురించి విప్లవాభిమానులు తెలుసుకోవలసిన అవసరం ఉంది. ఆ కృషిలో భాగమే ఈ వ్యాసం.



బోల్షివిక్ విప్లవం జరిగి వందో సంవత్సరం సందర్భంగా మనం ఈ విప్లవం గురించీ,
దాని చారిత్రక అవశ్యకత, అనివార్యతలను గురించీ తెల్సుకుందాం - వై.వి.ఆర్.

# బోల్షివిక్ విప్లవం



## 1."బోల్షివిజం, లెనినిజం :

ఈ రెండూ సమానార్థకంగా వాడబడుతున్నాయి. కానీ మార్క్సిస్టు సోషలిస్టు విప్లవ గమనం, ఆచరణను తెలియజేసేది బోల్షివిజం. సోషలిస్టు విప్లవ సిద్ధాంతం, ఆచరణను గూర్చిన సైద్ధాంతిక విశ్లేషణ ఇచ్చేది లెనినిజం"('ఏ డిక్షనరీ ఆఫ్ మార్క్సిస్ట్ థాట్'గ్రంథం నుండి)

లెనినిజం అంట..'శ్రామిక (కార్మిక, కర్షక) వర్గ పోరాటం; పెట్టుబడిదారీ ఆర్థిక విధానాన్ని ఖచ్చితంగా విశ్లేషించే పద్ధతి; కార్మికవర్గ నియంతృత్వాన్నీ, ప్రజాస్వామిక కేంద్రీకరణను ఉన్నత శిఖరాలకు చేర్చినదీ; సోషలిస్టు భావన, సంస్కృతులను ప్రపంచానికి పరిచయం చేసినదీ'

## 2.బోల్షివిక్ పార్టీ చరిత్ర :

"1903లో జరిగిన రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబర్ పార్టీ రెండవ కాంగ్రెసు సమావేశంలో లెనిన్ బోల్షివిజాన్ని ఒక రాజకీయ ఆలోచనగా, పార్టీగా ముందుకు తెచ్చాడు. అందులోనే, 'మార్టోవ్' అనే అతనితో విభేదించి, సంప్రదాయ కార్మిక ఉద్యమ నాయకత్వం (ట్రేడ్ యూనియన్) కిందనూ, ఇతర సోషల్ డెమొక్రటిక్ పార్టీల నుండీ వచ్చిన వారు బోల్షివిక్ పార్టీలో సభ్యులుగా ఉండటాన్నీ కాదనాలనీ; బదులుగా, అంకితభావం గల జీవితకాల రాజకీయ కార్యకర్తలే 'బోల్షివిక్ పార్టీ సభ్యులు'గా వుండాలనీ ప్రతిపాదించాడు. అలా రెండు గ్రూపులుగా విడిన RSDLP, 'బోల్షివిక్కులు', అంటే: 'మెజారిటీ' లేదా 'విప్లవాత్మకమైన' అన్న అర్థం గల వర్గంగానూ, 'మెన్షివిక్కులు', అంటే: 'మైనారిటీ' లేదా 'తక్కువ విప్లవ చైతన్యం గలవారు 'అనబడే వర్గంగానూ ఏర్పడింది. 1917 ఏప్రిల్ కాంగ్రెసు సమావేశంలో ఈ బోల్షివిక్ పార్టీ, అధికారయుతంగా RSDLP (BOLSHEVICగా మారింది; 1918 మార్చి నుండి 'రష్యన్ కమ్యూనిస్టు పార్టీ (బోల్షివిక్)' గా మారింది; 1952 నుండి 'కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ సోవియట్ యూనియన్'గా మారింది." ('ఏ డిక్షనరీ ఆఫ్ మార్క్సిస్ట్ థాట్'గ్రంథం నుండి.)

## 3. రష్యన్ విప్లవానికి భూమిక :

ఆనాటి రష్యన్ సమాజ పరిస్థితులైన, ఒకవైపు దశాబ్దాల తరబడి జారు చక్రవర్తుల నిరంకుశాధికారం, దమనకాండ, పేదరికం, దోపిడీల నుండీ, విశృంఖల అసమానతల నుండీ; మరోవైపు, జపాన్ సామ్రాజ్య కాంక్షకూ, యూరపులోని ప్రష్యా, బ్రిటన్, ఫ్రాన్స్ లాంటి దేశాల

దురాక్రమణలనుండీ తమ్ముతాము కాపాడుకునే, నిల్పుకునే ప్రయత్నాల్లో నాటి రష్యన్ ప్రజలు అమేయ ధైర్యసాహసాలు చూపించాల్సి వచ్చింది. కానీ, వీటి మాటునే తమ సొంత పార్టీలోనే అతివాద, మితవాద, మధ్యేవాద, దుందుడుకు తనం కల్గిన, సైద్ధాంతిక వెలితి కల్గిన, క్రమశిక్షణ లోపించిన, చారిత్రక అవగాహన లేమి, సమాజగతి నియమాలు తెలీని గ్రూపులు కూడా నిరంతరం, కచ్చాపచ్చాగా తమ అధికారం కోసమూ, తెలీనితనంతో చేసే చర్యల మూలంగానూ, అనైక్యంగా ఉన్నాయి. ఇక అప్పుడు, మార్క్స్ అందించిన గతితార్కిక చారిత్రక భౌతికవాదం సహాయంతో సోషలిస్టు రాజ్య స్థాపన సాధించే చిత్రాన్ని లెనిన్ అత్యంత శ్రమకోర్చి, బాధ్యతాయుతంగా, ఎంతో చాకచక్యంగా రష్యన్ ప్రజల్లోకి తీసుకెళ్ళాడు. ఆ తర్వాత 1905లో జరిగిన ప్రథమ రష్యన్ విప్లవం అనదగిన దాంట్లో, ఈ ప్రజలే బారికేడ్ల సహాయంతో, వీధి పోరాటాలతో, కరపత్రాలు, పత్రికలు, సభలు, సమావేశాలు, మొదలైన వాటి ద్వారా జార్ చక్రవర్తుల నిరంకుశాధికారానికి వ్యతిరేకంగా పోరాడారు. పోరాటపటిమ ఉన్నా, అనుభవలేమి వల్ల, నాటి 1905 విప్లవం అణచబడింది. అయితే, తర్వాత మరింత దీక్షతో లెనిన్, అతని అనుయాయులు, ఇతరులను కల్పుకుంటూనే అనేక విధాలుగా విప్లవక్రమాన్ని కొనసాగించారు. 1914-18 వరకు జరిగిన మొదటి ప్రపంచయుద్ధంలో అనేక లక్షల మంది రష్యన్లు యూరప్ దేశాల సామ్రాజ్యవాదానికి బలైపోయినా, దాని గమనం, సామ్రాజ్యవాద కాంక్షపై సరైన విశ్లేషణ చేయగల్గిన లెనిన్, ఈ యుద్ధాన్ని 'సోషలిజం సాధించేందుకు ఒక మార్గం'గా మలచ వచ్చుననీ, దానికి ఇదే తగిన చారిత్రక సందర్భం అనీ తెల్పుకుని, పార్టీలోని వారికి అర్థమయ్యేలా చేసి, వారి ద్వారా ప్రజల్లోకి తీసుకెళ్ళి, వారిని 1917 విప్లవానికి సన్నద్ధం చేశాడు.

దీనిని సాధించటానికి లెనిన్, అంతకుముందు క్రమశిక్షణలేని, గాలివాటపు పోరాటాలను కాదని, సుశిక్షితులైన, అంకితభావం గల జీవితకాల సభ్యులైన రాజకీయ కార్యకర్తలు అవసరమని గుర్తించాడు. అందుకోసం, 'ప్రజాస్వామిక కేంద్రీకరణ (DEMOCRATIC CENTRALISM) అనే పద్ధతిని ప్రవేశపెట్టాడు. దీని ద్వారా, సభ్యులు పార్టీ నాయకత్వాన్ని ఎన్నుకోవటంలోనూ, తమ అభిప్రాయాలను తెలియ జేయటంలోనూ ప్రజాస్వామ్య పద్ధతిలో వ్యవహరించాలి; ఒకసారి పాలసీనిర్ణయాలు జరిగాక, ఎట్టి మినహాయింపులూ లేకుండా సభ్యులందరూ కేంద్రకమిటీ తీసుకునే ఆ నిర్ణయాలను శిరసావహిస్తూ, అమలు పరచాల్సిందే. కేవలం ఈ పద్ధతిలో మాత్రమే, బూర్జువాలకు వ్యతిరేకంగా శ్రామికవర్గం చేసే విప్లవాత్మక పోరాటం విజయం సాధించగలదని నొక్కి చెప్పబడేది. అయితే, తర్వాతి కాలంలో ఈ కేంద్రకమిటీ అజమాయిషీ చాలా రెట్లు పెరిగిపోయిందనీ, ఈ నమూనాను మిగతా దేశాలు (ఇండియాలోని నేటి కమ్యూనిస్టు పార్టీలు కూడా) ఆచరించి, పార్టీలో ప్రజాస్వామ్య విధానం నామమాత్రంగా జరగటానికి ఆస్కారమిచ్చాయనే విమర్శల్లో నిజం వుంది.

అవకాశవాది అయిన బకూనిన్ మతాతత్వాన్ని ఎండగట్టడం; 1871 నాటి పారిస్ కమ్యూన్లో ప్రజల అసంఘటితత్వం, కార్మికపార్టీ లేకపోవటం వల్ల విప్లవం ఓడిపోవడం గురించి మార్క్స్ చెప్పడాన్ని లెనిన్ స్పష్టంగా అర్థం చేసుకున్నాడు.

ఆ తర్వాతనే, అలాంటి అవకాశవాదులైన కాట్స్కీ, ట్రాట్స్కీల విధానాల్ని ఎండగట్టాడు; రాజ్యాధికారం లక్ష్యంగా కార్మికపార్టీని నిర్మిస్తూ సోషలిజంలో 'కార్మికవర్గ నియంతృత్వం 'పై విశ్వాసం గల కార్యకర్తే అసలైన కమ్యూనిస్టు అన్నాడు.

"1905లో బోల్షివిక్కులు మెన్షివిక్కులతో కలసి విప్లవ పోరాటంలో పాల్గొన్నా, 1906, 1910లలో సర్దుబాట్ల తర్వాత కూడా వారి మధ్య విభేదాలు మరింతగా పెరిగాయి. కార్మిక, కర్షక, సైనిక ప్రతినిధుల ద్వారా విప్లవకరంగా ఏర్పడ్డ కౌన్సిల్లను 'సోవియట్లు' అన్న పేరుతో స్వయం పాలన చేసుకునేవిగా తయారుచేశారు. 1914లో రష్యా చక్రవర్తి జార్జ్ నికోలస్ II, 1.10 కోట్ల మంది రైతులను మొదటి ప్రపంచ యుద్ధంలోకి లాగి, లక్షలమంది చావుకు, గాయాలకూ కారణమయ్యాడు. దీనితో విసుగెత్తిన రష్యన్ ప్రజలు, సైన్యం: శాంతినీ, తిండినీ, సామాజిక సమానతనూ కాంక్షిస్తూ, లెనిన్ నాయకత్వంలో విప్లవం చేశారు. మొదటి ప్రపంచ యుద్ధాన్ని సామ్రాజ్యవాదం రష్యాపై చేసే జాతీయ యుద్ధంగా చిత్రించటాన్ని లెనిన్ ఖండించి అది సామ్రాజ్యవాద యుద్ధమని స్పష్టం చేశాడు. సమ్మెల్లో లక్షలమంది వివిధ రంగాల కార్మికులు పాల్గొనేవారు. సోవియట్ల ఆధ్వర్యంలో ఫ్యాక్టరీలను స్వాధీనం చేసుకుని వారే నడిపేవారు. నావికాదళం యొక్క సహకారం విప్లవం చివరిదశలో మరువలేనిది. 1917 ఫిబ్రవరి నాటి తాత్కాలిక ప్రభుత్వాన్ని కూలదోసి, సోవియట్లు అధికారాన్ని స్వీకరించారు." (ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర, నుండి)

### 4. విప్లవ విజయం తర్వాత డిక్రీల జారీ :

"1917 అక్టోబరు 25 నాటి సమావేశంలో లెనిన్ 2 డిక్రీలను జారీ చేశాడు. అవి: 1. దేశాల మధ్య విభేదాల పరిష్కారానికి యుద్ధం కాక, శాంతి ద్వారా పరిష్కారం కనుగొనాలన్నారు. 'యుద్ధం' మానవజాతికి వ్యతిరేకమైన అపరాధాల్లో కల్లా మహాపరాధమని డిక్రీ ప్రకటించింది. 2. భూమిని గురించిన డిక్రీలో భూస్వాముల కమతాలన్నింటినీ నష్టపరిహారం లేకుండా స్వాధీనం చేసుకొని, ఆ భూములన్నింటినీ కష్టపడే రైతులకు పంచిపెట్టాలని డిక్రీ ప్రకటించింది. తర్వాత, రైల్వేలనూ, పరిశ్రమలనూ, భూములనూ జాతీయం చేసింది. జాతుల పీడనను అంతమొందించింది. స్త్రీలకు సమాన హక్కులు కల్పించబడ్డాయి. 'రైతులేం పరిపాలన పగ్గాలు చేపడతారులే 'అన్న కాట్స్కీలాంటి వారి ఎగతాళి వ్యాఖ్యల్ని ఖండిస్తూ, రైతులు బ్రహ్మాండంగా పరిపాలన చేపట్టారు. తనను తాను రక్షించుకోలేని విప్లవం నిరర్థకం అన్న లెనిన్, రష్యా ను రక్షించే బాధ్యతను రెడ్ ఆర్మీకి అప్పగించాడు." (ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర, నుండి)

"1920లో జరిగిన రెండవ కాంగ్రెస్ సమావేశంలో, 21 పాయింట్లద్వారా 'పార్టీ సభ్యుడంటే ఎవరు?'ను నిర్వచిస్తూ వుండిన రష్యన్ పార్టీని మోడల్ గా ఆమోదిస్తూ, కమ్యూనిస్ట్ ఇంటర్నేషనల్ జరిగింది. శీఘ్ర పారిశ్రామికీకరణ, ఒకదేశంలో సోషలిజం, కేంద్రీకృత రాజ్యాధికారం, సమిష్టి వ్యవసాయం, ఇతర కమ్యూనిస్టు పార్టీల ప్రయోజనాలు సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ప్రయోజనాలకు లోబడి వుండాలనే స్టాలిన్ పాలసీలకి అనుగుణంగా బోల్షివిక్ పార్టీ మారింది."

('ఎ డిక్షనరీ ఆఫ్ మార్క్సిస్ట్ థాట్'గ్రంథం నుండి.) స్టాలిన్ పై

అపవాదులు, అతని అపజయాలు, తప్పులనే చూపుతూ ప్రత్యర్థులు విమర్శలు చేసినా కూడా నాటి బోల్షివిజం, ప్రపంచ విప్లవాన్ని సాధించటంలో ఒక ఆయుధంగా పనికొచ్చిందని చెప్పవచ్చు; ఈ చర్యలు ఆనాటి చారిత్రక అవశ్యకతే కాక, పెట్టుబడిదారీ వ్యవస్థచే చుట్టూ ముట్టడించబడిన ఒక దేశం స్వీకరించదగినవే, అవి ఆపలేని చర్యలే.

**5. సామ్రాజ్యవాదం :**

లెనిన్ 1920లో చేసిన ఈ రచన, సామ్రాజ్యవాదంపై నేటికీ ఉత్కృష్టమైనదిగా నిలిచిపోయింది. దీనిలో లెనిన్, సామ్రాజ్య వాదం అన్నా, ఫైనాన్స్ కాపిటల్ అన్నా ఒకటేనని వివరిస్తాడు. విప్లవద్రోహి అని లెనిన్ అన్నటువంటి కాట్స్కీ ప్రకారం, సామ్రాజ్యవాదం అంటే: యుద్ధం యొక్క ప్రాముఖ్యాన్ని చూపటం. కానీ, లెనిన్‌కి సంబంధించి, యుద్ధం అంటే: సామ్రాజ్యవాదం యొక్క రెండవ పార్శ్వం లేదా అది సామ్రాజ్యవాదపు బూచి. అసలుకి సామ్రాజ్యవాదం ముఖ్య లక్షణం, ఫైనాన్స్ కాపిటల్ చేసే నగ్న దోపిడీ, పరాన్నభుక్కుతత్వం. సామ్రాజ్యవాదం అంటేనే: సోమరిజనసమూహ ఉత్పాదక యంత్రం.

**6. బోల్షివిక్ విప్లవం ఇచ్చిన ప్రేరణ :**

రష్యాలో విప్లవం ప్రారంభం కావచ్చునని మార్క్స్, ఎంగెల్స్‌లు ఆనాడే ఊహించక పోలేదు. దాని కనుగుణంగానే, రష్యా ప్రపంచ విప్లవమనే శిశువుకు ఊయల అయింది, అది ప్రపంచ సోషలిస్టు ఉద్యమంలో అగ్రగామి పాత్రను అంగీకరించి, దానికి తగ్గట్టుగానే వ్యవహరించింది. దీని ప్రేరణతోనే యూరపులో సోషలిస్టు విప్లవాలు, ఇతర ఖండాల్లో జాతీయ విమోచనోద్యమాలూ జయప్రదంగా జరిగాయి.

**7. బోల్షివిజంలో కూడా అనుకూల, ప్రతికూల గ్రూపులున్నాయి :**

(1). మేధావులు, ట్రేడ్ యూనియన్ నాయకత్వాన్ని బలపరుస్తూ, శ్రామికవర్గంపై పార్టీ అధికారాన్ని నిరసిస్తూ ట్రాట్స్కీ చేసిన పార్టీ లోపలి యుద్ధం. ట్రాట్స్కీ, పార్టీలోనే వుంటూ తనలాంటివారి గ్రూపుల హక్కుల గురించి మాట్లాడుతూ పార్టీని సంక్షోభంలోకీ, గందరగోళంలోకీ నెట్టే చర్యలు చాలా గట్టిగానే చేశాడు. 1917కి ముందు లెనిన్ వీటిని నిరసిస్తూ పోరాటం చేశాడు. బోల్షివిజం రాజ్యం చేస్తున్న సమాజాల్లోని ప్రజలు సోషలిస్టు విప్లవాన్ని చేసేంత చైతన్యం లేకపోవటం, ఉత్పత్తిశక్తుల అభివృద్ధిలేమి: వీటివల్ల రాజ్యం ప్రజలపై ఆధిపత్యపాత్ర వహించింది అంటూ, ఈ దృష్ట్యా, బోల్షివిజం అనేది ఒక రాజకీయ అవకాశవాదంగా, ఆరోపిత విప్లవంగా వుండిందని మెన్షివిక్కుల ఆరోపణ. అయితే, పార్టీ యొక్క అధికారం శ్రామికవర్గంపైనా, ఇతర అన్ని విభాగాల పైనా కాలక్రమంలో ఎక్కువైందనేది నిజమే. అయినా కూడా, అలనాటి యుద్ధం, అంతర్గత నిరసనల జోరువల్ల, మొదటి సోషలిస్టు దేశంలో ఆ మాత్రం పార్టీ పట్టు, పార్టీపై విధేయతా అవసరమే అయ్యాయి. (2). బోల్షివిజంలోని ఉత్పత్తి శక్తుల అభివృద్ధే సోషలిజం స్థాపనకు మొదటి కర్తవ్యంగా సాగినదాన్ని మావోయిజం కూడా కాదంటూ, దాని ఉన్నతదశ కంటే ముందే వివిధ వర్గాల ప్రజల మధ్య సోషలిస్టు సంబంధాలు నెలకొనాలంటూ తమ దేశ స్థితికి అనుగుణంగా ముందుకెళ్ళింది. పెట్టుబడిదారీ విధానాలను కూకటివ్రేళ్ళతో నిర్మూలించటం, ప్రజల్లో సోషలిస్టు భావనల్ని వ్యాప్తి చేయటం లాంటి వాటిని కూడా గట్టిగా నొక్కి చెప్పారు. (3). రోజా లక్జెంబర్గ్ కూడా బోల్షివిజంలోని పార్టీ కేడరు విధానం, పార్టీకి విధేయత వల్ల, శ్రామికవర్గపు విప్లవాత్మక చర్యల్ని తగ్గించిందని అన్నారు. ('ఏ డిక్షనరీ ఆఫ్ మార్క్సిస్ట్ థాట్'గ్రంథం నుండి)

కాలక్రమేణా యూరో కమ్యూనిజం ప్రభావం వల్లనూ, 1989 సంవత్సరం తర్వాత సోవియట్ యూనియన్ పతనం వల్లనూ, బోల్షివిజం నమూనానే సోషలిజం, కమ్యూనిజం సమాజాలకి మార్గదర్శకం అనే సంప్రదాయ భావన తొలగిపోయింది. అయితే, బోల్షివిజాన్ని సర్వకాలాలకూ, అన్ని దేశాలలో సోషలిస్టు స్థాపనకూ ఒక నమూనా అని లెనిన్, స్టాలిన్ లు చెప్పలేదు. యూరో కమ్యూనిజంలోని ముఖ్య భావనల ప్రకారం, అసలు అక్కడ సోషలిస్టు రాజ్యాలే ఏర్పడలేదు. అవన్నీ పెటీబూర్జువా ప్రజాస్వామ్య ప్రభుత్వాలే. పరభాగ్యోప (parasitic) జీవన విధానాన్ని కల్గిన ఆ దేశాలలో సోషలిస్టు భావనలు రావటం చాలా సుదీర్ఘ ప్రస్థానమే. కాబట్టి, అణచబడ్డ ప్రజలున్న అభివృద్ధి చెందినటువంటి, వర్ధమాన దేశాల్లోనే ముందుగా విప్లవాలు వచ్చాయి. కాకుంటే, యుద్ధాల ఛాయల మాటున రష్యా, చైనాలలో నాటి సామాజిక, రాజకీయ పరిస్థితులకు అనుగుణంగా విప్లవాలు వచ్చాయి. సోషలిస్టు విప్లవం తర్వాత కూడా లెనిన్ బోల్షివిజం కార్యక్రమాన్ని కొనసాగిస్తూ, "ఏం చెయ్యాలి?" రచనలో, కుట్రదారీ సంఘం, విప్లవకారుల సంఘం మధ్య భేదాన్ని చెబుతూ చాలా చక్కగా విప్లవావశ్యకతను వివరిస్తాడు; గ్రూపిజాన్నీ, ముఠాతత్వాన్నీ నిరసిస్తాడు. అణచివేత ఎక్కువగా గల రష్యాలో రహస్య విప్లవ సంఘం కార్యకలాపాలు తప్పవని (రహస్య ముఠా సంఘాలు కాదు) లెనిన్ అంటాడు. వీటి గురించీ, రష్యన్ విప్లవం యొక్క మానవీయ, ధైర్య, త్యాగ గుణాల గురించీ, అందులో ముఖ్యంగా స్త్రీల అసమాన త్యాగం, పోరాటాల గురించీ, 'అమ్మ' లాంటి నవలలో వాటిని కళ్ళకు కట్టినట్లు చూపించిన దాని రచయిత 'మాక్సిం గోర్కీ' గురించీ ఎన్నిసార్లు, ఎంత చెప్పుకున్నా తక్కువే. ఎందుకంటే: మానవ సమాజాన్ని మలుపు తిప్పిన ఆ చారిత్రక యుగ సంఘటనలకి చరిత్రలో ఏదీ సాటి రాదు.

**8. విప్లవం ఎప్పుడు చేయాలి? :**

"ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో రష్యా వెనుకబడి ఉంది కాబట్టి, ముందుగా అది పెట్టుబడిదారీ పరిస్థితుల్లో ఒక నిర్దిష్ట సాంస్కృతికాభివృద్ధి స్థాయిని అందుకోవాలనీ, ఆ తర్వాతే సోషలిస్టు విప్లవానికి పూనుకోవాలనీ కొందరు మార్క్సిస్టులు అన్నారు. రష్యా వెనుకబాటుతనాన్ని లెనిన్ గుర్తించాడు. అయినా, విప్లవం జరపాలంటే ఒక నిర్దిష్ట సాంస్కృతిక స్థాయిని అందుకునే వరకూ వేచి వుండాలన్న అభిప్రాయం పూర్తిగా అసంగతమైనదని ఆయన పరిగణించారు. అలా వేచి వుండడం అంటే: రష్యా బాధాకరమైన, సుదీర్ఘమైన పెట్టుబడిదారీ దశను గడపాలన్నమాట. రష్యాలోని జాతులకు లెనిన్ వేరొక విధమైన మార్గాన్ని ప్రతిపాదించారు. పార్టీ దీనినే బలపరచి, అమలు జరిపింది. శాస్త్రీయ సిద్ధాంతంలోనూ, ప్రజానీకానికి సారథ్యం వహించే కళలోనూ ఆరితేరిన విప్లవ శ్రామికవర్గ అగ్రదళం సోషలిస్టు విప్లవానికి ప్రజలను మేల్కొలిపింది."

## 9. సోషలిజంలో ఏం చెయ్యాలి? :

"అదే సమయంలో, సోవియట్ రిపబ్లిక్ యువజనులు ఒక యావత్తు యుగం యొక్క మానవ సంస్కృతికి దూరమై, పూర్తిగా కమ్యూనిస్టు విలువలకు మాత్రమే పరిమితమైతే, వారు అజ్ఞానులై, జీవితానికి పనికి రాకుండా పోతారని లెనిన్ ఎంతో భయపడ్డాడు. నవసమాజ నిర్మాణంలో బూర్జువా మేధావులు పాల్గొనేలా చేయడం అవసరమని కూడా ఆయన భావించారు. విజ్ఞాన శాస్త్రానికీ, ఇంజనీరింగుకూ చెందిన వివిధ రంగాల్లోని ప్రవీణులు అందులో పాల్గొనకపోతే, సోషలిజానికి పరివర్తన అసాధ్యమని ఆయన నొక్కి చెప్పారు. అందువల్ల, తటస్థంగా వున్న ప్రవీణులనూ, ఆ మాటకు వస్తే విప్లవ వ్యతిరేకులైన ప్రవీణులను కూడా, వారికి నవచైతన్యం కలిగించి, నూతన సామాజిక వ్యవస్థకు గల మహోజ్వల భవిష్యత్తును వివరించి, వారి మనసులను ఆకట్టుకోవడం ద్వారా ఉపయోగించు కోవడం అవసరమయింది."

## 10. కొన్ని సోషలిస్టు మార్పులు :

"1.ప్రజల సాంస్కృతిక స్థాయి ఎంతో ఉన్నతమైనది : తిండి, వినోద దృశ్యాలూ వుంటే చాలు, చిక్కులన్నీ తొలగిపోతాయని వాదించేవారి అభిప్రాయాలను లెనిన్ వ్యతిరేకించారు. తిండి నిస్సందేహంగా అత్యవసరమైనదే. కానీ, వినోద దృశ్యాలను లెనిన్ నిజమైన కళగా పరిగణించలేదు. అవి ఇంచుమించు చవుకబారు ఆకర్షణలని ఆయన అన్నారు. చవుకబారు దృశ్యాలకన్నా గొప్పవైన వాటిని ఆనందించగల అర్హత కార్మికులకూ, కర్షకులకూ ఉన్నదనీ లెనిన్ భావించారు. నిజమైన గొప్పకళను ఆనందించే హక్కును వారు సాధించుకున్నారన్నాడు."

"2. నీతి : మానవ సమాజం పురోగమించిన కొలదీ నీతి, అవినీతి అనేవి మారుతూ వచ్చాయి. ఈ మార్పులకూ, ప్రజల జీవిత పరిస్థితుల్లో వచ్చిన మార్పులకూ సంబంధం వుంది. సమాజం శత్రువర్గాలుగా విభజితమై వున్న పరిస్థితుల్లో నీతీ, దానిపట్ల వైఖరులూ ఒకటిగానే ఉండజాలవు, వర్గాతీతంగానూ వుండజాలవు. అటువంటి సమాజంలో పరస్పర విరుద్ధమైన నీతి సూత్రాలు తప్పనిసరిగా-రూపొందుతాయి. ఉదాహరణకు, వ్యక్తిగత ఆస్తిని నీతైనదిగానూ, పవిత్రమైనదిగానూ, అతిక్రమించరానిదిగానూ పెట్టుబడిదారులు పరిగణిస్తారు. కార్మికుని దృష్టిలోఅది సరైనది కాకపోవచ్చు. ఉత్పత్తి సాధనాలూ, పరికరాలపై వ్యక్తిగత యాజమాన్యాన్ని రద్దుచేయడం కోసం అతను పోరాడవచ్చును."

"3. పోటీ, సహకారం : అదేవిధంగా, ఎవరిమట్టుకు వారుండడమూ, ఒకరితో ఒకరు పోటీ పడడమూ ప్రజలు పరస్పర సంబంధాల్లో అనుసరించవలసిన మార్గదర్శక సూత్రాలని పెట్టుబడిదారులు భావిస్తారు. కార్మికుడు అలా కాకుండా, సమిష్టితత్వం కోసమూ, పరస్పర సహాయం కోసమూ పోరాడుతాడు".

"4. మానవ స్వభావం : అహంభావం, పేరాశ, దురాక్రమణతత్వం, అధికార దాహం, క్రౌర్యం, మొదలగునవి మానవుని సహజ లక్షణాలనీ; మానవ స్వభావమూ, నైతిక విలువలూ శాశ్వతమైనవీ, మారనివనీ బూర్జువాలు తరచూ వాదిస్తూ వుంటారు. శాశ్వత నీతి అనే భావనను కమ్యూనిస్టులు నిరాకరిస్తారు. శత్రువర్గాలతో కూడిన సమాజం వున్న పరిస్థితుల్లో సాగిన తీవ్రపోరాటం సందర్భంలో మానవుల్లోని దుర్గుణాలు తలెత్తాయి. ఆ పరిస్థితులు అంతరించినప్పుడు అవి కూడా అదృశ్యమైపోతాయి. కమ్యూనిస్టు తరహాలో విద్యాబుద్ధులను నేర్పినట్లయితే, మానవ స్వభావాన్ని కొత్తపుంతల్లో మలచడం త్వరితం కాగలదన్న వాస్తవ విషయం కమ్యూనిస్టుల అభిప్రాయానికి ఆధారం." (లెనిన్: విద్యపై, పి.డి.ఎస్.యు. ప్రచురణలో )

## 11. బోల్షివిక్ విప్లవ:వర్తమాన కర్తవ్యం :

నేటి రష్యాలో కృశ్చేవ్, గోర్బచెవ్, ఎల్సిన్ కాలపు రివిజనిస్టులు, అమెరికా తొత్తుల అనుయాయులు కోకొల్లలు. రష్యన్ కమ్యూనిస్టు పార్టీ సుమారుగా నాల్గో వంతు వరకు ప్రజల్లో పట్టు కల్గి వుంది. దారుణంగా దెబ్బతిన్న రష్యాను పుతిన్ కొంతమేర పునరుద్దరించాడు. అయితే, కమ్యూనిస్టు పద్ధతుల్లో కాదు. రష్యాలో కమ్యూనిస్టులు బలపడకుండా ప్రపంచ పెట్టుబడిదారీ దేశాలు నిరంతరం వారిని అణచివేస్తున్నాయి. చైనాలో కూడా దేశ వనరులపై పేరుకే ప్రభుత్వ ఆధిపత్యం వుంటుంది, నిర్వహణ అంతా పెట్టుబడిదారులదే. ఇలా ప్రపంచమంతా ప్రస్తుతం ఒక స్తబ్ద స్థితిలోనూ, విప్లవాన్ని తన గర్భంలోనూ నివురుగప్పి వుంచుకుంది. పెట్టుబడి తన పని తాను చేసుకుపోతుంది అన్న మార్క్స్ మాట నిజమని అరబ్బు ప్రపంచంలో దశాబ్దాలుగా తనకు వ్యతిరేకంగా వున్న పాలకులను మార్చటానికి 'గులాబీ విప్లవం'అన్న పేరు మీద ఆ దేశాల్లో అలజడులు సృష్టించి, వారిని కుట్రలతో చంపి, తన తొత్తులను ఆ దేశాల్లో నియమించుకున్న దాన్ని బట్టి తేటతెల్లమౌతోంది. ఇంకా, లాటిన్ అమెరికా దేశాల్లో మంచి పట్టున్న కమ్యూనిస్టు దేశాధినేతలను సైతం కుట్రలతో దించి, తన తైనాతీ పాలకులను గద్దెపై కూర్చోబెట్టింది. ఇవన్నీ, అమెరికా, యూరప్ దేశాల యొక్క పక్కా ప్రణాళిక ద్వారా జరుగుతూనే వుండటానికి కారణం:ఇతర దేశాల్లోని ఆయిల్, సహజసంపదలను అతితక్కువ ధరకు కాజేయటమే కాక, ఆ దేశాల మార్కెట్లను తన చవకైన సరుకులతో నింపి, లాభాల్ని ఆర్జించటమే. నేడు భారతదేశంలో జరుగుతున్న 'ఆపరేషన్ గ్రీన్ హంట్' కూడా ఆదివాసీ అటవీ సంపదను కాజేసే అలాంటి దోపిడీ ప్రణాళికే. ఈ దోపిడీ గురించి ప్రజల్లోకి తీసుకెళ్లి, బోల్షివిక్ త్యాగభరిత చరిత్ర నుండి ప్రేరణ పొంది, వర్గ పోరాటం, సాంస్కృతిక పోరాటం రెండూ చేయాల్సిన తరుణమిది.

దానికై ప్రపంచవ్యాప్తంగా కమ్యూనిస్టు పార్టీల ఐక్య సంఘటన, మళ్ళీ 'కమ్యూనిస్టు ఇంటర్నేషనల్' స్థాపన అతిత్వరగా జరిగి తీరాల్సిన సమయమిదే. ప్రతిరోజూ, ప్రతి సంవత్సరమూ, ఒకే విధమైన మూసపోసిన బతుకు బతుకుతూ, 'పాచిపోయిన మానవీయత'ను సంతరించుకునే మన ఈ జీవితాలను, నాచు పట్టని జలపాతాల వలె తీర్చిదిద్దుకుందాం.

## 12. మానవజాతి విముక్తి :

కాబట్టి, శ్రామిక వర్గ విముక్తి ఎందుకంటే:దాని విముక్తి చేసుకుంటేనే అది, మొత్తం మానవజాతిని కూడా అది నాడు, నేడు కూడా ఈడ్చుకుంటూ వస్తున్న దోపిడీ, అసమాన జీవన విధానం, సంస్కృతుల నుండి విముక్తి చేయగలదు కాబట్టి. అంటే:మానవజాతి విముక్తికి శ్రామికవర్గ విముక్తి అనేది ఒక ముందస్తు షరతు అన్నమాట. "నూరు పూలు వికసించనీ, వేయి ఆలోచనలు సంఘర్షించనీ".



సోషలిజమే ప్రత్యామ్నాయం

# తొలి ఉపాధ్యాయుడు

వీర బ్రహ్మచారి

**సామాజిక విప్లవానికి, దాని మనుగడకు ఎటువంటి మనుషులు రూపొందారో, వాళ్ళ కృషి వల్ల ఎటువంటి పరిణామక్రమం మొదలైందో, ఆ వ్యక్తుల మూర్తిమత్వంను సాహిత్య రూపాల్లో చిత్రిక పట్టారు కొందరు. అక్షరబద్ధం చేశారు. అటువంటి సాహితీ వేత్తల్లో ఒకడైన చింగేజ్ ఐత్ మాతోవ్ కలం నుండి వెల్వడినదే "తొలి ఉపాధ్యాయుడు" నవలిక.**

**వేల** సంవత్సరాలుగా మనుషుల మధ్య కొనసాగుతున్న వివక్ష, ఆధిపత్య బానిసత్వ సంబంధాలు లేని స్వేచ్ఛాయుత సమాజాన్ని (ఠాగూర్); అందరూ సుఖంగా, అందరికీ మంగళకరమైన సమాజాన్ని (భారతీయ రుషులు) చాలా మంది తత్వవేత్తలు సాహితీవేత్తలు కళాకారులు కలలుగన్నారు, ఆకాంక్షించారు. వాళ్ళ కలలు ఆకాంక్షలను అక్షరబద్ధం చేసి నిక్షిప్తం చేశారు. అయితే వీళ్ళు ఆధిపత్య శక్తులతోనే అంటకాగారు. కొందరు వాళ్ళకాలం నాటి సమాజాన్ని విశ్లేషించి ఎట్లున్నదో చెప్పడం వరకే పరిమితమై అందుకు గల కారణాల అన్వేషణకు పూనుకోలేదు.

వీళ్ళందరూ రోగగ్రస్థ సమాజాన్ని ఎట్లా మార్చగలమో చెప్పలేదు. మార్క్స్ మాత్రం వ్యవస్థీకృత సమాజం చలనాలకు గల కారణాన్ని విశ్లేషించి, వివరించి ఎట్లయితే ఆరోగ్యకర ఆదర్శవంతమైన సమాజాన్ని నిర్మించబడుతుందో చెప్పిండు. అట్లా మాత్రమే నిర్మించగలమని, ఆ విధానమే వర్గపోరాటం అని, దాని ద్వారా మార్పు జరుగుతుందని, ఆ మార్పు తర్వాతే, క్రమంలోనే అందరూ సుఖపడే, వివక్ష ఆధిపత్యాలు లేని స్వేచ్ఛాయుత సమాజం, హెవెన్ ఆఫ్ ఫ్రీడం, దాని మొదటి దశ 'సోషలిస్టు సమాజం' అన్నాడు.

ఆ సోషలిస్టు సమాజ స్థాపనకుగాను ఫ్రాన్స్‌లో కొందరు యువకులు పూనుకొని ప్రయత్నించి తత్కాలికంగా, తాత్కాలి కంగా విజయం సాధించి స్వల్ప కాలం మాత్రమే నిలబడి విఫలమైనారు. తర్వాత రష్యాలో లెనిన్ నాయకత్వంలో అటువంటి కృషి సాధ్యమైంది. శాశ్వతంగా గాకపోయినా దీర్ఘకాలికంగా నిలబడి, ప్రపంచంలోని మరెన్నో దేశాలకు స్ఫూర్తిదాయకమైంది. దిక్సూచి అయింది. అయితే ఆ సామాజిక విప్లవానికి దాని మనుగడకు ఎటువంటి మనుషులు రూపొందారో, వాళ్ళ కృషి వల్ల ఎటువంటి పరిణామక్రమం మొదలైందో, ఆ వ్యక్తుల మూర్తిమత్వంను సాహిత్య రూపాల్లో చిత్రిక పట్టారు కొందరు. అక్షరబద్ధం చేశారు. అటువంటి సాహితీ వేత్తల్లో ఒకడైన చింగేజ్ ఐత్ మాతోవ్ కలం నుండి వెల్వడినదే "తొలి ఉపాధ్యాయుడు" నవలిక.

1962లో కిర్గిజ్ భాషలో వెల్వడ్డ ఈ నవల తెలుగు అనువాదంను 1971లో హెచ్‌బిటి వాళ్ళు వెల్వరించారు.

తొలి ఉపాధ్యాయుడు ద్యుయషేన్ శిష్యురాలు అల్తినాయ్ సులైమనోవ ఒక మిత్రునికి ఉత్తరం ద్వారా ఉత్తమ పురుష వాచకంలో చెప్పినట్లు సాగుతుంది నవల.

ద్యుయ్‌షేన్ ఉపాధ్యాయ శిక్షణ తీసుకున్న వాడు కాదు గదా కనీసం భాష రాయడం చదవడం కూడా ధారాళంగా నేర్చుకున్న వాడు కాదు. అప్పటికింకా ఉపాధ్యాయ శిక్షణా సంస్థలింకా పూర్తిగా ఏర్పడి ఉండకపోవచ్చు. కాని లెనిన్ నాయకత్వంలోని కమ్యూనిస్టు పార్టీ కష్టజీవులైన సామాన్య ప్రజలు తక్షణమే ప్రాథమిక స్థాయి విద్యావంతులు కావాలె. అట్లయితే తప్ప విప్లవం విజయవంతం కాదు అని భావించి కమ్యూనిస్టు పార్టీ యువకులకు గ్రామాలకు తరలండి చదవడం రాయడం నేర్పండి అని పిలుపు ఇచ్చి యుండవచ్చు. ఆ పిలుపునందుకున్న ద్యుయ్‌షేన్ చిన్ననాడెప్పుడో విడిచిపెట్టిన సొంత గ్రామం కుర్కురేవుకు వెళతాడు.

కమ్యూనిస్టు పార్టీ విభాగం అయిన కోమ్‌సోల్ సభ్యులంతా మార్క్సిస్టు సాధారణ అవగాహన ప్రకారం, నైపుణ్యాలు తర్వాత; మొదట ప్రతి ఒక్కరూ ఉత్పత్తి అభివృద్ధి నిర్మాణ క్రమానికి సంబంధించిన అన్ని పనులతో పాటు సైనిక శిక్షణను నేర్చి ఉండాలనే షరతు ప్రకారం ద్యుయ్‌షేక్ అట్లా సుశితుడూ దృఢకాయుడూ. గ్రామంలో బడి మొదలుపెట్టనీకె ఒక స్థలం, నిర్మాణం లేని దుస్థితికి తోడు ఊరి సామాన్య ప్రజలు, 'ఆ... చదువుకుంటే వచ్చేదేముంది అది వెంటనే కూడు పెట్టేదా గుడ్డనిచ్చేదా, మౌలిక ఉత్పత్తి వృత్తేగద ఎప్పటికప్పుడు అవసరాలను తీర్చగలిగేది అన్న జాడ్యిక స్థితిలో ఉంటరు.

అటువంటి గ్రామ ప్రజలను సమీకరినిచి సమావేశపరిచి కొత్త సోవియట్ ప్రభుత్వం వాళ్ళకు తక్షణమే సమకూర్చిన భూమి, నీటి వనరులను గుర్తు చేసి, ఆ ప్రభుత్వమే; కష్ట జీవుల అభివృద్ధి పట్ల పట్టింపు ఉన్న ఆ ప్రభుత్వమే ప్రజలు విద్యావంతులు కావాలన్న ఆకాంక్షను ఆదేశ రూపంలో విడుదల చేసిన అధికారిక ఉత్తర్వును చూపించి, అతికష్టంగా పూర్తిగా అంగీకరింజేయలేకపోయినా, 'సరే చూద్దాంలే, ఆశ్రమేదో నీవే పడు' అనే తటస్థ స్థాయికి వైఖరికి మళ్ళించగల్గుతాడు.

తమ సహకారం అయితే ఏమీ ఉండదని చెప్పకనే చెప్పిన పెద్దవాళ్ళు అన్నట్లుగానే తమ దారిన తాము వెళ్ళిపోతరు. ద్యుయ్‌షేన్ ఒక్కడే పలుగూపారా అందుకొని ఓ ఖాళీ స్థలంలో బడికి ఓ షెడ్డు / గుడిసె వంటి దాన్ని నిర్మించి తర్వాత పిల్లల సమీకరణకై ఇల్లిల్లూ తిరిగి కష్టంగానే గుప్పెడు మందిని పోగు చేసి బడి ఆరంభిన్నడు. విద్యనందించడానికి మొట్టమొదటి ప్రాథమిక, అవసరాలయిన మెటిరీయల్‌ను ప్రభుత్వం సమకూరుస్తుంది.

అట్లా పోగయిన పిల్లల్లో అల్తినాయ్ సలైమనోవ వయసులో మిగిలిన అందరి కంటే పెద్దది. అందువల్ల సహజంగానే ఉపాధ్యాయుడు తమ చదువు కోసం చేస్తున్న కృషిని పడుతున్న తండ్లాటను గుర్తిస్తుంది. చాలా స్వల్పమే అయినా ఉడతా భక్తి లాగా

చేతనైన సహాయం, సహకారం అందిస్తుంది. చదువు పట్ల మక్కువను పెంచుకుంటుంది. అట్లా ఆమెకు చదువు పట్ల బలమైన మక్కువకు గల మరో కారణం తను, చిన్నమ్మ కూడా అయిన పెంపుడు తల్లికి కూతురు కావడం, అందువల్ల ఆ తల్లి అధిపత్య పోరు, హింసకారణాలై ఉంటవి. ఆ కారణంగా చదువు నేర్చుకోడానికి బడి వద్ద, ఉపాధ్యాయుని వద్ద రోజులో ఎక్కువ కాలం గడిపే ప్రయత్నం చేయడం.

ఎట్లాగూ భూస్వామ్య పురుషాధిక్య వ్యవస్థ. స్త్రీలు తమకు తాముగా బంధువుల స్నేహితుల పరిధిలోని పురుషులకు కట్టుబడి పోవడం, తమ ఆధిపత్యంలోని పిల్లలను కౌమారం ప్రవేశించగానే కట్టుబెట్టడం సహజం కనుక, పెంపుడు తల్లి అత్తినాయ్‌ను కౌమారం ప్రవేశించీ ప్రవేశించని వయసులోనే బంధు వర్గంలోని ఒక యువకుడికి అప్పగించి బరువు దించుకోడానికి, పెళ్ళి చేయడానికి ఉద్యుక్తురాలవుతుంది. బలవంత పెడుతుంది. అత్తినాయ్‌కు వివాహం పట్ల ఉన్న అయిష్టతను, చదువు పట్ల ఉన్న మక్కువనూ పట్టింపునూ గమనించిన ఉపాధ్యాయుడు, ఆమెనెట్లాగయినా వివాహ విపత్తు నుండి తప్పించాలనీ, ఆమెను ఉన్నత విద్యావంతురాలినీ చెయ్యాలనీ, బడి నుంచి దౌర్జన్యంగా తీసిక పోడానికొచ్చిన తల్లిల, సదరు పెళ్ళికొడుకైన యువకుడు అతని సహచర బృందంను అడ్డుకునే క్రమంలో తీవ్రమైన భౌతిక సంఘర్షణకు దిగి తీవ్రంగా గాయపడి తన ప్రయత్నంలో విఫలమవుతాడు. మాస్కో వెళ్ళి ప్రభుత్వ పెద్దలకు పరిస్థితిని వివరించి రెడ్‌గార్డ్ సైనికులను తోడుగా తీసుకొచ్చి, అదివరకే అన్ని విధాల హింస అత్యాచారానికి గురైన బంధించబడిన అత్తినాయ్‌ను ఆ చెరనుండి విడిపించి పట్టణంలోని ఉన్నత గురుకుల విద్యా సంస్థకు పంపుతడు. అట్లా పంపబడ్డ అత్తనాయ్ ఉన్నత విద్యావంతురాలై కార్మిక ఫ్యాకల్టీలో ప్రవేశించినంక ద్యుయ్‌షేన్‌కు ఒక ఉత్తరం, తనతని ప్రేమిస్తున్నాననీ రాసింది. ఎన్నాళ్ళయినా ప్రత్యుత్తరం రాకపోయేసరికి, తన గురువు మౌనానికి; తను ప్రేమ, పెళ్ళిలో పడితే తన అభివృద్ధికి విఘాతం కల్గుతుందనీ భావించి ఉండవచ్చనే అతని అభిప్రాయాన్ని అంచనా వేసి అందులోని ఔచిత్యాన్ని అర్థం చేసుకుంటుంది. తర్వాత ఆవిడ తత్వశాస్త్ర ప్రొఫెసర్ అకడమిషియన్‌గా ఎదిగి పెళ్ళి చెసుకొన్నంక తొలి ఉపాధ్యాయుడు ఆమె హృదయపు అంతరాంతరాల్లో ఒక జ్ఞాపకంగా మాత్రమే మిగిలిపోతడు.

కాలగమన క్రమంలో 1946వ సంవత్సరంలో ఒకానొక సమయంలో ఒక విజ్ఞాన కార్యంపై తోమస్క్ యూనివర్సిటీకి వెళ్ళవలసి రైలు ప్రయాణం చేస్తుండగా, మార్గ మధ్యంలో రైలు ఒకచోట ఒక అవాంతరంతో కాలం ఆగి తిరిగి కదులుతుండగా రైలు పక్కన కనబడిన ఒక మనిషిని ద్యుయ్‌షేన్‌గా భావించి అత్యవసర చైన్ గుంజి ఆపి పరిగెత్తి కెళ్ళి అతని మీద పడిపోతుంది. కానీ తర్వాత అతడు ద్యుయ్‌షేన్ కాదని తను పొరబడ్డానని తెలుసుకొనే సమయానికి తోటి ప్రయాణీకుల రైల్వే అధికార్ల కించిత్ అసహనానికి గురై జరిమానా చెల్లిస్తుంది.

తర్వాత కొంతకాలానికి స్వంత ఊరిలో నూతన భవనంలో పాఠశాలను ప్రారంభించ డానికి ముఖ్య అతిథిగా ఆహ్వానాన్ని అందుకుంటుంది. పని ఒత్తిడిలో ఉన్న ఆమెకు, అదే గ్రామం నుండి విద్యావంతుడై పట్టణంలో స్థిరపడ్డ ఒకతను, తమ గ్రామ ప్రజలు ఆమె ప్రారంభోత్స వానికి రావడం ఎంత మహాభాగ్య మైన విషయంగా భావిస్తున్నారో చెప్పి, ఆమెకు తోడుగా గ్రామానికి పాఠశాల ప్రారంభోత్సవ కార్యక్రమానికి తీసుక వస్తాడు.

ప్రారంభోత్సవ కార్యక్రమం సమావేశం ముగిసినాక, ప్రధానోపా ధ్యాయుని ఇంట్లో ఆతిథ్యం స్వీకరిస్తున్న సమయంలో పోస్టు బంట్రోతు, పూర్వ విద్యార్థులు పంపిన అభినందన టెలిగ్రాంల కట్టనొకటి తెచ్చి ఇస్తాడు. లోపలకు రమ్మన్న ప్రధానోపా ధ్యాయుని పిలుపును కాదని, తనింకా బట్వాడా చేయవలసిన ఉత్తరాలున్నాయని వెళ్ళిపోతున్న వృద్ధుడెవరని ఆరా తీసి అతడు ద్యుయ్‌షేన్ అని, యుద్ధంలో గాయపడి ఆస్పత్రిపాలై ఐదేళ్ళకిందటే తిరిగివచ్చాడని, ఇప్పుడీ పని చేస్తున్నాడనీ, ఏ పని చేసినా అత్యంత నిబద్ధతతో నెరవేర్చే మొండివాడని, విధులు ముగించాకే విశ్రాంతికి ఉపక్రమిస్తాడనీ తెలుసుకొని, అతన్ని కలుసుకోలేకపోయానని బేధ పడుతుంది. మౌనంగా సమీపంలో ఉన్న రెండు పోప్లార్ వృక్షాల వద్దకు నడుస్తుంది. అక్కడ నిలబడి పూర్వ జ్ఞాపకాల్లోనికి వెళుతుంది. అవి తొలి ఉపాధ్యాయుడు దుష్యేక్ ప్రోత్సాహంతో అతని భాగస్వామ్యంలో తాము బాల్యంలో నాటిన మొక్కలు. నాటి పాలనా, పోషణా చూసింది కూడా అతడే. అవిప్పుడు మహా వృక్షాలైన తీరును అవి కల్గజేస్తున్న ప్రాకృతిక సౌందర్యానికి ఉబ్బితబ్బిబ్బవుతూ ఉద్వేగంలో విచారవదనంలో ఉన్న స్థితిని, తోడుగా తోల్కొని వచ్చి వెన్నంటే ఉండిన పట్టణ యువకుడు అడగలేక అడగలేక ఆవిడ స్థితికి గల కారణాన్ని అడుగుతాడు. అప్పుడు వివరించలేక తిరిగి వెళ్ళింతర్వాత పని వత్తిడిలో పడి కొంతకాలానికి అతనికి తన పూర్వ జ్ఞాపకాలను పాఠశాల ప్రారంభోత్సవం రోజున తన బేధానికి గల కారణాన్ని వివరించే కథన ప్రక్రియగా రూపుదిద్దుకున్నదే ఈ నవల.

అద్భుతమైన కాల్పనిక సాహిత్య శృంగారాత్మక వర్ణనలతో కథనాలతో ఘసిన ఈ నవలలోని పాత్రలు కాల్పనికమైనవని అనుకోడానికి వీల్లేదు. ఎందుకంటే కొన్ని దేశాల్లోనయినా స్వల్పకాలమో కొంతకాలమో సుదీర్ఘకాలమో నిలిచి వెలిగిన కమ్యూనిస్టు సోషలిస్టు విప్లవం విజయవంతం కావడానికి ద్యుయ్‌షేన్, అత్తినాయ్ వంటి వాస్తవ మనుషులు లేకుండా సాధ్యమయ్యేది కాదు.

నవలలో ఒకచోట అత్తినాయ్ అకడమిషియన్ తన అంతరంగ సంఘర్షణను రాస్తూ, తనకు ఊరిలో జరిగిన గొప్ప సన్మానం ఆదరణ ఆ ప్రజలకు తన పట్ల ఉన్న ఆరాధనా భావం సోషలిస్టు సాంస్కృతికత ప్రకారం సరియైనవి కావని, విప్లవ ప్రారంభకాలంలో ప్రాథమిక స్థాయి పనిచేసిన నిజమైన కమ్యూనిస్టులను మరిచిపోవడం నిర్లక్ష్యం చేయడం, ఉన్నత స్థాయికెదిగిన వృత్తి నిపుణులను నెత్తికెక్కించుకోడం ఆరాధించడం కమ్యూనిస్టు మానవునికి సరియైన ధోరణులు కావని, లెనిన్ ఆశించిన ఆ కమ్యూనిస్టు మానవులుగా ప్రజలంతా ఎప్పుడు ఎదుగుతారోనని విచారాన్ని వ్యక్తం చేస్తుంది. తనెప్పటికయినా తిరిగ్గా ఊరికి వెళ్ళి ఆ పాఠశాలకు 'ద్యుయ్‌షేన్ పాఠశాల' అనే పేరు పెట్టేలాగ చూడాలనీ అనుకుంటుంది.

సోషలిస్టు సామాజిక నిర్మాణాన్ని చిత్తశుద్ధిగా కోరుకున్న ప్రతి ఒక్కరూ చదవవలసిన నవలల్లో ముందువరుసల్లో ఉంచవలసిన నవల.



# మానవాళి అవసరం అక్టోబర్ సోషలిస్ట్ విప్లవం



బి.ఎస్.రాజు

**1917 మహత్తర అక్టోబర్ బోల్షెవిక్ సోషలిస్ట్ విప్లవానికి 2017 నవంబర్ 7 నాటికి నిండా నూరేళ్లు. ప్రపంచ శ్రామిక జనావళికి ఇదొక తీద్బుతమైన, ఉద్వేగభరితమైన పండుగ. శ్రామిక వర్గం తాము సాధించుకున్న ఘనవిజయాల స్ఫూర్తితో ఆ రోజు ఎంతో ఉత్సాహంగా 100 ఏళ్ళ విప్లవ పండుగను జరుపుకుంటుంది. అలాగే తాము అధిరోహించి, కోల్పోయిన ఉన్నత శిఖరాలను తిరిగి జయిస్తామని ఈ 100 ఏళ్ళ పండుగనాడు ప్రతిన బూనుతుంది. కోల్పోయిన ఎర్ర స్థావరాలను తిరిగి గెలుచుకోవడమేగాక, ఎర్రజెండా అజేయమని నిరూపిస్తామని, ప్రపంచమంతా దాని రెపరెపలను వినిపిస్తామని, దాని వెలుగులను ప్రసరింప చేస్తామని ప్రపంచ శ్రామిక వర్గం సాగర ఘోషై నినదిస్తుంది, మహోఘర్జనై ప్రతిన బూనుతుంది. నేటి మానవాళికి అక్టోబర్ విప్లవ ఆవశ్యకతను ఎలుగెత్తి చాటుతుంది.**

1871 ప్యారిస్ కమ్యూన్ తిరుగుబాటు తర్వాత, రష్యాలో జరిగిన 1917 అక్టోబర్ బోల్షెవిక్ సోషలిస్ట్ విప్లవం ఎందుకు మహత్తరమైనది? ఇప్పుడు ప్రపంచ మానవాళికి దాని అవసరమేమిటి? మరీ ముఖ్యంగా మన దేశంలో శ్రామిక జనావళి అక్టోబర్ విప్లవ అధ్యయనంపై, ఆకళింపుపై ఎందుకు దృష్టి పెట్టాలి?

సోషలిస్టు సమాజ నిర్మాణ ప్రయత్నాలు సర్వత్రా వీగిపోయాక, మరీ ముఖ్యంగా సోవియెట్ యూనియన్ పతనానంతరం, చైనా సాంస్కృతిక విప్లవం కనుమరుగైన తరవాత.. ప్రపంచ శ్రామిక వర్గం, దాని మిత్ర శిబిరం స్తబ్దతకు, గందరగోళానికి గురైన సుదీర్ఘ చరిత్ర ఇంకా కొనసాగుతూ ఉన్నది. శ్రామిక మానవాళి ఈ చారిత్రక వాస్తవంలోనుండి ఇప్పుడిప్పుడే తేరుకుంటున్నది. ఈ కాలం పొడుగునా విప్లవం, సోషలిజం, శ్రామికవర్గ దృక్పథం, శ్రామికవర్గ నియంతృత్వం వగైరా పదాల ఉచ్చారణనే బూతుగా చిత్రించి సోషలిజంపై జుగుప్సాకర ప్రచారాన్ని, బూర్జువా శిబిరం ఎడతెరిపిలేకుండా కొనసాగిస్తున్నది. విప్లవ వాగాడంబరంతో ట్రాట్స్కీ అనుయాయ బృందాలు, సోషలిస్టు శిబిరం నుండి వైదొలగి పెట్టుబడి పాదసేవకు అంకితమైన జట్లు, పెట్టుబడి మోచేతి నీళ్లు తాగి బతికే ఎన్జీవో మూకలు.. అన్ని సామజిక రంగాల్లో, ప్రచార, ప్రసార మాధ్యమాల్లో అల్లుకుపోయి సోషలిజానికి వ్యతిరేకంగా పనిచేస్తున్నాయి. ఈ చీడపీడల బృందాల ఏకైక లక్ష్యం శ్రామిక శ్రేణుల్లో ఎప్పటికప్పుడు వర్గ పోరాట దృక్పథాన్ని నీరుగార్చడం, ఆవిరిచేయడం. శ్రామిక రాసులు పెట్టుబడితో జరపాల్సి ఉన్న మిలిటెంట్ పోరాటాలకు దరిచేరకుండా ముళ్లకంచె వేసి అదుపు చేయడమే పెట్టుబడి వీటికి అప్పచెప్పిన పని. ఆ పనిని అవి విజయవంతంగా నిర్వహిస్తున్నాయి.

అయితే ఇక్కడ ప్రధానంగా ఆలోచించవలసిన విషయమొకటి ఉంది. పెట్టుబడి, సామ్రాజ్య వాదం, ఫ్యూడలిజం, మతోన్మాదం ఒక్కటై.. సోషలిజంపై పరమ దుర్మార్గంగా, క్రూరంగా చేస్తున్న విషప్రచారాన్ని, దాడులను తిప్పికొట్టడంలో మన దేశంలోని సోషలిస్టు నిబద్ధతగల శక్తుల అనైక్యత, అశక్తత, బలహీనతల మూలంగా ధీటుగా ఎదుర్కోలేక పోతున్నాయి. సోషలిజపు గత చరిత్రను, అది సాధించిన విజయాలను, కొత్త తరాలకు, ముఖ్యంగా నూతన శ్రామిక శ్రేణులకు యువతకు అందించి, వారితో మమేకమై ప్రచారంచేసి నూతనోత్తేజాన్ని నింపడంలో వైఫల్యం చెందాయనడం అవాస్తవేమీ కాదు.

సోవియెట్ రష్యాలో జరిగిన అక్టోబర్ సోషలిస్టు విప్లవం, సోషలిస్టు సమాజ నిర్మాణం, చైనా విముక్తి విప్లవం, వియత్నాం-ఇండో చైనా పోరాటాలు, క్యూబా-లాటిన్ అమెరికా సైనిక నియంతృత్వ వ్యతిరేక పోరాటాలు, సోషలిస్టు నిర్మాణంలో జనచైనా అనుభవాలు, తదనంతర చైనా శ్రామిక సాంస్కృతిక విప్లవం, భారతదేశంలో నక్సల్బరీ విప్లవం.. వీటి చరిత్రను యువతకు, కార్మికులకు, శ్రామిక ప్రజారాశులకు చేరవేయడంలో కూడా మన శక్తి బలహీనంగానే ఉండిపోయింది. మొత్తానికి సమసమాజ నిర్మాణ ధ్యేయంతో ప్రపంచం నలుమూలలా ఉవ్వెత్తున ఎగసిన శ్రామిక వర్గ విప్లవ పోరాటాలు, జాతీయ విముక్తి పోరాటాలు, అమెరికా యూరోప్ దేశాల్లో కార్మిక వర్గ పోరాటాలు, విప్లవ విద్యార్థి ఉద్యమాలు, అవి సాధించిన ఘనవిజయాలు, వాటి వైఫల్యాల వెనుక దాగిఉన్న దగాకోరు తిరోగమన కుట్రపూరిత రాజకీయాలను శాస్త్రీయంగా విశ్లేషించి ప్రజలకు అందించడంలో కూడా మనకు ఒక నిర్దుష్ట ప్రణాళిక కరువయ్యింది.

ప్రపంచ శ్రామిక శ్రేణులు కోల్పోయిన సోషలిస్టు విప్లవ స్థావరాలు, వీటి పర్యవసానంగా యావత్ ప్రపంచ శ్రామికవర్గం పెట్టుబడి, సామ్రాజ్యవాదం ముందు తలదించుకు వాటి బానిసగా పనిచేయాల్సి వచ్చిన దుస్థితి.. వీటన్నిటినీ మన దేశ శ్రామిక ప్రజలకు విశదపరచి, ప్రణాళికాబద్ధంగా పనిచేయడంలో వెనకబడి పోవడం మూలంగా, విప్లవ వెల్లువగా శ్రామిక ప్రజలు పాల్గొని సొంతం చేసుకోవడంలేదు. వందేళ్ల అక్టోబర్ సోషలిస్టు విప్లవం, ఏభై ఏళ్ల శ్రామిక సాంస్కృతిక విప్లవం, 50 ఏళ్ళ నక్సల్బరీ ఉద్యమ సందర్భంలో నైనా పెద్దఎత్తున ఈ బృహత్ కార్యక్రమాన్ని మన శక్తులు చేపట్టడం భారతదేశ శ్రామిక విముక్తి

విప్లవానికేగాక, ప్రపంచ సోషలిస్టు విప్లవానికి అత్యంత అవసరం.

ఈ నాటి పెట్టుబడిదారీ ప్రపంచం అపార సాంకేతిక విజ్ఞానంతో సరుకుల ఉత్పత్తిని, ఉత్పత్తితో పాటు శ్రమదోపిడీని, సరుకుల పంపిణీని విశ్వీకరణ గావించింది. పెట్టుబడి విశ్వరూపం వివిధ దేశాల మధ్య, వివిధ జాతుల మధ్య, వివిధ సమూహాల మధ్య ఆర్థిక సామాజిక వ్యత్యాసాలను విపరీతంగా పెంచింది. విశ్వపెట్టుబడి, గుప్పెడు మంది అపర-కుబేరులను, పర్వత కార్పొరేట్ కంపెనీలను, స్థానిక దేశీయ సామంత కార్పొరేట్ ముఠాలను తయారుచేసి పెట్టుకుంది.శ్రామి కులను తన పెట్టుబడికి, సరుకులకు బానిస వనరుగా మార్చుకుంది. సంపదను సృష్టించే వారిని వేతన బానిసలుగా, బానిస కూలీలుగా తనకు వంతపాడుతూ తన కనుసన్నల్లో మెలిగే మధ్య తరగతిని తన వ్యవస్థకు ఒక రక్షక వలయంగా వాడుకుంటున్నది. శ్రమను దోపిడీ చేసే వారిని సంపదకు అధిపతులుగాను, బూటకపు ప్రజాస్వామ్య బేహారులుగాను, రాజ్యాధికారులుగా ప్రతిష్ఠించింది.

ఈ స్థితిని, ఈ వ్యవస్థను తల్లకిందులు చెయ్యకుండా మానవ సమాజాన్ని పట్టి పీడిస్తున్న రుగ్మత లేమీ అంతంకావు. యుద్ధ మారణకాండ, మానవ హననం, ఫాసిజం, మత, జాత్యహంకారాలు, దోపిడీ-పీడన-అణచివేత, అరాచక ఉత్పత్తి-వాణిజ్య వ్యవస్థ, నిరుద్యోగం, పర్యావరణ విచ్ఛిత్తి.. వంటి సామాజిక జాడ్యాలు మరింత పెరుగుతాయే తప్ప అంతరించిపోవు. ఇటువంటి పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద విచ్ఛిన్నకర కరాళ నృత్య రూపం ఇప్పుడు మరింత నగ్నంగా మన కళ్ళముందు కనిపిస్తున్నది.

ప్రజాస్వామ్యం పేరు మీద ప్రజలకు సంబంధంలేని, ప్రజల సలహా సంప్రదింపులు లేని, ఓట్లకు తప్ప ఇక వేరే ఏ అంశంలోనూ అసల ప్రజల ఊసే ఉండని దళారీ వ్యవస్థ మనదేశంలో పాతుకు పోయి ఉంది. పనులు, పంపకాలు, వనరుల దోపిడీ అన్నీ ప్రజల పేరుమీద, ప్రజాస్వామ్యం ముసుగులో జరిగిపోతుంటాయి. ప్రజలకు చెందిన వనరులన్నీ పెట్టుబడి పాదాక్రాంతం చెయ్యడమే రాజ్యవ్యవస్థ అన్ని అంగాలు చేసే పని. ఇవి పెట్టుబడి కేంద్రీకరణ అనే యజ్ఞంలో భాగమైపోతాయి. బూటకపు ఓట్ల రాజకీయంలో, బూర్జువా పార్లమెంటరీ ప్రహసనంలో ప్రజలు, ప్రజాస్వామ్యం కేవలం ఓ సైన్ బోర్డుగా మాత్రమే మిగిలిఉంటుంది.

రష్యా బోల్షెవిక్ విప్లవం 1917లో ఇటువంటి దుర్మార్గపు దోపిడీ వ్యవస్థనే కూల్చివేసింది. అప్పటి రష్యా సామాజిక వ్యవస్థ ఇప్పటి మన దేశ సామాజిక వ్యవస్థ ఒక్కటి కాదు. అయినప్పటికీ దోపిడీ, పీడన రూపాల్లో మన ప్రస్తుత భారతీయ సమాజం మేడిపండు చందం, కూల్చబడడానికి తప్ప ఇంకెందుకూ కొరగాని ఈ వ్యవస్థ అలనాటి జారు చక్రవర్తి పాలనలో రష్యన్ సమాజానికన్నా హీనమైనది. అందుచేత ఈ వ్యవస్థను భారత శ్రామిక వర్గం కూల్చి వేసి విముక్తి సాధించాల్సిందే తప్ప వేరే మార్గమేమీ లేదు. అందుకై మనం అక్టోబర్ సోషలిస్టు విప్లవాన్ని, అది మానవాళికి అందించిన ఘనా విజయాలను కూలంకషంగా తెలుసుకోవాలి. సోషలిస్టు నిర్మాణంలో అది అధిరోహించిన శిఖరాలను, అది అనుసరించిన మార్గాన్ని అధ్యయనం చెయ్యాలి. ఆ బోల్షెవిక్ స్పిరిట్, చైతన్యాన్ని ఆవాహన చేసుకోవాలి. అంతేగాక ఏ ఏ కారణాల వలన అది దగాచేయబడి విచ్ఛిత్తికి గురిచేయబడిందో శాస్త్రీయంగా ఒంటబట్టించు కోవాలి. మహత్తర అక్టోబర్ బోల్షెవిక్ సోషలిస్టు విప్లవం గురించి కొంత ప్రాథమిక సమాచారాన్ని ఈ వ్యాసం ద్వారా తెలుసుకునే ప్రయత్నం చేద్దాం!

### ప్యారిస్ కమ్యూన్ ప్రస్తావన:

70 రోజులపాటే ఐనా ప్రపంచంలో మొదటిసారి శ్రామిక రాజ్యం రూపు రేఖలు ఎలా ఉంటాయో మానవాళికి చవిచూపించింది ప్యారిస్ కమ్యూన్ తిరుగుబాటు. చక్ర వర్తులు, ఫ్యూడల్ ప్రభువులు, బూర్జువా పాలకులు, వారి అధికారగణాలు లేని శ్రామిక కమ్యూన్ పాలనా వ్యవస్థ ఎలా ఉంటుందో, ఒక చారిత్రక నమూనాను ప్రపంచ శ్రామిక ప్రజలకు అందించింది ప్యారిస్ కమ్యూన్. ప్యారిస్ కమ్యూన్ ఓటమి, వైఫల్యాలు, నష్టాలనుండి నేర్చుకున్న గుణపాఠాలు: 1. శ్రామిక వర్గానికి సొంత రాజకీయ పార్టీ లేకపోవడం, 2. ట్రేడ్ యూనియన్ ఉద్యమం శైశవ దశలోనే ఉండడం, 3. కమ్యూన్ ఉద్య మ నాయకుల అనుభవ రాహిత్యంతో చేసిన తీవ్ర తప్పిదాలు, 4. శత్రువు పట్ల కమ్యూన్ నాయకత్వపు మెతక వైఖరి, దాక్షిణ్యతను ప్రదర్శించడం, 5. కార్మికుల-శ్రామిక రైతుల మధ్య మైత్రిని నెలకొల్పలేక పోవడం, 6. అన్నిటి కన్నా మిన్నగా ప్యారిస్ నగరాన్ని చుట్టుముట్టిన శత్రు సైన్యాన్ని సాయుధ చర్యలతో ఎదుర్కోవడంలో తలమునకలై ఉండిపోవడం 7. సాయుధ పెనుగులాటకు సమాంతరంగా సోషలిస్టు నిర్మాణానికి సమయావకాశాలు లేకపోవడం అనే ముఖ్యకారణాల వల్ల కమ్యూన్ ఓటమి పాలైయ్యింది. అయితే, ఈ ఓటమి ప్రపంచశ్రామిక క్షేత్రంలో సోషలిస్టు విప్లవ బీజాలను నాటింది.

### బోల్షెవిక్ సోషలిస్ట్ విప్లవం:

ప్యారిస్ కమ్యూన్ కేవలం మొట్టమొదటి శ్రామికవర్గ నియంతృత్వ ఘటనే కాదు, అది అందించిన 'కమ్యూన్' రాజకీయ తాత్విక భావన ముందుగా 1905లోను, తరవాత 1917లోను రష్యాలో ఉద్భవించిన 'సోవియెట్స్', 'సోవియెట్ వర్కర్స్ డిప్యూటీస్' కు నమూనా. ప్యారిస్ కమ్యూన్ ఓటమి గతి తార్కిక చారిత్రక దృష్టితో చూస్తే ఓటమి కాదు, ప్రపంచ శ్రామిక విప్లవోద్యమంలో ఓ గొప్ప ముందడుగు. ప్రపంచ కమ్యూనిస్ట్ సమాజ నిర్మాణానికి 'కమ్యూన్' భావన తొలి అంగైతే, 'సోవియట్స్' భావన మలి పెద్ద అంగ. ప్యారిస్ కమ్యూన్ కొనసాగింపే రష్యాలో జరిగిన బోల్షెవిక్ సోషలిస్టు విప్లవం. రష్యాలో మొలకెత్తిన 1917 అక్టోబర్ బోల్షెవిక్ సోషలిస్టు విప్లవం వృక్షమై విస్తరించింది.

పైన చెప్పుకున్న ప్యారిస్ కమ్యూన్ గుణపాఠాలనుండి సారాన్ని గ్రహించి, మార్క్స్-ఎంగెల్స్ లు అందించిన సైద్ధాంతిక స్ఫూర్తితో 'లెనిన్' విప్లవపార్టీ నిర్మాణ ఆవశ్యకతను గుర్తించి, దాన్నివెత్తి పట్టాడు, దాని రాజకీయ సిద్ధాంతాన్ని రచించాడు. విప్లవ ఆచరణలో దాని బహుముఖీన పాత్రను స్పష్ట పరిచాడు. అలా ఉద్భవించినదే రష్యా బోల్షెవిక్ కమ్యూనిస్ట్ పార్టీ. విప్లవ సిద్ధాంతం, అంతర్గత ప్రజాస్వామ్యం, క్రమశిక్షణ, శ్రామిక ప్రజారాశులతో మమేకత అనే ముఖ్య అంశాల పునాదిపై బోల్షెవిక్ పార్టీ నెలకొల్పబడింది.

విప్లవకర అగ్రగామి (వాన్గార్డ్) పార్టీ అంటే ఏమిటో, విప్లవం విజయవంతమవ్వాలంటే అటువంటి పార్టీ సమాజంలో ఉన్న బహుళత్వాన్ని, విభిన్న సమాజపు పొరలను ఎలా కలుపుకు రావాలో, కేంద్రీకృత అంతర్గత ప్రజాస్వామ్యం, ఉక్కు క్రమశిక్షణ, రహస్య-బహిరంగ పనివిధాల మేళ వింపు.. ఇలా ఎన్నో అంశాలపై లెనిన్, స్టాలిన్‌లు విప్లవోద్యమ అనుభవసారంతో రచించి అందించిన రాజకీయ డాక్యుమెంట్స్ లోతుగా అధ్యయనం చేసి ఆకళింపు చేసుకోవలసిందే. ఈ వ్యాసం ఆ వివరాల్లోనికి వెళ్ళకుండా, '1917 మహత్తర అక్టోబర్ విప్లవం' మానవాళికి సాధించి పెట్టిన అద్భుత విజయాలను మట్టుకే వివరిస్తుంది. ఈ వ్యాసం పరిధి ఇంతవరకే.

### రష్యాలో నూతన అరుణోదయం:

నవంబర్ 7, 1917 ప్రపంచ శ్రామిక మానవాళి విప్లవ వికాస చరిత్రలో ఓ నూతన అరుణోదయం. జారు చక్రవర్తి రాజ్యంలో, దోపిడీ పదఘట్టనలో నుజ్జు నుజ్జయి దీనంగా, హీనంగా బతుకులీడుస్తున్న రష్యన్ కార్మికులు,

గ్రామీణ పేదరైతాంగం, మైనార్టీ జాతులు విముక్తి రుతుపవనాల తొలకరి జల్లులు మనసారా ఆస్వాదించిన రోజు.. నవంబర్ 7, 1917(అక్టోబర్ 25, 1917). 'ప్రపంచ శ్రామికులారా! ఐక్యం కండి! బానిస సంకెళ్లుతప్ప పోయేదేమీ లేదని' కమ్యూనిస్ట్ ప్రణాళిక అందించిన పిలుపుతో రష్యన్ గడ్డపై ఉదయించిన అరుణోదయం రష్యన్ శ్రామిక జనావాళికే గాక, యావత్ ప్రపంచ శ్రామిక వర్గం.. అన్ని దేశాల ఫ్యూడల్ ప్రభువులపై, బూర్జువాలపై, పెట్టు బడి ఆధిపత్యంపై యుద్ధభేరి మోగించడానికి అందివచ్చిన కొత్త విస్ఫోటనా ఆయుధం. ప్రపంచంలోని యావత్ గ్రామీణ రైతాంగానికి చరిత్ర ప్రసాదించిన విప్లవ విముక్తి మార్గం.

1917 నవంబర్, 7న (అక్టోబర్ 25, 1917) అప్పటి బూర్జువా పీఠమైన జారు చక్రవర్తి శీతాకాల భవంతిని చుట్టుముట్టిన విప్లవకారులు, ఆరోరా నౌక నుండి బోల్షెవిక్ సైన్యం ఎడతెరిపి లేకుండా కురిపించిన మరతుపాకీల గుళ్లవర్షంతో జారుచక్రవర్తి, రష్యన్ బూర్జువాల ద్వంద్వపాలన ముగిసి పోయింది. దోపిడీ పీడకుల జెండాల స్థానంలో, శ్రామిక విముక్తి చిహ్నాలై న ఎర్రజెండాలు రష్యా విప్లవకాశంలో అరుణారుణ వెలుగులతో గర్వంగా రెపరెపలాడాయి. బోల్షెవిక్ కమ్యూనిస్ట్ పార్టీ ఆధ్వర్యంలో మహత్తర అక్టోబర్ సోషలిస్టు శ్రామిక రాజ్యం అవతరించింది. రష్యన్ ప్రజా సోవియట్ల రాజ్యాధికారం ప్రభవించింది.

1917 బోల్షెవిక్ విప్లవం ఆస్తి సంబంధాలను తలకిందులు చేసింది. చరిత్రలో మొట్టమొదటి సారిగా శ్రామిక వర్గ కమ్యూనిస్ట్ పార్టీ నాయకత్వంలో కార్మికుల తిరుగుబాటుతో శ్రామికవర్గం రాజ్యాధికారాన్ని సాధించింది. ఈ విజయం సోవియెట్ యూనియన్ ఆవిర్భావానికి నాంది పలి కింది. దానితో పాటు సోషలిస్టు నిర్మాణ కార్యక్రమానికి పునాదులు వేసింది. ప్రపంచ శ్రామిక రాసులకిది ఓ శుభోదయం, ఓ మరువలేని ముందడుగు. ఈ విప్లవం కొంగొత్త మార్పులను కూడా తనతో పాటు మోసుకొచ్చింది. రష్యన్ సమాజాన్ని విప్లవాత్మక పునర్నిర్మాణానికి పురిగొల్పింది. వ్యవసాయం, పరిశ్రమలు, విద్య, విజ్ఞానం, వైద్యం, ఆరోగ్యం, స్వావలంబన, జాతుల విముక్తి.. ఇలా సకల రంగాలను శ్రామిక జన ప్రయోజనకారిగా మార్చివేసింది. అతివేగంగా స్థాపించింది. గ్రామాల్లో వడ్డీ వ్యాపారాన్ని రద్దుచేసి సహకార వ్యవసాయాన్ని ప్రోత్సహిస్తూ, సంఘటిత పరుస్తూ ముందుకు సాగింది. బృహత్ ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను స్థాపించింది. 'మెన్ అండ్ ప్లాన్' అంటే 'మనిషి - ప్రణాళిక' అనే తాత్వికతను ప్రవేశ పెట్టింది. మొట్ట మొదటిగా ప్రపంచంలో ప్రజల భాగస్వామ్యంతో ప్రణాళికా బద్ధమైన అభివృద్ధిని, పంచవర్ష ప్రణాలికను ప్రవేశ పెట్టింది. అప్పటికి, ఇప్పటికి ఏ దేశంలోనూ సాధ్యపడని ఆర్థిక ప్రగతిని సాధించింది. కూటికి గతిలేని వారిని గొప్ప కమ్యూనిస్టులుగా, మహోన్నత మానవులుగా తీర్చిదిద్దింది. ఆర్థిక రంగ నిర్మాణాలకు సమాంతరంగా ఓ ఆధునిక ప్రజా ఆరోగ్య వ్యవస్థను నిర్మించింది. 'క్రాడిల్ టు గ్రేవ్' అంటే 'ఊయల నుండి కాటి' వరకు శ్రామికులకు విద్య, వైద్య, ఉపాధి, నివాస సౌకర్యాలను 'న భూతో న భవిష్యత్' అన్న చందంగా దేదీప్యమానంగా అందించింది. గడప గడపకు వెళ్లి ఉచిత వైద్యం అందించింది. పీలికల-చీలికల దుర్భర వ్యవసాయాన్ని పారిశ్రామిక వ్యవసాయంగా మార్చి అద్భుత విజయాలు సాధించింది. విప్లవ విజయపు మలిరోజే ప్రపంచంలో ఈ నాటికీ కానరాని 'మాతా - శిశు సంరక్షణ సంస్థ' ను స్థాపించి మహిళలకు, పిల్ల లకు ఎనలేని సేవలందించింది. పుట్టిన ప్రతి బిడ్డను పుట్టక నుండి చావుదాకా తన భుజస్కందాలమీద మోసిన సమాజం ఒక్క సోవియెట్ శ్రామిక సమాజమే అంటే అతిశయోక్తి కాదు. శ్రామిక సోవియెట్ వ్యవస్థ సృష్టించిన అద్భుతాలను ఇలా చెప్పుకుంటూ వెళ్లాలంటే ఎన్ని పేజీలు చాలవు.

కొత్తగా ప్రభవించిన ఈ విప్లవ శిశువును గొంతు పిసికి అంతమొదించాలని రష్యాలో అతర్గతంగా అధికారం కోల్పోయిన బూర్జువా, రాచరికపు శక్తులు బయటనుండి వారికి వత్తాసుగా నిలబడ్డ సామ్రాజ్యవాద దేశాలు ఒక్కటై మోహరించాయి. 1917 నుండి 1922 వరకు అంతర్యుద్ధాన్ని, బయటనుండి రష్యాను చుట్టుముట్టిన 14 యూరోపియన్ సామ్రాజ్యవాద దేశాలను ఎదుర్కొని నిలబడింది రష్యా శ్రామిక వర్గం, దాన్ని నడిపించిన రష్యా బోల్షివిక్ కమ్యూనిస్ట్ పార్టీ. 1922లో సోవియెట్ యూనియన్ రూపొందకముందే, 1918 లోనే రష్యా అక్టోబర్ విప్లవం తొలి రాజ్యాంగం అమలులోకి వచ్చింది. దీన్నే రష్యన్ సోషలిస్టు ప్రజా ప్రతినిధి బృందాల సమాఖ్య (రష్యన్ సోషలిస్టు ఫెడరేటెడ్ సోవియెట్ రిపబ్లిక్- ఆర్.ఎస్.ఎఫ్.ఎస్.ఆర్) రాజ్యాంగం అని పిలుస్తారు. ఈ రాజ్యాంగంలో కేవలం ఆరు(6)ఆర్టికిల్స్ మాత్రమే ఉన్నాయి. ఈ ఆరు ఆర్టికల్స్‌లో ఆరవది ప్రభుత్వ జండా, మిలటరీ గుర్తులు గురించి చెపుతుంది. ఇది పోను మిగతా రాజ్యాం గమంతా ఐదు ఆర్టికిల్స్‌లోనే పొందుపర్చారు. ఇంత సరళమైన, సులభతరమైన, విప్లవకర ప్రజాస్వామిక రాజ్యాంగం, బహుశా ప్రపంచ చరిత్రలోనే మరొకటి ఉండదని చెప్పవచ్చు. తదనంతరం దీనికి కాలానుగుణంగా మార్పులు, చేర్పులు చాలానే వచ్చి చేరినా, దాని ఎసెన్స్, బోల్షెవిక్ స్పిరిట్ 1953 వరకు మారలేదు. రష్యా తొలి-రాజ్యాంగంలోని మొదటి ఆర్టికిల్ పేరు: పీడిత, శ్రామిక ప్రజల హక్కుల ప్రకటన.

ఇందులో: మొదటి పాయింట్: రష్యా రిపబ్లిక్.. శ్రామిక, సైనిక, రైతాంగ ప్రతినిధి బృందాల సమాఖ్యగా (సోవియెట్స్‌గా) ప్రకటించడమైనది. ప్రాంత, కేంద్ర రాజ్యాధికారం ఈ బృందాల సమాఖ్యకు (సోవియెట్స్‌కు) చెంది ఉంటుంది.

రెండవ పాయింట్: రష్యాలోని స్వతంత్ర జాతులు పూర్తి స్వేచ్ఛా స్వతంత్రాలతో, స్వచ్ఛందంగా ఏర్పడ్డ జాతీయ బృందాల సమాఖ్యగా రష్యా రిపబ్లిక్ నిర్మాణమైనది.

మూడవ పాయింట్ : మనుషులను మనుషులు దోచుకునే వ్యవస్థను రద్దుచేసే ఉద్దేశ్యంతోనూ, సమాజం వర్గాలుగా విడిపోయిఉన్న స్థితిని రద్దుచేయడానికి, దోపిడీదారులను అణచివేయడానికి, సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికి, సోషలిజాన్ని అన్ని భూభాగాల్లో విజయవంతం చేయడానికి.. వీటికి సంబంధించిన పునాది ప్రధానమైన సమస్యను మనసునపెట్టుకుని మూడవ సోవియెట్ కాంగ్రెస్ ఇలా నిర్ణయించింది:

అ: భూమిని సామాజికీకరణ చేయడానికి అనువుగా, వ్యక్తిగత ఆస్తి రూపంలో ఉన్న యావత్ భూమిపై వ్యక్తి యాజమాన్యాన్ని రద్దు చేయడమైనది. మొత్తం భూమిని జాతి ఆస్తిగా ప్రకటిస్తూ, ఈ భూమిని ఇప్పటివరకు అనుభవిస్తున్న వ్యక్తులకు ఎటువంటి నష్ట పరిహారం ఇవ్వకుండా, భూమిని దున్నే రైతాంగానికి.. వారి వారి దున్నగల్గె స్తోమతను బట్టి నిర్ణయించి పునః పంపకం చేయబడుతుంది.

ఆ: అడవులు, అరణ్యాలు, యావత్ భూసంపద, ప్రజా ఉపయోగార్థపు నీరు, నదీనదాలు, సచేతన, అచేతన యంత్ర సంపద, ఖార్ఖానాలు, సకల వ్యవసాయ క్షేత్రాలు.. ఇవన్నీ జాతి ఆస్తిగా ప్రకటిస్తున్నాం.

ఇ: దోపిడీదారులపై శ్రామికుల అధికారాన్ని కొనసాగించడానికి.. ఉత్పత్తి సాధనలైన ఫ్యాక్టరీలు, మిల్లులు, గనులు, రైల్వేలు, ఇత్యాది ఉత్పత్తి, ప్రయాణ, రవాణా సాధనాలన్నిటిపై యాజమాన్యాన్ని సోవియెట్ రిపబ్లిక్‌కు సంపూర్ణంగా దఖలు పర్చేందుకు, వాటిని కార్మికుల అదుపులో ఉంచడానికి, వీటి నిర్వహణకు 'జాతీయ ఆర్థిక ఉన్నతస్థాయి సోవియెట్ సంస్థను శాసనబద్ధంగా ఏర్పాటు చేయడానికి నిర్ణయించడమైనది.

ఈ: జారు ప్రభుత్వం, రష్యన్ భూస్వాములు, బూర్జువాలు చేసిన విదేశీ అప్పుల విషయంలో అంతర్జాతీయ బ్యాంకింగ్, ఫైనాన్స్ సంస్థలతో ఎలా వ్యవహరించాలో అనే విధానంపై 'రష్యా సోవియట్ల మూడవ కాంగ్రెస్' ఓ విధివిధాన సోవియెట్ డిక్రీని తీసుకురావడానికై చర్చల్లో నిమగ్నమై ఉంది.పెట్టుబడి దోపిడీ, అణచివేతలపై ప్రపంచ శ్రామికులు తిరుగుబాటు చేసి విజయం సాధించేవరకు సోవియెట్ ప్రభుత్వం కొత్త సోవియెట్ డిక్రీ ఏమి చెబుతుందో అదే చేస్తుంది.

ఉ: బ్యాంకులన్నిటినీ శ్రామిక-రైతాంగ ప్రభుత్వ ఆధీనంలో ఉంచడం ద్వారా, పెట్టుబడి చట్రం నుండి శ్రామిక రాశులను విముక్తి గావించడంలో ఓ ప్రధాన నిర్ణయంగా దీన్ని ధృవీకరిస్తున్నాం.

ఊ: సమాజంలో పరాన్నభుక్కు పౌరను నిర్మూలించే ఉద్దేశ్యంతోనూ, దేశ ఆర్థిక వ్యవస్థను సజావుగా నడిపించడానికి, ప్రజలందరూ తప్పక పనిచేయడమన్నది ప్రతిపౌరుని విధి అని ప్రకటిస్తున్నాం.

ఎ: శ్రామిక వర్గపు సంపూర్ణాధికారాన్ని స్థిరీకరించడానికి, ఏ విధంగానూ దోపిడీదారులు తిరిగి అధికారం హస్తగతం చేసుకోకుండాను, శ్రామికులంతా సాయుధులై ఉండాలని, సోషలిస్టు ఎర్ర సైన్యాన్ని నిర్మించాలని, ఆస్తిపర వర్గాన్ని నిరాయుధులను చెయ్యాలని నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నాం.

ఏ: రాజ్యాధికారం శ్రామిక ప్రజలకు, వారి అనుమతిపొందిన 'కార్మిక-సైన్య-రైతాంగ' సోవియెట్స్ యొక్క డిప్యూటీలకు, ప్రతినిధులకు మాత్రమే చెందాలని, ఇప్పుడు దోపిడీదారుల శ్రామికుల మధ్య కొనసాగుతున్న అంతిమ పోరాటంలో, దోపిడీదారులకు సోవియెట్ ప్రభుత్వంలో ఎటువం టి అధికార స్థానాలు ఉండరాదని, ఈ మూడవ సకల రష్యా సోవియెట్ల డిప్యూటీల కాంగ్రెస్ బలంగా నమ్ముతున్నది.

ఇలా సాగుతుంది మొట్టమొదటి సోవియెట్ సోషలిస్టు రాజ్యాంగం. ఆ రాజ్యాంగాన్ని మొత్తంగా ఈ వ్యాసంలోనికి ఎక్కించడం అనుచితం కాదు. అయితే, ఈ రాజ్యాంగాన్ని చదవితే గాని అప్పటి కార్మికవర్గ విప్లవ మూలఉద్దేశ్యాలు, కాలానుగతంగా అంతర్గత చీడ-పీడలకు గురై అవి ఎలా పలచబడి, నీరసించి, గాలికి వదిలివేయబడ్డాయో తత్ కారణంగా కార్మిక వర్గంపై పెట్టుబడి తిరిగి ఎలా అధికారాన్ని చేజిక్కించుకో గల్గిందో.. అనే చరిత్ర అర్థం కాదు. మహత్తర అక్టోబర్ సోషలిస్టు విప్లవం వైద్యరంగంలో సాధించిన ఘనవిజయాలలో కొన్నిటిని మననం చేసుకుందాం.

సోవియెట్ ఎర్ర వైద్యం:

ఇదేమిటి? వైద్యం ఎర్రగా ఉంటుందా? వైద్యానికి రంగుంటుందా? ఉండదా మరి? ఉంటుంది. వైద్యానికి రంగు తప్పక ఉంటుంది. నల్ల వైద్యం, తెల్ల వైద్యం, ఎర్ర వైద్యం ఉంటాయి. దోపిడీ పద్ధతుల పునాదులపై వెలసిన సమాజాల్లో వైద్యం, నలుపు తెలుపుల వైద్యం. దోపిడీ రహిత సమాజాల్లో అమలయ్యే ప్రజా వైద్యం, ఎర్ర వైద్యం. మహత్తర అక్టోబర్ సోషలిస్టు విప్లవం తొట్టతొలి నాళ్ళలోనే సోవియెట్ రష్యాలో ఎర్రవైద్యం మొదలైంది. ఈ మాట సోవియెట్ ప్రజలు, సోవియెట్ ప్రభుత్వమూ సృష్టించింది కాదు. అమెరికా బ్రిటన్ దేశాలనుండి ఇద్దరు వైద్య, ప్రజా ఆరోగ్యరంగ ప్రముఖులు సర్ ఆర్థర్ న్యూషోమ్(బ్రిటన్ దేశస్థుడు), జాన్ ఏడంస్ కింగ్స్బరీ(అమెరికన్) సోవియెట్ రష్యాలో అమలౌతున్న 'ప్రజా ఆరోగ్య' వ్యవస్థ గురించి విని, ఆ వైద్య ప్రక్రియను వ్యక్తిగతంగా వీక్షించి, గ్రంథస్తం చేసే ఉద్దేశ్యంతో సోవియెట్ రష్యా నలుచెరుగులా 15000 కిలోమీటర్లు పర్యటించారు. వారి పర్యటన ప్రత్యక్ష అనుభవాలను గ్రంథస్థంచేసి దానికి 'ఎర్ర వైద్యం: సోవియెట్ సాంఘిక ఆరోగ్యం' అని నామకరణం చేశారు. రెండు బడా-పెట్టుబడిదారీ దేశాలకు చెందిన ఈ ఇరువురి వైద్యులకు తెలిసివచ్చింది, వాళ్ళు సోవియెట్ రష్యాలో చూసిన వైద్యం, తమ సొంత దేశాల్లోవలే తెల్ల-వైద్యం కాదని, అది శ్రామిక ఎర్ర-ప్రజావైద్యమని. అందుకే వారు తమ గ్రంథానికి సోవియెట్ ఎర్ర వైద్యం అనే పేరుపెట్టారు. ఏమిటి వారు గమనించిన సోవియెట్ ఎర్ర వైద్య అద్భుతాలు?

1.ఇంటి తలుపు తట్టే వైద్యం, 2: వీధి-వాడ వైద్యం, 3: పని స్థల వైద్యం, 4: విహార స్థల, శానిటోరియా వైద్యం, 5: విద్యాలయ వైద్యం, 6: మాత-శిశు సంరక్షణా వైద్యం, 7: పిల్లల ఊయల కేంద్రాల వైద్యం 8. గ్రామసీమల-వ్యవసాయ క్షేత్ర వైద్యం, 8: సంచార జాతులకై సంచార వైద్యం, 9: వెనుకబడిన జాతులకై ప్రత్యేక వైద్యం.. పెద, గొప్ప తేడా లేని వైద్యం. ఇలా పలు రకాలుగా విప్లవానంతర తొలి నాళ్ళనుండే సోవియెట్ వైద్యసేవలు ప్రజలకు వెదికి వెదికి అందించారని ప్రజా అవసరాలకు అనుగుణంగా, వీధి డిస్పెన్సరీల నుండి అత్యంత ఆధునిక వైద్యాలయాల వరకు త్వరిత గతిని నిర్మించారని, ఇంకా నిర్మిస్తున్నారని ప్రజాసేవా తత్పరతతో వైద్యులు ఈ ఆసుపత్రుల్లో రోగులకు నాణ్యమైన సేవలందిస్తున్నారని వైద్యుల, వైద్య సేవల కార్యకర్తల సంఖ్యను పెంచడానికి వైద్య కళాశాలలు, వైద్య శిక్షణా కేంద్రాలు ప్రణాళికాబద్ధమైన ముందుచూపుతో ఎప్పటి కప్పుడు ఆసుపత్రి పడకల, వైద్యుల కొరత లేకుండా సమకూరుస్తు న్నారని, వీటికి మించి ప్రజలు అనారోగ్యం బారినపడకుండా మేలైన ముందస్తు నివారణా వైద్యం, పారిశుద్ధతల విషయంలో సోవియెట్ ప్రభుత్వపు దృక్పథం జనరంజకంగా ఉందని వారు శ్లాఘించారు. అంతేగాక, అసలు-సిసలు ఖర్చులేని వైద్యమన్నది ఈ సోవియెట్ సోషలిస్టు వ్యవస్థకే సాధ్యమని వారు సోవియెట్ ప్రభుత్వానికి కితాబు ఇచ్చారు. ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్ని పేజీలు చాలావు. అందుచేత, మరిన్ని వివరాల్లోకి పోకుండా, వారు చెప్పిన కొన్ని సోవియెట్ వైద్య-చోద్యాలను ఇక్కడ ఉదహరించి ఎర్రవైద్యంపై సమాచారాన్ని ముగిస్తాను. పై ఇరువురు వైద్య ప్రముఖులు రోస్టోవ్ ఆన్ డాన్ అనే పట్నంలో ఒక బృహత్ ఫ్యాక్టరీ సందర్శనకు వెడతారు. వారికి అది ఫ్యాక్టరీగా కాక ఒక సామాజిక కేంద్రంగా కనిపిస్తుంది. ఆ ఫ్యాక్టరీలో నిర్మితమై ఉన్నఆరోగ్య వ్యవస్థ వాళ్ళను అబ్బుర పరుస్తుంది.ప్రతి ఉత్పత్తి శాఖకు ఒక మహిళా-వైద్యురాలు వారిపై ఓ మహిళా వైద్యాధికారి.. అక్కడ పనిచేస్తున్న ప్రతి వ్యక్తి యొక్క రోజువారీ ఆరోగ్య చరిత్రను, వారికి అందించిన వైద్యాన్ని క్రమంతప్పక అద్భుతంగా రికార్డు చేస్తున్నారు. అంతేగాక ప్రతి ఉత్పత్తి శాఖ పరిశుభ్రత వీరి పర్యవేక్షణలో ఉంచారు. పొరపాటున ఏ రోజైనా పనిచేసే వ్యక్తి గైర్హాజరైతే, అతని పేరు నోటీసుబోర్డుపై రాస్తారు. ఒకటి రెండు రోజులు అతను రాకపోతే, వెంటనే అతని టీమ్ బాధ్యుడు వైద్యునికి సమాచారం ఇస్తాడు. ఆమె గైరుహాజర్ ఐన వ్యక్తి ఆరోగ్య సమాచారాన్ని చూసి అతను నివసించే వాడ లేక వీధి డిస్పెన్సరీకి సమాచారం అందిస్తుంది, ఆ వ్యక్తి ఇంటికి వెళ్ళి అతని ఆరోగ్య స్థితి కనుక్కోమని చెబుతుంది. అక్కడితో సరిపెట్టుకోరు. టీమ్ లీడర్ మాట ప్రకారం అతని పనిటీంలో సభ్యుడు కూడా గైర్హాజరైన వ్యక్తిని పలకరించడానికి, కారణాలు కనుక్కోవడానికి అతని ఇంటికి వెళతాడు. ఇలా వెదికి వెదికి వైద్యం చేయడం, ఇతర సమస్యలుంటే వాటికి టీమ్ పరిధిలోగాని, పై యూనియన్ పరిధిలోగాని చర్చించి ఉపశమనం కలుగ చేస్తారు. వింతేమిటంటే, కొంతమంది పనివారు, అయ్యా మేము ఈ వైద్యసేవల బాదుడుతో విసిగి పోతున్నామని ఫిర్యాదుల పుస్తకంలో రాయడం. ఆ ఫిర్యాదులను పోనీలే అని వదిలేస్తారా అంటే పొరబాటున కూడా వదిలే ప్రసక్తి ఉండదు. ఎందుకంటే అది శ్రామిక రాజ్యం, అందుకని అటు వంటి ఫిర్యాదులపై యూనియన్ కలగచేసుకుని పూర్వపరాలు చర్చించి సంబంధిత వైద్యుని తోను, ఫిర్యాదు దారులతోను చర్చించి సమస్యను పరిష్కరిస్తుంది.

ఎర్రవైద్య రచయితా ద్వయానికి ఇంకొక విషయంకూడా ఆశ్చర్య మనిపించింది. వీధి డిస్పెన్సరీల్లో, ఆసుపత్రుల్లో శారీరిక శ్రమ చేసే కార్మికులకు, పనివారికి, మిగతా ప్రజలు సంతోషంగా వారిని గౌరవిస్తూ, వైద్యుని సంప్రదించడంలో ప్రథమస్థానం ఇస్తున్నారు. అలానే ఆహారపు రేషన్లలో, వినియోగ వస్తువుల కేటాయింపులో శారీరిక శ్రమ చేసే వారికి ప్రత్యేక కోటా ఉంటుంది. ఓ న్యాయబద్ధ సమాజపు గీటు రాళ్లు, దోపిడీ సమాజపు గీటురాళ్లుకు పూర్తిగా భిన్నమైనవిగా ఉండటం సోవియెట్ సమాజపు తాత్విక లక్షణంలో చూడవచ్చు.

వీరికన్నా ముందే 'ఎలైస్ విత్రో ఫీల్డ్' అనే అమెరికన్ రచయిత్రి అక్టోబర్ విప్లవానంతరం సోవియెట్ రష్యాలో వైద్య రంగంలో చోటు చేసుకుంటున్న అనూహ్యామైన మార్పుల గురించి విని, ఉత్తేజితురాలై, ప్రత్యేక శ్రద్ధతో అక్కడ 'మాతా-శిశు సంరక్షణ' ఎలా అమలౌతున్నదో అధ్యయనం చెయ్యాలని నిర్ణయించుకుని, రష్యా పయనమై వెళ్ళింది. ఆమె ప్రత్యక్ష అనుభవాలతో 'సోవియెట్ రష్యాలో మాతా-శిశు సంరక్షణ' అనే అద్భుతమైన వివరణాత్మక గ్రంథాన్ని ప్రచురించింది. ఇందులో వివరాలను చూసినట్లయితే, ప్రపంచంలోనే మొట్ట మొదటి సోషలిస్టు సమాజం 'కష్టాల, త్యాగాల కొలిమిలో సలసల కాగుతూ' కూడా మాతా-శిశు సంరక్షణా భాధ్యతను, ధ్యేయాన్ని ఎలా ఎత్తిపట్టిందో అర్థంచేసుకున్నవారు ఎవరైనా ఆశ్చర్యచకితులై, అబ్బురపడక మానరు. సోషలిస్టు సామాజంలో ఒక్కొక్క అంశంపై అధ్యయనం ఎంతలోతుగా, నిజాయితీగా, ప్రజాహితంగా, శాస్త్రీయంగా, నిస్వార్థ దృష్టితో కూడుకుని ఉంటుందో అన్న దానికి ఇదొక సజీవమైన ఉదాహరణ.

స్త్రీని వంటింటి దాస్యం నుండి, ఫ్యూడల్ బంధనాల నుండి విముక్తిగావించి పురుషునితో సమానంగా ప్రజాపాలనా కార్యక్రమాలలోనూ, ఉత్పత్తిలోనూ వికసిత హృదయాలతో పాల్గొనేటట్లు చెయ్యాలంటే; ఓ మాతృమూర్తిగా ప్రకృతి ఆమెకు ప్రసాదించిన పిల్లల సంరక్షణ బాధ్యతనుండి కూడా ఆమెకు ఊరట కల్గించాల్సి ఉంటుంది. అలా జరగాలంటే మాతా, శిశు సంరక్షణా బాధ్యతను ఆయా ప్రభుత్వాలూ, సమాజాలు తీసుకోవాల్సి ఉంటుంది. మార్క్స్, లెనిన్ బోధనలను ఒంటబట్టించుకున్న సోవియెట్ ప్రభుత్వం 1917 అక్టోబర్ / నవంబర్ విప్లవం విజయవంతమైన కొద్ది నెలల కాలంలోనే "మాతా-శిశు సంరక్షణా సంస్థను" స్థాపించింది. యావత్ ప్రపంచంలోనే ఇదొక విప్లవాత్మకమైన ముందడుగు.

అప్పటికే అభివృద్ధి చెందిన దేశాలుగ ఢంకా బజాయించు కొంటున్న పెట్టుబడిదారీ దేశాలైన అమెరికా, బ్రిటన్, జర్మనీ, ఫ్రాన్స్ వంటి ఏ దేశాల్లోనూ ఇటువంటి ప్రగతిశీలమైన అడుగు ఆనాడే కాదు; ఈనాటికీ పడలేదు. ఇహ ఇండియాలాంటి మూడో ప్రపంచ దేశాల్లో మాతా-శిశు సంరక్షణ ఎంతటి దయనీయమైన, అధ్వాన్న మైన స్థితిలో ఉందో నిత్యం అందరికీ గోచరిస్తున్న దృశ్యమే కదా!

అనేక దేశాల్లో వ్యక్తిగత కుటుంబాల స్థాయిలో, విడివిడిగా వారి వారి ఆర్థిక స్తోమతను బట్టి మాతా-శిశు సంరక్షణ అనే అంశాన్ని స్పృశించడం జరుగుతున్నది తప్ప; ఆ అంశాన్ని సర్వ జనరంజకంగా, సమానత్వ భావనతో, సమాజంలోని ప్రతి తల్లినీ, ప్రతి బిడ్డనూ అక్కున చేర్చుకుని సంరక్షించుకున్న పద్ధతి ఒక్క సోవియట్ సోషలిస్ట్ రష్యాలోనే కడు మానవీయంగా కనుల పండుగగా వర్ధిల్లింది.

ఈ "మాతా-శిశు సంరక్షణా సంస్థ" స్థాపనా ప్రక్రియ యాథా లాపంగానో, ఎవరో కొందరి కోర్కెలను తీర్చడానికో, ఎన్నికల్లో గెల్వడానికో, ప్రజలను మభ్యపెట్టే ఒక తంతుగానో, స్త్రీలకు ఏదో దానంగానో జరిగిన వ్యవహారం కాదు. ఈ ప్రక్రియకు ముందుగా సమాజంలో అన్ని శ్రామిక సెక్షన్ల ప్రజల్లో, ముఖ్యంగా మహిళల్లో శాస్త్రీయంగా, చిత్తశుద్ధితో కూడిన సుదీర్ఘమైన చర్చలు, మంతనాలు జరిగాయి. ఆ "చర్చల-మంతనాల" సారాంశ మేమంటే:

1.ప్రకృతి సహజంగా స్త్రీ శరీర నిర్మాణం, పురుషునికన్నా భిన్నంగా ఉండడం వలన ఆమె దైనందిన జీవనంలో, మధ్య- మధ్యన శారీరక మానసిక ఒత్తిళ్లకు గురౌతుంది. గర్భధారణ వలన కొంతకాలం ఆమె అబల ఔతుంది; ప్రసవ కాలంలోనూ, బిడ్డను కన్నాక, బాలింతరాలుగా కొంత కాలం పాటు కదలలేని పరిస్థితిలో ఉంటుంది. పసిబిడ్డ "ఆలన - పాలన - పోషణ"లకు తోడు "ఇంటిపని - వంటపని" భారం ఆమెపై పడితే ఇక ఆ "బరువు - బాధ్యతల" నుండి ఆమె ఊరటపొందే మార్గమేది? ఇక, పురుషునితో సమానంగా సమాజంలో తన పాత్రను పోషించే అవకాశం ఆమెకు ఎలా సాధ్యపడుతుంది? అంతేగాక, నిరంతరం ఇంటిపనిలోనే మునిగితేలుతూ, బయటకు కాలు పెట్టలేని స్థితిలోనే కూరుకుపోతే ఆమె విజ్ఞానాన్ని, వికాసాన్ని పొందేదెట్లా? "విజ్ఞాన - వికాసాలు" లేకుండా ఆమె సామాజిక కార్యక్రమాలనెలా నిర్వహించ గల్గుతుంది? ఒకవేళ, వివాహ పూర్వమే ఆమె ఒకింత చదువు సంధ్యలు కలిగివుంటే వాటిని పెంపొందించుకునే మార్గం మూతబడిపోతే ఎట్లా? తనకంటూ ఎటువంటి సొంత ఆదాయం లేకపోతే; అసలు ఏదైనా అఘాంతరమొస్తే; ఆమె ఎవరిపై ఆధారపడాలి? తనకు, తన పిల్లలకూ దిక్కెవరూ? ఆమె పోషణకు ఆధరువేది? ఆమె ఎవరి దయా-దాక్షిణ్యాలపై ఆధారపడాలి? పురుషునికన్నా వెనకబడి ఉన్న మహిళ, ధైర్యంగా తన భర్తతో సమానంగా వివిధ సామాజిక సాంస్కృతిక సన్నివేశాలలో, కార్యక్రమాలలో కలగలసి ఉత్సాహాన్ని ఎలా పంచుకోగలదు? ఇల్లొదిలి బయట ప్రపంచంలో ఎలా ప్రయాణించగలదు? ఒకవేళ మహిళకు విద్యాబుద్ధులు ఉన్నప్పటికీ, సంసార బాధ్యత కాళ్ళకు బంధమైతే, ఇక ఆమె ఉత్పత్తిలో, సమాజ సేవలో ఎలా భాగస్వామి కాగలదు? ఈ ప్రశ్నలన్నిటికీ, ఈ సమస్యలన్నిటికీ మొట్టమొదటి సత్వర పరిష్కారంగ మహిళను ఇంటిపని బంధనాల నుండి, పిల్లల సంరక్షణ నుండి ఎంత ఎక్కువగ వీలుపడితే అంత ఎక్కువగా ఆమెకు ఊరట కలిగించాలి. అలా ఊరట చేకూర్చే అన్ని పద్ధతులనూ అవలంబించి సౌకర్యాలనూ సమకూర్చే బాధ్యత; తల్లీ-పిల్లల ఆరోగ్య సంరక్షణా బాధ్యతా, సోవియట్ ప్రభుత్వమే తీసుకోవాలి. అలా సోవియట్ మహిళను ఆర్థికంగా, సామాజికంగా స్వతంత్రురాలిని చెయ్యాలి.

2. వ్యవసాయ, కార్మిక కుటుంబాలలో పోషకాహార లోపం వల్ల పసిపిల్లలు అధిక సంఖ్యలో మరణించకుండా నివారించడానికి అవసమైన అన్ని చర్యలు ప్రభుత్వం చేపట్టాలి. మానవ వనరు ఉత్కృష్టమైన వనరు కాబట్టి, జాతి సంపద కాబట్టి, ఆ వనరును వృథాగా మరణాలపాలు చేయరాదు.

3. ఆరోగ్యవంతమైన, విద్యావంతమైన, విజ్ఞానదాయకమైన, సమాజహితమైన ఓ కొత్త తరాన్ని పెంచి పోషించే బాధ్యతను సోవియెట్ ప్రభుత్వం తీసుకోవాలి. ఎందుకనంటే, ఓ నూతన సమసమాజ నిర్మాణం అంత తేలికైన పనికాదు; కేవలం పాత తరమొక్కటే కొత్త వ్యవస్థను నిర్మాణం చేసి కాపాడలేదు; కాబట్టి ఎదిగివచ్చే నూతనతరం ఆ పనిని తన భుజస్కంధాలపైకి ఎత్తుకోవాల్సి ఉంటుంది.

ఈ పై మూడు ప్రధాన అంశాలను, వీటికి అనుబంధమై ఉన్న మరికొన్ని అంశాలను మనసులో ఉంచుకుని "మాతా-శిశు సంరక్షణా సంస్థ"ను సోవియెట్ ప్రభుత్వం స్థాపించింది. కేవలం స్థాపించి చేతులు దులుపుకోలేదు. ఆ సంస్థను ఏ ఉద్దేశ్యాలు నెరవేర్చడానికైతే స్థాపించారో; అవన్నీ, ముందుగా అనుకున్న దానికన్నా, బహు మిన్నగా నెరవేరే వరకు శ్రమించి, నిజమైన "మతా-శిశు సంరక్షణ" అంటే ఏమిటో ప్రపంచ ప్రజలకు చూపించింది.



(6వ పేజీ తరువాయి)

రిపబ్లిక్‌కు చైర్మన్‌గా ఉన్న 'మావో సే టుంగ్' తాను స్వయంగా షాంఘై నదిని ఈది పెకింగ్ నుండి కార్మిక నగరమైన షాంఘై చేరుకొని ఈ విప్లవాన్ని ప్రారంభించేడు. తాను స్వయంగా షాంఘై నగరంలోని కర్మాగారాల మీద గోడ పత్రికలు వేసాడు... ఇలా సాగింది వరవర రావు వ్యాసం.

ఇది చదివేక నాకో అనుమానం వచ్చింది, యాంగ్జీ నది పేరును షాంఘై నదిగా మార్చారా ఏమిటి? అని. మావో ఒక ముహూర్తం పెట్టుకుని ఒక నదిని ఎంచుకుని పితరులకు పిండ ప్రదానాలు చేసి, ముఖానికి విభూది పూసుకుని మావో ఒక నదిని ఎంచుకుని ఈది సాంస్కృతిక విప్లవం మొదలు పెట్టడా? అలా చేసాక కేంద్రాన్ని బద్దలు కొట్టండి అని పిలుపునిచ్చాడా? తానే గోడల నిండా పత్రికలూ వేశాడా? ఇది చదివేక నాకో అనుమానం వచ్చి పడింది .. నేను చదివిన, అర్థం చేసుకున్న మహత్తర శ్రామిక వర్గ విప్లవం అంతా కల్లో, మాయో అని డౌట్ పడిపోతున్నాను, అదంతా ఇప్పుడు సరిచేసుకోవాలేమో అని భయమేస్తోంది కూడా -

**4. తరువాతి పేరాల్లో ఇంకొన్ని :**

"దీనికి (జి.పి.సి.ఆర్ కి) రష్యా విప్లవం నాటి వలె ఒక సాయుధ తిరుగుబాటు, చైనా విప్లవ కాలం వలె ఒక దీర్ఘకాలిక సాయుధ పోరాటం అవసరం లేకపోవచ్చు గాని, ఇది ఒక వర్గ పోరాటమే. దీనికి శ్రామిక వర్గమే నాయకత్వం వహించాలి".

కమ్యూనిస్ట్ చరిత్రలో ఇంత తిరోగమనం, ద్రోహం జరిగేకా సాయుధ తిరుగుబాటుతో కాక శ్రామిక వర్గానికి శ్రామిక వర్గ సంస్కృతీ అధికారాలను నిలబెట్టుకోవడానికి, ఇంకే మార్గాలు మిగిలిఉంటాయ్? మిలిటెంట్ రెడ్ 'గార్డుల్లో ఒక పాయ నిర్వచించినట్టు చైనా కమ్యూనిస్ట్ పార్టీలో 95% పెట్టుబడిదారీ మార్గీయులున్నారని, మావో చెప్పినట్లు 5% కాదని అందుచేత వీళ్ళ అధికారాన్ని కూలదోయాలంటే వర్గ యుద్ధం తప్పదని అనడం సబబే అనిపిస్తోంది, దీన్ని మావో అతివాదం అన్నాడుగాని, అలా కాక ఆ వాదాన్ని పరిగణనలోనికి తీసుకుని మిలిటెంట్ శక్తులను, శ్రామిక, ప్రజాసైన్య శ్రేణులను కూడగట్టి ఉంటే డెంగ్ లాంటి వాళ్లనేకులకు పునరావాసం కల్పించకుండా మట్టి కరిపించి ఉంటే, సాంస్కృతిక విప్లవం సాయుధరూపమే దాల్చి విజయం సాధించి ఉండేది అని ఈ మధ్య కాలంలో జి.పి.సి.ఆర్ పై వచ్చిన రీసెర్చ్ అధ్యయనాలు చదివితే అనిపిస్తుంది.

5. "మావో సె టుంగ్ శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవాన్ని నిర్వహించడానికి రెడ్ గార్డ్స్ అనే ఒక విద్యార్థి యువ ఎర్ర సైన్యాన్ని తయారు చేసాడు". అని అన్నారు. ఇది నిజం కాదు. రెడ్ గార్డ్ ఉద్యమం స్వయం జనిత ( స్పాంటేనియస్) విద్యార్థి యువజనోద్యమం. మావో దాన్ని గుర్తించాడు. అంతే గాని ఆయన దాన్ని పనిగట్టుకుని ఏమీ తయారు చేయలేదు. వరవర రావు గారికి నా అభ్యర్థన ఏమంటే.. మావో పై ఆరాధనా భావంతో గాక చైనా సాంస్కృతిక విప్లవాన్ని శాస్త్రీయంగా అధ్యయనం చేసి, ఆ అధ్యయన సారాన్ని ప్రజలకు అందచేయమని.

9వ కాంగ్రెస్ ప్రొసీడింగ్స్ యు ట్యూబ్లో ఇప్పుడు లభ్యమౌతోంది. ఆ కాంగ్రెస్ లో డెలిగేట్స్ అందరూ చేతుల్లో రెడ్ బుక్ పుచ్చుకుని మావో, మావో అని పూనకం పూనడం, మావో అదంతా చూస్తూ ఉండటం కనిపిస్తుంది. చౌఎన్ లై లాంటివాళ్లు అయిష్టంగా ముఖం పెట్టి చుట్టూ ఉన్న భజనమూక హోరులో తానూ గొంతు కలపడం కూడా స్పష్టంగా ఇందులో గమనించ వచ్చు. దీన్ని ఏ వాదం అనాలో లిన్ పియావోకు సరేసరి, చైనా చైర్మనే మన చైర్మన్ అన్న చారుబాబు లాంటి వాళ్ళకే తెలియాలి.

"మొదటి నుండి లిన్ పియావో అతివాదని, రెడ్ గార్డ్ ఉద్యమంలో ఉన్మాదాన్ని ప్రవేశ పెట్టడాన్ని, అతను మావో నాయకత్వాన్ని కూల దొయ్యాలని కుట్ర పన్నాడని 1973 లో బయటపడ్డదని" అన్నారు. ఈ వెర్షన్ ను చాలామంది ఇప్పుడు ఒప్పుకోవడం లేదు. సాంస్కృతిక విప్లవాన్ని అంతం చేయడానికి, మావోను బలహీనపరచడానికి మితవాదులు పన్నిన కుట్రని, లిన్‌ను, సాంస్కృతిక విప్లవ కాలంలో మావో లైన్‌ను బలంగా సమర్థించిన పి.ఎల్.ఎ లో బలమైన అతని అనుచరవర్గాన్ని డెంగ్ ముఠా సీక్రెట్ మిలిటరీ యాక్షన్‌లో నిర్మూలించిందని, దానికి చౌ ఎన్ లై ఆశీస్సులు కూడా ఉన్నాయని ఓ బలీయమైన వాదన కూడా ఉంది.

"ఈ కాలంలోనే విస్తృతమైన ప్రజా ఉద్యమాల ద్వారా వ్యవసాయ కమ్యూన్లను విప్లవీకరించి పీస్ మీల్ కూలి రేటు విధానాన్ని ప్రవేశ పెట్టారు" అని రాసేరు. ఇది తప్పు. సరైనదేనంటే అదెలానో వ్యాస రచయిత కొంచెం వివరిస్తే బాగుంటుంది.

ఒకచోట సాంస్కృతిక విప్లవకాలంలో దీనిపై రాసిన రచయితల పేర్లను ఉదహరించారు. ఆ పేర్లలో అజిత్ అనే పేరు కూడా ఉంది. ఈయన సాంస్కృతిక విప్లవం పై ఏమి పుస్తకాలు రాసేడో నాకు పూర్తిగా తెలియదు. నాకు తెలిసిన దల్లా బాబ్ అవైకిన్ (అమెరికా ఆర్ సి పి నాయకుడు) పై, అవైకనిజంపై ఆయన రాసిన విమర్శా గ్రంథం ఒక్కటే. ఈ వ్యాసకర్త ఆ వివరాలు తెలియ చేస్తే బాగుంటుందని కోరుకుంటున్నాను.

జోయాన్ రాబిన్సన్ 'రేపటి చైనా' పుస్తకం గురించి ప్రస్తావిస్తూ చైనా నూరు కోట్ల మంది మావోలు రూపొందే నూతన మానవ ఆవిష్కరణ చేస్తున్నదని, అయితే అందుకోసం నూరు విప్లవాల అవసరం రావచ్చని రాసింది. ఇటువంటి రాతలు ఇప్పుడు చాలా హాస్యాస్పదంగా ఉంటాయి. 100 కోట్ల మావోలు తయారౌతుంటే ఇక 100 విప్లవాలు దేనికి? ఈ 100 కోట్లు డెంగ్లగా మారిపోతారని ఆమె ముందే ఊహించిందా?

ఇంకో చోట 'జాషువా హార్న్' రాసిన 'ఎవే విత్ ఆల్ పెస్ట్స్' పుస్తక ప్రస్తావన తెస్తూ ఆయనను ఒక రచయితగా సంబోధించారు. ఆయన మహోన్నత ప్రజా వైద్యుడు, త్యాగశీలి. గొప్ప కమ్యూనిస్ట్ బుద్ధిజీవి. ఆ అంశాన్ని, ఆయన చైనా ప్రజలకు చేసిన సేవను, సుదూర గ్రామ సీమల్లో నివసించే చైనా పేద ప్రజల వద్దకు వైద్యాన్ని తీసుకు వెళ్లడంలో ఆయన కృషి చేసాడని చెపితే సమంజసంగా ఉండేది. 1971 లో ఆయన న్యూయార్కులో "ద మాస్ లైన్" అనే ప్రసంగం ఎంతో విలువైనది.

డెంగ్ జియావో పింగ్ మొదటి నుండి మితవాదని, లిన్ పియావో అతివాదని వీళ్ళను చౌ ఎన్ లై బ్యాలెన్సు చేసుకుంటూ వచ్చేవాడని రాసేరు. డెంగ్ ను మూడు సార్లు మూలన బెట్టి మూడు మార్లు మావో తిరిగి పార్టీలో, ప్రభుత్వంలో ఉన్నత పదవులను కట్టబెట్టాడు. లిన్‌పియావో నైతే ఏకంగా తన వారసుడినే చేసేసాడు. ఒకడు పచ్చి రివిజనిస్ట్ అని తెలిసీ నాయనా అలా ఉండబోకురా అని బతిమాలి ఓ ఒప్పంద పత్రంపై సంతకం పెట్టించుకుని పాలనా పగ్గాలను అప్పచెప్పాడు. ఇంకొకడు సుదీర్ఘ రికార్డు గల అతివాదని తెలిసి కూడా కమ్యూనిస్ట్ నిర్మాణ సూత్రాలన్నిటినీ తుంగలో తొక్కి తానే తన వారసుడిగా ప్రకటించాడు. ఇదేతరహా మార్క్సిజం-లెనినిజం? ఇదేతరహా మావోయిజం? మనం అర్థం చేసుకుంటున్న మావోయిజానికి, మావో ఆచరించిన విధానాలకు చాలా వ్యత్యాసముంది. మనం మావోను పాజిటివ్ దృష్టితోనే చూస్తున్నాం. అలా అని నెగెటివ్ పార్శ్వంపై ముసుగు కప్ప ప్రయత్నించడం అశాస్త్రీయం.





# ప్రతిఫలన సిద్ధాంత సాహితీ విమర్శకుడు

వెన్నెలకంటి రామారావు

**సభల్లో మాట్లాడేటపుడు శ్రోతల్లో ఉత్తేజాన్ని నింపాలి, రచనల్లోనూ, క్లాసులోనూ ఆలోచింపజేసేలా ఉండాలి, విమర్శనాత్మక వాదనల్లో మార్క్సిస్టు మహోపాధ్యాయుల కొటేషన్లతో కాక, వారు ఆవిష్కరించిన సామాజికార్థిక సూత్రాలను అన్వయిస్తూ ఆయన సాహితీ విమర్శ చేసేవారు. వర్గపోరాటంలో శత్రువుతో చేసే సాయుధ యుద్ధంలో శత్రువు బలమైన సైద్ధాంతిక అంశాలపైన, వాదనలపైన దాడి చేయాలనేది టీఎంఎస్ వైఖరి. తెలుగు సాహిత్య రంగంలో ఆధిపత్యం వహిస్తున్న సంప్రదాయక, భావ కవిత్వ ధోరణులను, ఆత్మాశ్రయ, ఆత్మానుభూతి సాహిత్య సిద్ధాంతాలను ఆయన పూర్వ పక్షం చేస్తూ 'ప్రతిఫలన సిద్ధాంత' దృక్కోణంలో విప్లవ సాహితీ విమర్శను ఒక ఉద్యమంగా చేపట్టారు. ఆ క్రమంలోనే ఆయన 'గతితార్కిక సాహిత్య భౌతికవాదం' అనే సాహిత్య సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు.**

'మనది పేద ప్రజల దృక్పథం కాదు, కార్మికవర్గ దృక్పథం' అనే మావో సూక్తికి అర్థమేమిటి? మాస్టారూ..." అని 1982లో తిరుపతిలో నేను ఎమ్మెస్సీ చదువుతున్న రోజుల్లో త్రిపురనేని మధు సూధనరావును అడిగినపుడు ఆయన ఒక చిరునవ్వు నవ్వారు. 'మావో రచనలు అత్యంత సరళంగా, సులభంగా అర్థమవుతున్నట్లు ఉంటాయి గానీ, అత్యంత లోతైన తాత్విక చింతన వాటిలో నిబిడీకృతమై ఉంటుంది' అని మాస్టారు చెప్పడం మొదలెట్టారు. 'కూలీ రేట్ల సమస్య, జీవన భృతి, ఉపాధి వంటి అనేక ఆర్థిక సమస్యలతో సహా కుల, మత, జాతి, ప్రాంత తదితర రూపాల్లో అణచివేతకు గురవుతున్న పేద ప్రజల వేదనామయ జీవితాలకు పరిష్కారం కనుగొనడమే మార్క్సిజం అంతస్సారం అని ప్రచారంలో ఉంది. సోషలిస్టు విప్లవం అంటే కేవలం శ్రామికవర్గం పక్షాన పోరాటం చేయడం కాదని, అది కార్మికవర్గ నాయకత్వాన సమాజంలోని దోపిడీకి గురయ్యే మధ్యతరగతి, కార్మిక వర్గంతో సహా సకల పీడిత అస్తిత్వాల విముక్తికి కోసం జరిగే ఐక్య, ఉమ్మడి పోరాటమని స్పష్టం చేశారు. సమాజంలోని ఏదో ఒక పీడిత అస్తిత్వానికి పరిమితమై, ఆ సమాజ పరిమితుల్లోనే ఆ అస్తిత్వంపై జరుగుతున్న పీడనకు పరిష్కారం కోసం అన్వేషించడం పేదల ప్రజల దృక్పథం లేదా పీడిత అస్తిత్వాల దృక్పథంగా పరిగణించాలని వివరించారు. కార్మికవర్గ పోరాటమంటే కార్మిక వర్గ దృక్పథంతో అన్ని వర్గాల, అస్తిత్వాల (కుల, మత, భాష, ప్రాంత, జాతి, లింగ తదితర) ప్రజల విముక్తి కోసం చేసే సమగ్ర పోరాటంగా అర్థం చేసుకోవాలని చెప్పారు. అందువల్ల మావో అన్నట్లు మనది పేదల దృక్పథం కాదు, కార్మికవర్గం దృక్పథం అని ఆయన నొక్కి చెప్పారు. సమాజంలోని అనేకానేక ప్రజాసమూహాలపై, అనేకానేక అస్తిత్వ రూపాల్లో అణచివేతలు సాగుతాయి. అయితే ఆ అస్తిత్వ రూపాలన్నీ మానవ చైతన్యంతో, సంకల్పంతో నిమిత్తం లేకుండా ఉనికిలోకి వచ్చే సామాజిక పాదార్థిక సంబంధాలైన వర్గ సంబంధాల ప్రతిఫలనంగా, అంటే మానవ ప్రమేయంతో భౌతిక రూపం దాల్చిన బౌద్ధిక సంబంధాలుగా సమాజంలో ఆవిర్భవించాయి. అందువల్ల వర్గపోరాటానికి సమాంతరంగా వివిధ అస్తిత్వాల రూపంలో జరుగుతున్న అణచివేత వ్యతిరేక పోరాటాలు వర్గ దృక్పథంతో సాగితేనే పెట్టుబడిదారీ పూర్వ సమాజాల్లో సమగ్ర సామాజిక విప్లవం సాధ్యమవుతుంది. ఈ అవగాహనను ఇదే తీరులో ఆయన ఎక్కడా స్పష్టంగా వ్యక్తం చేయకపోయినా వర్గ పోరాట దృక్పథంతో సాగే అస్తిత్వ ఉద్యమాలు, అస్తిత్వ సాహిత్య ఉద్యమాలే సవ్యమైన చారిత్రక పాత్ర పోషిస్తాయనేది ఆయన నిశ్చితాభిప్రాయం. అస్తిత్వవాద ఉద్యమాలు అంతిమంగా అధికారిక ఉద్యమాలుగా పరిణమిస్తాయనే విషయాన్ని టి.ఎం.ఎస్ వివిధ సందర్భాల్లో ప్రస్తావించేవారు. ఈ అవగాహనతోనే ఆయన విప్లవ సాహితీ విమర్శను అభివృద్ధి చేశారు.

సాహిత్యరంగంలో కార్మికవర్గ తాత్విక దృక్పథంతో జరిపే వర్గపోరాటమే సాహిత్య విమర్శ అనే అవగాహనతో జీవితకాలం కృషి చేసిన భౌతికవాద గతితర్క సాహితీ విమర్శకుడు త్రిపురనేని మధుసూదనరావు (టి.ఎం.ఎస్). ఆధునిక వైతాళిక సాహితీ విమర్శకుడు టి.ఎం.ఎస్ మనల్నందర్నీ వీడి అక్టోబర్ 8 నాటికి పన్నెండేళ్లు కావస్తోంది. సామాజిక జీవితంపై ఆధారపడని ఒక ప్రత్యేక మానవ అంతశ్శక్తి ప్రేరణతో వివృతమయ్యే సృజనాత్మకతగాను; మానవుల బౌద్ధిక కార్యకలాపంగా సాహిత్యం, కళలు తదితర సాంస్కృతిక అంశాలను పరిగణించే మేధావులు ప్రబలంగా చలామణిలో ఉన్న కాలమిది. సాహిత్య రంగం స్వతంత్రంగా ఉనికిలో ఉన్న రంగమని అది సమాజంలోని ఆర్థిక, రాజకీయ, సామాజిక రంగాలలో దేనిపైనా ఆధారపడి ఉండదని, మహా అయితే విభిన్న సామాజిక రంగాల ప్రభావం నిర్ణయాత్మకంగా కాక నామమాత్రంగానే దానిపై ఉంటుందన్న వాదనకు బలమైన సమర్థకులు ఉన్న చారిత్రక సందర్భమిది. అనువంశిక లక్షణాల కొనసాగింపుతో రూపొందిన సాహిత్యవేత్తలు తమదైన బౌద్ధిక

అంతశ్శక్తి సామర్థ్యాలతో సాహితీ సృజన చేస్తున్నారనే భావజాలం నేడు మేధావుల్లో ప్రబలంగా వ్యాపించి ఉంది. దానికి తోడు కుల, మత, ప్రాంత, లింగ తదితర అస్తిత్వ సమస్యల పునాదిగానే సాహిత్యం ఆవిర్భవిస్తున్నదని, అందుకు ఆయా అస్తిత్వాలకు చెందినవారే అనుభవపూర్వక జ్ఞానంతో సాహిత్య సృష్టి చేయగలరు. అంతేగానీ, ఆ సామాజిక అస్తిత్వాలకు వెలుపల ఉన్నవారు గానీ, అందుకు సంబంధించిన ప్రత్యక్ష అనుభవం లేనివారు గానీ సదరు సామాజిక అస్తిత్వ అనుభవాలతో కూడిన ఇతివృత్తంతో సృష్టించే సాహిత్యానికి జీవం ఉండదనే అభిప్రాయం సమకాలీన మేధావుల్లో ప్రబలంగా ఉంది. పర్యవసానంగా ఇటాలియన్ కమ్యూనిస్టు నేత ఆంటోనియో గ్రాంస్కీ ప్రతిపాదించిన ఆర్గానిక్ ఇంటలెక్చువల్స్ అనే భావన మేధావుల్లో పాదుకొని ఉంది. ఈ సామాజిక నేపథ్యంలో టి.ఎం.ఎస్ చేసిన సాహితీ విమర్శను ఒకసారి గుర్తు చేసుకోవలసిన చారిత్రక ఆవశ్యకత ఉందనిపిస్తోంది.

సమాజమనేది ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక (సాహిత్య, కళలు వగైరా) వివిధ రంగాల రూపంలోని అవయవాలతో కూడిన అవయవిగా టి.ఎం.ఎస్ విశ్లేషించారు. ఈ అవయవాలు (సామాజిక అంగాలు) పరస్పర ప్రభావం నెరపడం, సమన్వయంతో పనిచేయడమే కాదు, అవి పరస్పరాధారితాలుగా ఒక సజీవ మొత్తం (ఒక అవయవం)గా ఉనికిలో ఉంటాయని ఆయన వెల్లడించారు. సాహిత్యమనేది సామాజిక కార్యాచరణ ప్రతిఫలనంగా నిర్దిష్ట వ్యక్తుల అభివ్యక్తీకరణ ఫలితంగా వైయక్తిక సృజనాత్మక కార్యకలాపంగా సమాజంలో ఉనికిలోకి వస్తుందని ఆయన భావన. అందువల్ల సాహిత్యాన్ని సాహిత్యంతోనే కొలిచేపని టి.ఎం.ఎస్ దృష్టిలో భావవాద, అశాస్త్రీయ వ్యవహారం. టీయంఎస్ సాహితీ విమర్శకు 'ప్రతిఫలన సిద్ధాంతమే' గీటురాయి. ఈ సిద్ధాంతంపై ఆధారపడి కళలు, సాహిత్యం, సాంస్కృతిక రంగంలో సృజనాత్మకతలపై ఆయన విశ్లేషించారు. 'కళ, కళాకారుని ప్రతిభ నుంచి పుట్టేది కాదు. కళ ఒక సామాజిక చైతన్య రూపం. కళాకారునిలోకి విడిగా స్వతంత్రంగా ఉండే బాహ్య వాస్తవికత పరావర్తనం ద్వారానే కళ సృజింపబడుతుంది. కళాత్మక సృజనలో విషయి (సబ్జెక్ట్) - విషయాల (ఆబ్జెక్ట్) సమ్మేళనం ఉంటుంది. విషయి ఒక లక్ష్యాన్ని దృష్టిలో ఉంచుకొని విషయాన్ని పరావర్తించుకుంటుంది. ఆ లక్ష్యాన్ని సాధించడానికి అవసరమైన బాహ్య వాస్తవికతను ఒక తపనతో పరావర్తించుకొని సాధిస్తాడు'. అని 1984లో 'అరుణతార' పత్రికలో 'పరావర్తన సిద్ధాంతం-సాహిత్యం' అనే వ్యాసంలో టి.ఎం.ఎస్ వివరించారు. ఒక కొత్త సూత్రీకరణను ప్రస్తావించి, దాని హేతుబద్ధతను వివరిస్తూ, అన్వయిస్తూ విమర్శించే నిగమ తర్కాన్ని ఆయన ప్రధానంగా అనుసరించేవారు. వ్యాసాలను నిగమ తర్కంతో ప్రారంభించినప్పటికీ, వివిధ విషయాల్ని వివరిస్తూ వాటి నుంచి ఒక సూత్రీకరణకు వచ్చే ఆగమ తర్కపద్ధతిని కూడా అనుసరిస్తూ ఆ రెండింటి సంతులిత అల్లికతో తాను చెప్పదలచుకున్న తాత్విక విషయాన్ని కచ్చితంగా వ్యక్తీకరించేవారు. వర్తమాన పోరాటాల నుండి, చారిత్రక నేపథ్యం నుంచి, భౌతికవాద గతితార్కిక తాత్విక దృక్పథం పునాదిగా సాహిత్యాన్ని పరామర్శించే విధానాన్ని టి.ఎం.ఎస్ అభివృద్ధి చేశారు.

సభల్లో మాట్లాడేటపుడు శ్రోతల్లో ఉత్తేజాన్ని నింపాలి, రచనల్లోనూ, క్లాసులోనూ ఆలోచింపజేసేలా ఉండాలి, విమర్శనాత్మక వాదనల్లో మార్క్సిస్టు ప్రామాణిక సూత్రాలకు నిబద్ధులమై( ట్రూ టూ క్లాసిక్స్) ఉండాలన్నది టి.ఎం.ఎస్ లక్ష్యం. మార్క్సిస్టు మహోపాధ్యాయుల కొటేషన్లతో కాక, వారు ఆవిష్కరించిన సామాజికార్థిక సూత్రాలను అన్వయిస్తూ ఆయన సాహితీ విమర్శ చేసేవారు. వర్గపోరాటంలో శత్రువుతో చేసే సాయుధ యుద్ధంలో శత్రువు బలమైన సైద్ధాంతిక అంశాలపైన, వాదనలపైన దాడి చేయాలనేది టి.ఎం.ఎస్ వైఖరి. తెలుగు సాహిత్య రంగంలో ఆధిపత్యం వహిస్తున్న సంప్రదాయక, భావ కవిత్వ ధోరణులను, ఆత్మాశ్రయ, ఆత్మానుభూతి సాహిత్య సిద్ధాంతాలను ఆయన పూర్వ పక్షం చేస్తూ 'ప్రతిఫలన సిద్ధాంత' దృక్కోణంలో విప్లవ సాహితీ విమర్శను ఒక ఉద్యమంగా చేపట్టారు. ఆ క్రమంలోనే ఆయన 'గతితార్కిక సాహిత్య భౌతికవాదం' అనే సాహిత్య సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. అందులో భౌతిక సామాజిక రంగంలో వర్గపోరాటానికి ఎంత ప్రాముఖ్యత ఉందో, భావజాల రంగంలో వర్గపోరాటానికి సమాన ప్రాధాన్యత ఉందని ఆయన సూత్రీకరిస్తూ అవయవి-అవయవ భావనను సమాజ పాదార్థిక సంబంధాల, భావజాల రంగాల మధ్యగల సంబంధానికి అన్వయిస్తూ, ప్రధానంగా సాహిత్య రంగంపైనే దృష్టి కేంద్రీకరించారు. మార్క్సిస్టు సామాజిక వర్గీకరణలైన సామాజిక పునాది - ఉపరితల అనే కేటగిరీ (తాత్విక ధాతువులు)ల మధ్య గల పరస్పర సంబంధాన్ని స్థూలంగా వివరించే ప్రయత్నం కూడా ఆ సందర్భంగా ఆయన చేశారు. పునాది - ఉపరితలం భావన గురించి దేశీయ కమ్యూనిస్టు సాహిత్యంలో గతం నుంచి కొనసాగుతున్న సాంప్రదాయక యాంత్రిక అవగాహనకు భిన్నంగా మార్క్సిస్టు అవగాహనతో ఆ వర్గీకరణలను సవ్యంగా అర్థం చేసుకునే వైపుకు ఆయన సైద్ధాంతిక కృషి మనల్ని పురికొల్పుతుంది.

ఆనాటి విరసం ప్రముఖులు, వారి భావ సారూప్య రాజకీయ పార్టీ పీపుల్స్‌వార్ సహా అనేక మంది మేధావులు టి.ఎం.ఎస్ ప్రతిపాదించిన 'గతితార్కిక సాహిత్య భౌతికవాదం' అనే సాహిత్య సిద్ధాంతాన్ని తిరస్కరించారు. ఆ సిద్ధాంత ప్రతిపాదన కోసం ఆయన చేసిన సైద్ధాంతిక విశ్లేషణ మార్క్సిస్టు దృక్పథంతోనే ఉన్నప్పటికీ, అందుకు కొత్తగా గతితార్కిక సాహిత్య భౌతికవాదం అని నామకరణం చేయడం పొరపాటనే అభిప్రాయాన్ని వారు వ్యక్తం చేశారు. అయితే మార్క్సిస్టు దృక్కోణంలో సాహిత్య విమర్శ ఉందేగానీ, మార్క్సిస్టు దృక్కోణం పునాదిగా ఒక సాహిత్య సిద్ధాంతం లేదనే అభిప్రాయంపై 1980ల నాటి మార్క్సిస్టు సాహిత్యకారుల్లో ఒక చర్చ సాగేది. అయితే సాహిత్య విమర్శ, సాహిత్య సిద్ధాంతం ఒకటి కాదనే మాట నిజమే. అయితే గతితార్కిక భౌతికవాదం అనే తాత్విక దృక్పథాన్ని ఒక సాహిత్య సిద్ధాంతంగా మార్చడంలోనే చిక్కు ఉన్నది. సంప్రదాయ, భావవాద సాహిత్య సిద్ధాంతానికి, వాస్తవికవాద సాహిత్య సిద్ధాంతానికి ఉన్న తేడాను చూపడం అవసరం. ఆనాడు పరాజిత సాంప్రదాయ, భావవాద సాహిత్య సిద్ధాంతానికి, వాస్తవికవాద సాహిత్య సిద్ధాంతానికి ఉన్న తేడాను చూపడం అవసరం. ఆనాడు పరాజిత సాంప్రదాయ, భావవాద సాహిత్య ధోరణులకు ప్రాతినిధ్యం వహించిన కొంతమంది సాహిత్యవేత్తలు, సామాజిక యథాస్థితి సమర్థకులు కొందరు, సమానత్వం కాకుండా, సమాన వాటానే పరిష్కారంగా భావిస్తున్న కుల, మత ప్రాంత, లింగ అస్తిత్వ వాదులు భావవాద సాహిత్య

సిద్ధాంతం పునాదిగా సమకాలీన విప్లవ సాహిత్యంపై దాడులు చేస్తున్న కాలమది. అందుకోసం వారు 'ఆధునికానంతర వాదం' అనే ఫలిత ప్రాధాన్యవాద (ప్రాగ్మటిజం) రూపంలోని స్వీయాత్మక భావవాద తాత్విక ధోరణిని తమ ప్రాపంచక దృక్పథంగా స్వీకరించారు. ఈ ధోరణి సమాజంలోని కుల, మత, లింగ, ప్రాంత వగైరా రూపాల్లోని వివిధ ప్రజా సమూహాలను విడివిడిగా అంశాల సమాహారంగా చూస్తుంది. ఆ అస్తిత్వాలకు చెందిన నిర్దిష్ట సమస్యల పరిష్కారం కానీ, సామాజిక పీడన నుంచి విముక్తిగాని దేనికదే విడిగా ఉంటుందని పరిగణిస్తుంది. సమాజమన్నది వివిధ అస్తిత్వాల రూపంలోని అవయవాలతో కూడిన అవయవిగా పరిగణించదు. వివిధ అస్తిత్వాలతో కూడిన ఎంటిటీ (ఏక వ్యవస్థ)గా సమాజాన్ని గుర్తించకపోవడం వల్ల, వాటన్నిటి ఉమ్మడి పరిష్కారాన్ని ఊహించడం ఆ ధోరణికి సాధ్యం కాదు. ఉమ్మడితనాన్ని ఆమోదించడమనేది ఆధిపత్య ధోరణికి చిహ్నంగా అది భావిస్తుంది. సమాజం వివిధ సామాజిక సమూహ శకలాలతో కూడిన సమాహారంగా గుర్తించడం వల్ల, ఉమ్మడి సాహిత్యం అనేది ఆధిపత్య సాహిత్యమేనని, శకలాలుగా వివిధ అస్తిత్వ సాహిత్యాలు ఉనికిలోకి రావడమే సరైనదని, సజీవమైన సృజన అని వాదిస్తుంది. అందువల్ల వివిధ అస్తిత్వాల నుంచి ఆ జీవితానుభవం గలవారే ఆ సదరు అస్తిత్వం నుంచి ఆవిర్భవించిన ఆర్గానిక్ మేధావులే నికార్సయిన సాహిత్యకారులని ఆ ధోరణి సూత్రీకరించింది. సాంప్రదాయక, భావవాద, ఆధునికానంతరవాద సాహిత్య సిద్ధాంత దాడిని ఎదుర్కొనేందుకు భౌతికవాద దృక్పథంతో కూడిన సాహిత్య సిద్ధాంతాన్ని టి.ఎం.ఎస్ అభివృద్ధి చేశారు. ఆయన చేసిన ప్రయత్నం చారిత్రక ప్రాధాన్యం గల విషయం.

సామాజిక పరిణామం ఒకానొక సంధికాలాన్ని సమీపిస్తున్న ప్రతి చారిత్రక సందర్భంలోనూ తత్వశాస్త్ర ఆవశ్యకతను ప్రశ్నిస్తూ సమకాలీన వ్యవస్థను సమర్థిస్తూ రూఢీవాదం (పాజిటివిజం) ముందుకొచ్చింది. ముఖ్యంగా పెట్టుబడిదారీ వ్యవస్థ ఆవిర్భావంతో తత్వశాస్త్రం నుంచి వివిధ ప్రకృతి శాస్త్రాలు ప్రత్యేక శాస్త్రాలుగా విడిపోయిన సందర్భంలో, తత్వశాస్త్రం అవసరమేముందని వాదిస్తూ పాజిటివిజం అనే ఆలోచనా ధోరణి ముందుకొచ్చింది. 19వ శతాబ్దంలో తొలినాళ్ళలో ఆవిర్భవించిన పాజిటివిస్టు తాత్విక ధోరణిని మార్క్స్-ఎంగెల్స్ బలంగా పూర్వపక్షం చేశారు. అదే ధోరణి 20వ శతాబ్దం ప్రారంభంలో సామాజిక, ప్రకృతి శాస్త్రాలు శాఖోపశాఖలుగా విడిపోయి వృద్ధి చెందుతున్న సందర్భంలో నియో పాజిటివిజంగా ముందుకొచ్చింది. ఈ నియో పాజిటివిజం పేరుకు కొత్తదిగా ఉన్నప్పటికీ, మార్క్స్ ముందుకాలం నాటి పాజిటివిస్టు ఆలోచన ధోరణే రూపం మార్చుకొని భౌతికవాదంపై దాడికి తలపడింది. అదే క్రమంలో ప్రపంచ సోషలిస్టు విప్లవం వెనకతట్టు పట్టి, ప్రపంచ ఆర్థిక సంక్షోభం తలెత్తిన సమయంలో అస్తిత్వవాదాల ముసుగులో ఆధునికానంతరవాదం పేరు మీద మళ్ళీ 19వ శతాబ్దం తొలినాళ్ళకు చెందిన పాజిటివిజం కొత్త పరిభాషతో ముందుకొచ్చింది. పేరుకు ఇది ఆధునికానంతర వాదమే అయినా, దీని తాత్విక సారమంతా పారిశ్రామిక విప్లవం తొలినాళ్ళనాటి పాజిటివిజమే. సాహిత్యరంగంలో ఆధునికానంతరవాదం (పోస్ట్ మాడర్నిజం) అసలు రంగును టి.ఎం.ఎస్ సరిగానే గుర్తించి వివిధ సందర్భాల్లో దాని డొల్లతనాన్ని ఎండగట్టారు. అయితే విప్లవ సాహిత్య ఉద్యమం ఆధునికానంతరవాదాన్ని విమర్శిస్తూ టి.ఎం.ఎస్ చేసిన కృషిని ముందుకు తీసుకెళ్లడంలో విఫలమైంది. వివిధ భావజాల రంగాల్లో ఆధునికానంతర తప్పుడు ధోరణి ఎలా విస్తరించింది, దానికి మూలమేంటి, దాని ప్రాధాన్యమేమిటో గుర్తించలేక చారిత్ర వెనుకబాటుతనానికి గురైంది. అంటే సమకాలీన భావజాల రంగంలో వర్గ శత్రువుకు సంబంధించిన సైద్ధాంతిక, భావజాల బలమెక్కడుందో గుర్తించి, ఆ ఆలోచనా ధోరణి ప్రబలత్వాన్ని ఎదుర్కొనడంలో విప్లవ సాహిత్యోద్యమం ఇప్పటికీ అస్పష్టతలోనే ఉన్నట్లుంది. సకల భావజాల రంగాల్ని కలుషితం చేస్తున్న ఆధునికానంతర వాద తాత్విక ఇన్‌ఫెక్షన్‌కు విప్లవ సాహిత్యోద్యమ నాయకత్వం గురైంది. ఆ మధ్య విప్లవ సాహిత్యోద్యమ నేత ఒకరు 'మార్క్స్ ఆర్థిక సిద్ధాంతాలు, సామాజిక సిద్ధాంతాలు ఉన్నపుడు మార్క్సిస్టు తత్వశాస్త్రం అవసరమేమిటి?' అని నాతో అంటే నాకు ఆశ్చర్యమేసింది. తత్వశాస్త్రానికి, మిగిలిన ప్రకృతి, సామాజిక శాస్త్రాలకు మధ్య తేడా తెలియని ఇలాంటి నేతలు సాహిత్య రంగంలో వర్గ పోరాట దృక్పథంతో ఎలా పోరాటం చేయగలరో సందేహమేస్తుంది. అదే విధంగా ప్రముఖ మహిళా మార్క్సిస్టుగా తెలుగు ప్రజలకు సుపరిచితమైన రంగనాయకమ్మ సైతం మార్క్సిస్టు తత్వశాస్త్రం అవసరమేమిటని ప్రశ్నిస్తూ, ఎద్దేవా చేస్తూ ఒక పుస్తకాన్నే ప్రచురించారు. తత్వశాస్త్రం వద్దంటున్న పాజిటివిజాన్ని మార్క్స్ వ్యతిరేకిస్తూ భౌతికవాద గతితర్కాన్ని అభివృద్ధి చేశారు. అదే పాజిటివిస్టు తాత్విక ధోరణి పోస్ట్ మాడర్నిజం రూపంలో నేడు విప్లవ శ్రేణుల్లో ఒక తాత్విక ఇన్‌ఫెక్షన్‌గా ప్రబలుతూ విప్లవ తత్వాన్ని డొల్ల చేస్తోంది. మార్క్సిస్టు తాత్వికతను భూ మార్గం పట్టించే బాధ్యతను భుజానికెత్తుకున్న విప్లవ సాహిత్య శ్రేణులు మార్క్సిస్టు ప్రామాణిక గ్రంథాలను అధ్యయనం చేయడం కానీ, వారు కనుగొన్న భౌతికవాద చారిత్రక సూత్రాలను, నియమాలను అవగాహన చేసుకోవడంగానీ నేడు జరగడంలేదు. అస్తిత్వవాదులు ప్రచారం చేస్తున్న అహేతుక, అశాస్త్రీయ భావజాల చెత్తను, పదజాలాన్ని (పితృస్వామ్యం, సాధికారత, పౌరసమాజం, ఉత్పత్తి కులాలు, సామాజిక వర్గాలు వంటివి ఎన్నో...) విచక్షణారహితంగా వారు స్వీకరిస్తున్నారు. టి.ఎం.ఎస్‌కు వ్యక్తిగత బలహీనతలు ఉండొచ్చు. సంస్థాగతంగా నిర్మాణపరమైన తప్పులు కొన్ని చేసుండొచ్చు, అంతమాత్రాన వీటన్నిటి కారణాన ఆధునికానంతర వాదంపై ఆయన చేసిన పోరాటాన్ని ఆయన తదనంతరం కొనసాగించకపోవడం తప్పు. అదీ కాక ఆధునికానంతర వాదాన్ని తెలుగునాట విస్తరించేందుకు కీలకంగా దోహదం చేసిన బాలగోపాల్‌ను 'ఈ తరం మేధావి'గా గుర్తించిన విప్లవ సాహిత్య మేధావులు టి.ఎం.ఎస్ కృషిని ముందుకు తీసుకెళ్ళకపోవడం చారిత్రక తప్పిదం.

మార్క్సిస్టు సిద్ధాంతం ప్రకారం ఉత్పత్తి సంబంధాలను పునాదిగాను, రాజకీయాలు, కళలు, సాహిత్యం సహా వివిధ రాజకీయ, సామాజిక సంస్థలు, వ్యవస్థలను ఉపరితలం అంశంగా పరిగణిస్తారు. పునాది, ఉపరితలం అనే రెండు అవయవాలతో కూడిన అవయవిగా సమాజాన్ని టి.ఎం.ఎస్ సమాజాన్ని అభివర్ణించారు. అందువల్ల పునాదిగా ఉన్న ఆర్థిక విషయాలకు ఎంతో ప్రాధాన్యముంటుందో, ఉపరితలంలో ఉన్న సాహిత్య

రంగానికి కూడా అంతే ప్రాముఖ్యముంటుందన్నది ఆయన వాదన. ఆర్థిక అంశాల ప్రతిబింబంగా, దాని పర్యవసానంగా మాత్రమే సాహిత్య సృజన జరుగుతుంది లేదా అభివృద్ధి చెందుతుంది అన్న సంప్రదాయక భారతీయ కమ్యూనిస్టుల విశ్వాసాన్ని ఆయన తిప్పికొట్టారు. అందుకు భిన్నంగా పునాది ప్రతిఫలనంగా సాహిత్యం పుట్టినట్లే, పునాది పరిణామానికి సాహిత్యం కారణమవుతుందని ఆయన సూత్రీకరించారు. ఈ రకంగా పునాది ప్రధానమైనది, ఉపరితలం అప్రధానమైనదని ప్రచారం చేస్తున్న బాలగోపాల్ సహా వివిధ రకాల మార్క్సిస్టు రచయితలు వెలిబుచ్చిన తప్పుడు మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఆయన పూర్వపక్షం చేశారు. పునాది, ఉపరితలం గురించి గతకాలంగా నడుస్తున్న దురవగాహనను సరిచేసేందుకు 'గతితార్కిక సాహిత్య భౌతికవాదం' అనే ఆయన సిద్ధాంత పత్రం ఉపకరిస్తుంది. 'పునాదికి అధిక ప్రాధాన్యముంది, ఉపరితలానికి తక్కువ ప్రాధాన్యముంది' అనీ, 'పునాది మారితేనే తదనుగుణంగా ఉపరితలం మారుతుందనీ' చారిత్రక భౌతికవాదం చెబుతున్నట్లు పైన పేర్కొన్న మార్క్సిస్టులు చాలా ఏళ్ళుగా ప్రచారం చేశారు. అయితే పునాదే గొప్పదనీ, ఉపరితలం తక్కువదనీ మార్క్స్ ఏంగెల్స్ ఎన్నడూ చెప్పలేదు, రాయలేదు. 'పునాది మారినంత త్వరగా ఉపరితలంలో మార్పులు చోటు చేసుకోవు' అన్నారు గానీ ముందు ఆర్థిక సంబంధాలైన పునాదిని మార్చి, తర్వాత సామాజిక ఉపరితల అంశాలను మార్చేందుకు కృషి చేయాలని కూడా వారెక్కడా రాయలేదు. పునాది అయిన ఆర్థిక సంబంధాల్లో మార్పుకు కృషి చేసేందుకు సైతం వివిధ వర్గ సంఘాలు ఏర్పాటు చేయకతప్పదు.

> పునాది సమస్యలు ముందుగా పరిష్కారం చేసినాకే, ఉపరితలంలో ఉండే కులం, మతం వంటి సమస్యలు పరిష్కరించేందుకు ప్రయత్నించాలనే దురవగాహనను అంబేద్కర్ తనదైన శైలిలో ఆనాటి భారతీయ కమ్యూనిస్టు సిద్ధాంతవేత్తలను ప్రశ్నించారు. మార్క్సిస్టు సిద్ధాంతం ప్రకారం పునాది ప్రధానం, ఉపరితలం అప్రధానం అనీ, పునాది సమస్యను ముందుగా పరిష్కరించిన తర్వాతనే ఉపరితల సమస్య పరిష్కారించాలి అనే దురవగాహనను టి.ఎం.ఎస్ ధిక్కరించారు. కుడి కన్ను, ఎడమ కన్ను అనే అవయువాల వంటివే పునాది, ఉపరితలం అని తేల్చివేశారు. అదే సమయంలో రెండు కళ్ళలో ఒకటి ఎక్కువ, ఒకటి తక్కువ కానట్టే పునాది ఉపరితలం అంశాలు రెండూ సమాన ప్రాధాన్యం కలవేనని ఆయన అవగాహన. ఈ నేపథ్యంలో కులం పునాదిగా పరిగణించాలనే అంశం అర్థంలేనిది. ఎందుకంటే పునాదిగా పరిగణించే ఉత్పత్తి సంబంధాల మార్పు కోసం వర్గ సంఘాల ద్వారానే ప్రయత్నించాలి.

ఇలాంటి సంఘాలన్నీ ఉపరితలం కిందకే వస్తాయి. కాబట్టి పునాది మార్పు కోసం పెట్టే వర్గ సంఘాలు కూడా ఉపరితల అంశాలే. అటువంటప్పుడు పునాది ఎక్కువ, ఉపరితలం తక్కువ అనే ప్రశ్నే ఉత్పన్నం కాదు. ఇలా వాస్తవంగా మార్క్స్ చెప్పని అంశాన్ని తీసుకొని అస్తిత్వవాదులు వివాదాస్పదం చేశారు. మార్క్సిస్టులు కులాన్ని ప్రాధాన్యరహిత ఉపరితలంలో చేర్చడంలో అగ్రవర్ణాల కుట్ర ఉందని విమర్శలు చేశారు. పునాది - ఉపరితలం అంశాల మధ్య సంబంధాన్ని తప్పుడుగా అర్థం చేసుకున్న పర్యవసానంగా 'సోషలిస్టు విప్లవం వచ్చిన తర్వాత కుల వ్యవస్థను రద్దు చేస్తామ'ని కమ్యూనిస్టు పార్టీ నాడు తీర్మానం చేసింది. పునాది సమస్యలు ముందుగా పరిష్కారం చేసినాకే, ఉపరితలంలో ఉండే కులం, మతం వంటి సమస్యలు పరిష్కరించేందుకు ప్రయత్నించాలనే దురవగాహనను అంబేద్కర్ తనదైన శైలిలో ఆనాటి భారతీయ కమ్యూనిస్టు సిద్ధాంతవేత్తలను ప్రశ్నించారు. మార్క్సిస్టు సిద్ధాంతం ప్రకారం పునాది ప్రధానం, ఉపరితలం అప్రధానం అనీ, పునాది సమస్యను ముందుగా పరిష్కరించిన తర్వాతనే ఉపరితల సమస్య పరిష్కారించాలి అనే దురవగాహనను టి.ఎం.ఎస్ ధిక్కరించారు. కుడి కన్ను, ఎడమ కన్ను అనే అవయవాల వంటివే పునాది, ఉపరితలం అని తేల్చివేశారు. అదే సమయంలో రెండు కళ్ళలో ఒకటి ఎక్కువ, ఒకటి తక్కువ కానట్టే పునాది ఉపరితలం అంశాలు రెండూ సమాన ప్రాధాన్యం కలవేనని ఆయన అవగాహన. ఈ నేపథ్యంలో కులం పునాదిగా పరిగణించాలనే అంశం అర్థంలేనిది. ఎందుకంటే పునాదిగా పరిగణించే ఉత్పత్తి సంబంధాల మార్పు కోసం వర్గ సంఘాల ద్వారానే ప్రయత్నించాలి. మార్క్సిజం ప్రకారం మానవ చేతన ప్రమేయంతో ఏర్పడే సామాజిక సంస్థలు, వ్యవస్థలు అన్నీ ఉపరితల అంశాలే. పునాది సమస్యలను కూడా పునాది ప్రాతిపదికన నిర్మితమయ్యే వర్గసంఘాలు అంటే ఉపరితల అంశాల ద్వారానే పరిష్కరించాలి. పునాది సమస్యలను కూడా పునాది ప్రాతిపదికన నిర్మితమయ్యే వర్గసంఘాలు అంటే ఉపరితల అంశాల ద్వారానే పరిష్కరించాలి. పునాది సమస్యలను ఉపరితల అంశాలైన సంఘాలు / సంస్థల ద్వారా పరిష్కరించాల్సి వస్తుంటే ఉపరితలం కంటే పునాది గొప్ప, ప్రధానం అని అనడంలో అర్థమేముంది. పరిష్కార పద్ధతిలో, సామాజిక విప్లవ కార్యాచరణ దృక్కోణంలో చూస్తే పునాది కంటే ఉపరితలానికే అధిక ప్రాధాన్యత ఉన్నట్లు అర్థమవుతుంది. పునాదిగా కాకుండా కులాన్ని ఉపరితల అంశంగా పరిగణిస్తే, అగ్రవర్ణతత్వంతో అలా తక్కువ ప్రాధాన్యత గల అంశంగా కులాన్ని వర్గీకరిస్తున్నారని విమర్శించే అస్తివాదుల వాదనలకు జడిసి కొన్ని విప్లవ పార్టీలు 'కులం అనే సామాజిక అంశం పునాది - ఉపరితలం రెండింటిలో ఉంటుందని లేదా ఆ రెండింటి లక్షణాల్ని కలిగి ఉంటుందని' సూత్రీకరించారు. సమాజమనే భవంతికి పునాది ఉత్పత్తి సంబంధాలలైతే, కులవ్యవస్థ, మత వ్యవస్థ, రాజ్య వ్యవస్థ వగైరాలు ఉపరితలం అనే మార్క్స్ భావనను అంబేద్కర్ ఎన్నడూ తిరస్కరించలేదు. కాకపోతే ఒక భవనాన్ని కూలదోయాలంటే ఉపరితలంపై ఉన్న కట్టడాన్ని, నిర్మాణాన్ని మొదట కూలదోసిగానీ, ఆ భవంతి పునాదిని పెకలించిలేనట్లే కుల వ్యవస్థను ముందుగా కూలదోసి గానీ,

పునాదిగా ఉండే ఉత్పత్తి సంబంధాల వ్యవస్థను కూలదోయలేమని ఆనాటి కమ్యూనిస్టులను అంబేద్కర్ ప్రశ్నించడంలో తప్పులేదు. అయితే పునాది-ఉపరితలం సమస్యల పరిష్కారంలో మార్క్సిస్టు తత్వశాస్త్రం ప్రకారం ఒకటి ముందు మరొకటి వెనుక పరిష్కరించే అంశాలు కాదు. అలాగే వాటిలో ఒక శాశ్వతంగా ఒక ప్రధానం, మరొకటి అప్రధానం ఎన్నటికీ కాదు. పురోగామి శక్తులు రూపొందించుకొనే తాత్కాలిక, దీర్ఘకాలిక కార్యక్రమాలలో పునాది-ఉపరితలం అనే రెండు అంశాలు చారిత్రక సందర్భాన్ని బట్టి తగు ప్రాధాన్యాన్ని సంతరించుకుంటూ కొనసాగుతాయి. అందుకే రెండింటి ప్రాధాన్యతలలో హెచ్చుతగ్గులు లేవనే మార్క్స్ అవగాహనను మరింత స్పష్టంగా అర్థం చేసుకునేందుకు వీలుగా ఉంటుందని 'అవయవి-అవయవ' ప్రతీకను టి.ఎం.ఎస్ ముందుకు తెచ్చారు. అయితే పునాది ఎక్కువ, ఉపరితలం తక్కువ అని మార్క్సిజం చెబుతోందని, అందువల్ల కులాన్ని కమ్యూనిస్టులు ఉపరితలంగా పరిగణించి దాని పరిష్కార ప్రాధాన్యాన్ని కుట్రపూరితంగా పక్కన పెట్టారని అస్తిత్వవాదులు సహా బాలగోపాల్ కూడా ఆరోపించారు. పునాది ఉపరితలం అనే అంశంపై బాలగోపాల్ సహా మార్క్సిస్టులందరిలో కొనసాగుతున్న ఈ దురవగాహన క్రమంగా మార్క్స్ సైద్ధాంతిక పొరపాటుగా, ఆయన సిద్ధాంతంలోని డొల్లతనంగా ప్రచారంలోకి వచ్చింది. ఈ నేపథ్యంలో బాలగోపాల్ మార్క్సిజంలో ఖాళీలున్నాయని ప్రకటించారు. దాంతో అస్తిత్వవాదులకు తెలుగునాట బలం చేకూరినట్లయింది. అలాంటి సందర్భంలో టి.ఎం.ఎస్ ప్రతిపాదించిన 'గతితార్కిక సాహిత్య భౌతికవాదం'లోని పునాది ఉపరితలం సారూప్యతతో ఉన్న విశ్లేషణలోని దోషాల్ని, దాన్ని సవరించి విస్తృతంగా ప్రచారంలోకి తెచ్చినట్లయితే బాలగోపాల్ వంటి వారి మార్క్సిస్టు దురవగాహన పరివ్యాప్తి కాకుండా ఉండేందుకు దోహదపడేది. అదే విధంగా ఆధునికానంతర వాద తాత్విక సాంక్రమిక వ్యాధి (ఇన్‌ఫెక్షన్) నుంచి మేధావులను రక్షించుకునే అవకాశం ఉండేది. పీపుల్స్‌వార్ పార్టీలో ఏర్పడిన అంతర్గత సంక్షోభాల పర్యవసానంగా గందరగోళానికి గురైన విప్లవ శ్రేణులు (విద్యార్థి, మేధో రంగంలోని పనిచేస్తున్న విప్లవవాదులు) టి.ఎం.ఎస్ ప్రతిపాదిత సిద్ధాంతంలోని సవ్యమైన, హేతుబద్ధమైన, శాస్త్రీయమైన అంశాలను గుర్తించడంలో విఫలమైనాయి. అదే సమయంలో హైదరాబాద్ కేంద్రంగా తెలంగాణలో తలెత్తిన అస్తిత్వవాద ఉద్యమాల ప్రభావంతో విప్లవసాహిత్యోద్యమ నేతల్లో పొడసూపిన వ్యక్తివాద, అస్తిత్వవాద పోకడలు వెరసి టి.ఎం.ఎస్ కృషిని ముందు తీసుకెళ్లడంలో అడ్డంకిగా మారాయి. దరహం మీద విప్లవ సాహిత్యకారులు ఈ చారిత్రక అవకాశాన్ని జారవిడుచుకున్నారు.

లెనిన్ కనుగొన్న 'ప్రతిఫలన సిద్ధాంతం' పునాదిగా టి.ఎం.ఎస్ ప్రతిపాదించిన సాహిత్య సిద్ధాంతం వంటి ఉపరితల అంశాల మధ్య సంబంధానికి అన్వయించడంలో కొంత వైఫల్యం ఉంది. 'బాహ్య ప్రపంచం మన ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా మనకంటే స్వతంత్రంగా ఉండే వాస్తవికత. మెదడు, బాహ్య ప్రపంచం రెండు పదార్థాలే. ఈ రెండు అన్యోన్య సంబంధాన్ని క్రియాశీలకంగా, సృజనాత్మకంగా పొందడాన్ని పరావర్తన సిద్ధాంతం' అంటారని టి.ఎం.ఎస్ ఆ వ్యాసంలో రాశారు. భౌతికవాద గతితర్కం ప్రకారం బాహ్య ప్రపంచం (ప్రకృతి+సమాజం) పదార్థమని టి.ఎం.ఎస్ ఆ వ్యాసంలో రాశారు. అంటే సామాజిక పదార్థం, పాదార్థిక సామాజిక సంబంధాలు అనే భావనల గురించిన అవగాహన ఆయన రచనలో అంతర్గర్భితంగా ఉంది. అయినప్పటికీ, సమాజంలోని పాదార్థిక సంబంధాల్లో (ఉత్పత్తి సంబంధాలు, భాషా సంబంధాలు. ప్రాథమిక రూపంలోని కుటుంబ సంబంధాలు వగైరా) ఒకటైన ఉత్పత్తి సంబంధాలతో ఏర్పడిన సామాజిక పునాదిని, సామాజిక ఉపరితల అంశాలను ఒక గాటన కట్టడం ఆయన చేసిన పెద్ద పొరపాటు. పాదార్థిక సంబంధాలు సమాజంలోని మనుషుల మనసుల గుండా ప్రతిబింబించి, వాటిని వారు అర్థం చేసుకున్న తీరులో పరస్పరం సంబంధాల్లోకి వెళతారు, ఆ పరిధుల్లోనే పరస్పరం ప్రతిచర్య జరుపుతారు. ఇలా మానవ చేతన ప్రమేయంతో ఏర్పడిన సామాజిక సంబంధాలు (కులం, మతం, రాజ్యాంగ యంత్ర వ్యవస్థలు, సంస్థలు, రాజకీయ సంస్థల రూపంలోని సంబంధాలు, సామాజిక సమూహాల రూపంలోని సంబంధాలు వగైరా) కూడా భౌతిక సంబంధాలుగా సమాజంలో ఆవిష్కృతమవుతాయి. అంటే ఇనుము అనే పదార్థం నుంచి ఇనుప పరికరాలు, యంత్రాలు, వస్తువులు తయారైన రీతిలోనే సామాజిక పాదార్థిక సంబంధాల నుంచి భావజాల సంబంధాలు, భావజాల వ్యవస్థలు, సంస్థలు రూపొందుతాయి. మానవీకరణకు గురైన సమాజ పాదార్థిక సంబంధాలే భావజాల సంబంధాలు లేదా సామాజిక ఉపరితలం. ప్రకృతిలో స్వతసిద్ధంగా ఉన్న పదార్థాల నుంచి మనిషి తన అవసరాలకు అనుగుణంగా వస్తువులను తయారుచేసుకునే ప్రక్రియను ప్రకృతి మానవీకరణగా పరిగణిస్తాము. అదే విధంగా సామాజిక పదార్థమైన పునాది మానవీకరణకు గురైన ఫలితంగా ఉనికిలోకి వచ్చిన ఉపరితల అంశాలు చారిత్రకంగా పరిణామానికి లోనవుతాయి. ఈ విషయాన్ని గుర్తించలేకపోవడంతో పునాదిని, ఉపరితలాన్ని ఒకే స్వభావంతో కూడిన అవయవాలుగా టి.ఎం.ఎస్ పరిగణించారు. పునాది ఉపరితలంలోని స్వాభావిక భేదాభేదాల్ని, అభిన్నత (ఐడెంటిటీ), అభిన్నరాహిత్యాల్ని (నాన్ ఐడెంటిటీ) గుర్తించడంలో ఆయన విఫలమయ్యారు. ఆయన వైఫల్యం మాట ఎలా ఉన్నా పునాది ఉపరితలం భావన గుర్తించి ఆయన వెల్లడించిన అభిప్రాయాలను తెలుగు సమాజంలో చర్చకు తెచ్చి ఉంటే వాస్తవిక వాద (విప్లవ) సాహిత్యోద్యమం మరింతగా విస్తరించి ఉండేదన్నది వాస్తవం. సకల జీవన రంగాల్లో ఆధిపత్య తాత్విక ధోరణిగా విస్తరించిన ఆధునికానంతరవాద అంటురోగానికి ఒక వ్యాక్సిన్‌లా టి.ఎం.ఎస్ వాదన ఉపకరించి ఉండేది. ఇప్పటికైనా సమాజ బౌద్ధిక రంగంలో ప్రధాన తాత్విక ప్రత్యర్థిగా ఉన్న ఆధునికానంతరవాద ధోరణిని గుర్తించి దాని డొల్లతనాన్ని, యథాస్థితి సమర్థక తత్వాన్ని, పాలకవర్గ పక్షపాతాన్ని ప్రజలకు అర్థం చేయించాలి. టి.ఎం.ఎస్ సృష్టించిన మార్క్సిస్టు తాత్విక సాంప్రదా యానికి మరింత పదును పెట్టాలి. ఆ చారిత్రక కర్తవ్య పరిపూర్తికి పురోగామి సాహిత్య శ్రేణులు ఏ మేరకు పురోగమిస్తాయో...?!

*(అక్టోబర్ 8న త్రిపురనేని మధుసూధనరావు 12వ వర్ధంతి)*

# ఉత్తరాంధ్ర కథల్లో
# ఆర్థిక సరళీకరణలు-ఒక పరిశీలన

జగదీశ్ మల్లిపురం

**తొంభయ్యవ దశకంలో కొత్త ఆర్థిక సరళీకరణలు ప్రారంభమయ్యాయని అనుకుంటే, అప్పటినుంచీ ఉత్తరాంధ్రలో జరిగిన పరిణామాలు ప్రజా జీవితంలో ఎలా ప్రతిఫలించాయోనని ముందుగా పరిశీలించాల్సివుంటుంది. ఉత్తరాంధ్ర భౌగోళికాంశాన్ని చూస్తే అది ఏజెన్సీ, మైదానం, తీర లేదా ఉద్దానం ప్రాంతంగా విభజించవచ్చు. నాగావళి, వంశధారలాంటి పలు నదులతోనూ, దట్టమైన అటవీ, సుదీర్ఘమైన తీర ప్రాంతంతో, ఏ ప్రాంతంలోనూ లేనన్ని వనరులున్న సుభిక్ష ప్రాంతంగా కనపడుతున్న నేలయిది. వనరులున్నాయి కాబట్టి ఇక్కడి ప్రజలు సుఖంగా ఉన్నారనుకుంటే పొరపాటే అవుతుంది.**

వివిధ రకాలైన వృత్తులతో జీవితాన్ని గడుపుతున్న ప్రజలున్నప్పటికీ ఈ ప్రాంతం ముఖ్యంగా వ్యవసాయాధారితం. భూమి, నదులు ప్రధాన వనరు.

తొంభైల దశకంలోనే ఈ ప్రాంతానికి గోదావరి జిల్లా రైతులు వలస రావడం ఆరంభమయ్యింది. వలస వచ్చిన ఈ రైతులు సాధారణంగానే పెట్టుబడే ప్రధాన వనరుగా వచ్చేరు. గోదావరి జిల్లా భూములతో పోల్చుకుంటే తక్కువ రేట్లకే ఇంకా చెప్పాలంటే చవగ్గా లభిస్తున్న ఇక్కడి భూముల్ని సులభంగా కొనడం మొదలు పెట్టింది ఈ కాలంలోనే. వ్యవసాయం అప్పటికే ఖరీదైన వ్యవహారంగామారి, గిట్టుబాటు కాకపోవడంతో ఇక్కడి పేద రైతులు సులభంగానే గోదారి రైతులకు భూముల్ని అమ్ముకున్నారు. కొంత మంది కౌలుకిచ్చి ఆ భూముల మీదే కూలీలుగా మారడమూ ఆరంభమయ్యింది. మరోవైపు వ్యవసాయంలోకి యంత్రాల వాడకం కూడా పెట్టుబడిదారీ వ్యవసాయంతోనే మొదలయ్యింది. భూము లివ్వకుండా వ్యవసాయం చేద్దామనుకునే ఒకరిద్దరు రైతులు ఈ యాంత్రీకరణతో పోటీ పడలేక సంప్రదాయ పద్ధతుల్లో వ్యవసాయం చేయలేక భూముల్ని వదులుకోవాల్సిన ఒకానొక అనివార్య పరిస్థితుల్లోకి నెట్టబడ్డారు ఈ కాలంలోనే. వ్యవసాయానికి దూరమైన రైతులు పొట్ట చేతబట్టుకొని బతుకు కోసం నగరాల వైపు వలస పోవడం ఆరంభమయ్యింది కూడా ఈ కాలంలోనే. వ్యవసాయంలోకి పెట్టుబడి ప్రవేశించాక పేద రైతుల నుంచి భూమి చేజారిపోయి భూమి పరాయీకరణ ఎప్పుడయితే సంభవించిందో రైతుల వలస తప్పనిసరైంది.

ఈ పరిణామాన్ని యథాతథంగా కథా రూపంలో, రికార్డు చేసింది, "తిరుగుడు గుమ్మి" అనే కథలో గంటేడ గౌరునాయుడు గారు. ఆర్థిక సరళీకరణలు ఆరంభమైన తర్వాత ఇక్కడి జీవితాల్లో వచ్చిన మార్పుల్ని రికార్డు చేసిన తొలి కథగా దీనిని పరిగణించ వచ్చు.

స్వాతంత్ర్యానంతరం నెహ్రూ పాలనలో ప్రవేశపెట్టిన పంచవర్ష ప్రణాళికలు అట్టడుగు జీవితాల్లో ఏ మార్పుల్ని చోటు చేసుకున్నాయో, ఆ ప్రణాళికలు ఎవరికి లబ్ధి చేకూర్చాయో అన్న అంశాల్ని చర్చకు పెడుతూ కాళీపట్నం రామారావు మాష్టారి "యజ్ఞం" కథ రావడంతోనే ఆర్థిక సంస్కరణల ప్రభావాన్ని సాహిత్యీకరించడం మొదలయినప్పటికీ ఈ వ్యాస పరిమితి దృష్ట్యా "తిరుడు గుమ్మి" కథనే తొలి కథగా గుర్తించాల్సి వుంటుంది.

ఈ క్రమంలోనే ఉత్తరాంధ్ర జీవితాల్లో పెను మార్పులు సంభవించాయి. డబ్బు సంపాదనే కీలకంగా మారడం, మానవ సంబంధాలు విచ్ఛిన్నమవడం, విలువలు తగ్గిపోవడం సహజంగానే చోటుచేసుకున్నాయి. ఈ నేపథ్యాలలోంచే "నరాలు తెగుతున్న నేల', 'భూమిపుండు', 'ఒక రాత్రి-రెండు స్వప్నాలు','వలస పక్షి' లాంటి కథలు ఈ రచయిత నుంచే వచ్చాయి.

ఇదే నేపథ్యాలలోంచి మరింత విస్తృతంగా రాజకీయ కోణంలోంచి అట్టాడ అప్పల్నాయుడు గారి నుంచి కథలు వచ్చేయి. భూముల్ని అమ్ముకోవాల్సిన తప్పని సరి పరిస్థితిలో రైతుపడే వేదననీ, మానసిక సంఘర్షణనీ "క్షతగాత్ర గానం" కథలో చిత్రిస్తే, పసుపుకుంకాలకని ఆడపిల్లకు రాసిచ్చిన భూమిని కోల్పోయే పరిస్థితిని చిత్రించిన కథ "మమకారం". ఆరుగాలం కష్టించి, పంటను సృష్టించే రైతుకి కోటాబియ్యం కోసం ఎదురు చూసే దుస్థితిని చెప్పే కథ "ప్రత్యామ్నాయం".

ఈ నేల మీదికి రైతు స్థానంలోకి కొత్త పెట్టుబడి రైతు వచ్చినట్టే మిగతా పాత్రల్లోకి కూడా కొత్త పెట్టుబడీ దారులు అడుగుపెట్టేరు. బ్రాందీ షాపులు, కొత్తకొత్త షాపింగ్ మాల్ల యజమానులు ఇక్కడి వారి స్థానంలోకి కొత్తవాళ్లొచ్చారు. ఆఖరికి శాసనాలు చేసే రాజకీయ నాయకుల్లో కూడా ఇక్కడి వాళ్ల స్థానంలోకి కొత్తవాళ్లొచ్చారు. ఇక్కడి వాళ్లపై అజమాయిషీ ఈ ప్రాంతం పై పెత్తనం మెల్లమెల్లగా వాళ్ల చేతుల్లోకి మారిపోయే క్రమం ఒకటి ఆరంభమయ్యింది. ఈ పరిస్థితి ఎంతదాక విస్తరించిందంటే ఇక్కడి ప్రధాన వనరైన జంఝావతి నీటిని ఇతర

ప్రాంతాలకు తరలించుకుపోయే కుట్ర ఒకటి కంటికి కనిపించకుండా చాపకింద నీరులా జరిగిపోతున్న స్థితి. దీనిని ముందుగానే పసిగట్టింది. ..."షా!" కథ. ఈ కథ ఉత్తరాంధ్ర రాజకీయ,సామాజిక పరిస్థితుల్నీ, ఈ ప్రాంతం పై పాలకుల కుట్రల్నీ కళ్లకు కట్టినట్టు చూపుతుంది.

ఈ కాలంలోనే మధ్యతరగతి జీవితాల్లో విలువలు పడిపోవడం, కుటుంబాలు విచ్ఛిన్నమవడం, స్త్రీపురుషుల మధ్య అంతరాలు పెరిగిపోవడం చోటుచేసుకోవడం, మానవ సంబంధాలకు కొత్త అర్థాలు వెతుక్కోవడం ఆరంభమయ్యింది. ఈ మధ్యతరగతి మానసిక సంఘర్షణనీ, స్త్రీల కోణం లోంచి రాసి స్త్రీవాదానికి కొత్త ఊపుని తీసుకొచ్చిన రచయిత బమ్మిడి జగదీశ్వరరావు. రెక్కల గూడు, తెగిన గొళ్లాలు, మట్టితీగలు, దూరానికి దగ్గరగా, పిండొడిం లాంటి కథల సంపుటాలతో చర్చకు పెట్టారీ రచయిత. "ఎర్రకలువ" లాంటి కథల్లో ఉద్యమంలో స్త్రీల నిర్వహణా బాధ్యతలు చేపట్టి ముందుకు నడిపిన తీరు తెన్నుల్ని చూపిస్తారీ రచయిత.

మరో వైపు ఏజెన్సీ ప్రాంతం ఉద్యమానంతర కొత్త జీవితాన్ని చూస్తూ వచ్చింది. పునరావాసం కోసం ఐ.టీ.డీ.ఏలు అవతరించి కొత్త పథకాలతో అడవిలోకి అడుగుపెట్టాయి. విల్లంబులు పట్టిన గిరిజనుడిని ఉద్యోగస్తునిగా మార్చింది ప్రభుత్వం. చదువుకున్న ఆడపిల్లల్ని వెతికి మరీ ఉద్యోగంలో చేర్చింది. కొండల్లోకి టీవీలు ఫ్రిజ్‌లు మెల్ల మెల్లగా అడుగుపెట్టిన కాలమది. అదే సమయంలో గిరిజనేతరులు జీతాలు తెచ్చుకుంటున్న గిరిజన స్త్రీలను మాయమాటలు చెప్పి రెండో భార్యగా వుంచుకుని వారి ద్వారా ప్రభుత్వ పథకాలను అనుభవించడమూ ఆరంభమయిన కాలం కూడా ఇదే. గిరిజనులను పథకాల పేరుతో వంచించే కొత్త తరమొకటి అవతరించిన సందర్భమూ ఇదే. ఆ రోజు షావుకారి,సొండోడు మోసం చేస్తే ఈ రోజు మరొకడొచ్చి మోసం చేస్తున్నాడు... మోసపోవడం మాత్రం తప్పలేదని సగటు ఆదివాసీ గుర్తించిన కాలమూ ఇదే.

ఈ నేపథ్యంలో "అడివంటుకుంద'ని మండుతున్న ఉద్యమాన్ని అక్షరబద్ధం చేసిన భూషణం మాష్టారు "కొండగాలి "తరువాత కొంతకాలం మౌనంగా వుండి,"కొత్తగాలి" సంగతుల్ని చెప్పారు. ఆ సంగతుల్ని అందుకుని గిరిజన జీవితాన్ని ఉద్యమ నేపథ్యంలోంచి స్వీయానుభవాలతో అక్షరీకరించడానికి తెరమీది కొచ్చిన రచయిత "సువర్ణముఖి". ఉద్యమానంతరం గిరిజన జీవితాల్లో చోటు చేసుకున్న మార్పులు, పునరావాసం పేరుతో గిరిజనుల్ని దోచుకుంటున్న తీరుతెన్నుల్ని "తెంపు', గోరపెట్ట', సుక్కి" లాంటి కథల్లో బలంగా చెప్పారు సువర్ణముఖి.

ఈ కాలంలోనే గ్రామ స్వరూపాలు కూడా మారి కొత్త రూపాల్ని సంతరించుకున్నాయి. గ్రామాల్లోకి రాజకీయాలు ప్రత్యక్షంగా ప్రవేశించిందీకాలంలోనే. గ్రామీణ ప్రజలు పార్టీల మనుషులుగా విడిపోయిన కాలం కూడా ఇదే. అప్పటికే సంస్థానాల అధికారాలు చేజారిపోయిన రాజుల లోగిళ్ల లొసుగుల్ని వ్యంగ్య వైభవంతో చెప్పిన గొప్ప రచయిత పతంజలి గారు. రాజ్య హింస గ్రామాల్లో ఏవిధంగా మనుషుల్ని విడదీస్తుందో, వ్యవస్థ తీరుని ఎండగడతారు తన రచనల్లో "పిలకతిరుగుడు పువ్వు", "వీరబొబ్బిలి", చూపున్న పాట లాంటి రచనల్లో కళ్లకు కట్టినట్టు వివరిస్తారు పతంజలి గారు.

తొంభైల తరువాత దశకం తరువాత గిరిజన జీవితాల్లో కొత్త మార్పులకు లోనయ్యింది. ఆ కాలంలోనే ఆదిమ సంస్కృతి నుంచి దూరమవడం ఎక్కువయ్యింది. దానికి ప్రధాన కారణం అడవిలోకి కొత్తగా క్రిస్టియన్ మతం అడుగు పెట్టింది. అంతకంటే ముందు హిందూ మతం అడవిలోకి అడుగు పెట్టినా పెద్దగా గిరిజన సంస్కృతీ సంప్రదాయాల మీద ప్రభావం చూపలేకపోయింది. కానీ క్రిష్టియన్ మతం మరింత అప్రమత్తంగా వచ్చి ఆ పనిని సమర్థవంతంగా చూపగలిగింది. వ్యాప్తి ప్రధానంగా ఈ మతం గిరిజనుల్ని గిరిజన జీవితం నుండి దూరం చేసింది. ఈ మార్పుని గుర్తించి "గాయం" "శిలకోల" కథా సంపుటాలతో కథకుడిగా సాహిత్య లోకంలోకి అడుగు పెట్టినవాడు మల్లిపురం జగదీశ్. గిరిజన కథ అనగానే విప్లవ కథగానే ముద్రపడిపోయిన సందర్భం నుంచి వేరుపడి కొండ శిఖరాల మీద ఇప్పటి గిరిజన జీవితం దోపిడీ కాబడుతోందీ, ఆ దోపిడీ కొత్త స్వరూపాలు ఏమిటీ, సాంస్కృతిక కాలుష్యం ఎలా వ్యాప్తి చెందిందీ అనే అంశాల్ని చెప్తాడీ రచయిత. "టిహిలికి పెల్లి" బాకుడుంబారి" కలలు కాలుతున్న వాసన లాంటి కథల్లో కొత్త మార్పులు పొందిన గిరిజన జీవితాన్ని చర్చకు పెడతాడీ రచయిత.

ఈ నేపథ్యంలోనే బమ్మిడి జగదీశ్వరరావు తప్ప ఈ ప్రాంత స్త్రీల జీవితం రాసే రచయితలు లేరనుకునేలోటును పూరించినవాళ్లు కె.ఎన్. మల్లీశ్వరి, కమలకుమారి. "ఒడుపెరిగిన దాయి" కథలో బాధ పడే విషయంలో స్త్రీలందరూ ఒకటేనని కె.ఎన్. మల్లీశ్వరిచెప్తే. కమలకుమారిగారు ఉత్తరాంధ్ర స్త్రీల గోస ఇది అని మాండలిక సొగసుతో చెప్పారు "గోస" కథలో. నగరజీవితంలో స్త్రీలు ఎలా హింసలు పడుతున్నదీ సీతారత్నంగారు తన కథలో చెప్తారు.

ఈ సందర్భంలో శ్రీకాకుళ సాహితి, శ్రీకాకుళం, స్నేహ కళాసాహితి, కురుపాంలాంటి సాహిత్యసంస్థల కృషిని తప్పక స్మరించాల్సి ఉంటుంది. ఎందుకంటే ఈ సంస్థలు ప్రచురించిన పుస్తకాలు ఎందరో కొత్త రచయితల్ని పరిచయం చేసాయి. నాగావళి కథలు, వంశధార కథలు, జంఝూవతి కథలు, వేగావతి కథలు అని ఈ ప్రాంత నదుల పేరుతో కథా సంకలనాలను శ్రీకాకుళ సాహితి ప్రచురించింది. స్నేహకళా సాహితి కూడా "బడికథలు",'నకరఘునకరి నాం..నాం..','శిలకోల"లాంటి పుస్తకాలను ప్రచురించి తన బాధ్యతను నెరవేర్చింది.

నదుల్లోంచి ఇసుకను కాంట్రాక్టర్లు తవ్వుకుని పోవడం వల్ల నీరు పారినపుడు మునిగి ప్రాణాలు కోల్పోతున్న నదిఒడ్డు జీవితాల్ని అక్షరబద్ధం చేస్తూ దాసరి రామచంద్రరావు "పిడికిట్లో ఇసక" కథ నాయకుల పాలనలోని డొల్లతనాన్ని వివరిస్తుంది. చిల్లర వ్యాపారాలు చేసుకుంటూ బతుకు బండిని నెట్టుకొస్తున్న బడుగు జీవితాలపై పెట్టుబడి దారులొచ్చి తమ పొట్టనెలా కొట్టుకు పోతున్నదీ పాలకొల్లు రామ లింగేశ్వర స్వామి తన "కవుకు దెబ్బలు" కథలో చర్చిస్తారు. కవిగా ప్రయాణం మొదలుపెట్టి కథలూ రాసిన చింతా అప్పలనాయుడు "నకజనకరి నాం నాం" కథలో దళిత స్త్రీ తన

బతుకు కోసం డప్పు కొట్టిన దృశ్యం పాఠకుల్ని కదిలిస్తుంది. ప్రాజెక్టుల నిర్మాణం జరుగుతున్న ఈ కాలంలో పునరావాసమూ, నష్టపరిహారమూ కొత్తగా పుట్టుకొచ్చిన పదాలు. ఇచ్చిన డబ్బులు ఇళ్ల నిర్మాణానికి చాలక, మునిగిపోతున్న ఊళ్లను వొదల లేక చచ్చి బతుకుతున్న ఊళ్లు కొన్ని వున్నాయి. ఈ పరిస్థితిని మన కళ్ల ముందుంచు తారు చందనపల్లి గోపాలరావు తన "వరదగోస" కథలో. రైతులు పంట కోల్పోయినపుడు ప్రభుత్వాలు నష్టపరిహారం ఇవ్వడం ఆనవాయితీ. కానీ అది ఎంత ఇవ్వాలి? ఎప్పుడివ్వాలి? రైతు పెట్టుబడికి దానికీ ఏమైనా సంబంధముందా అన్న అంశాల్ని వల్ల రోహిణీ కుమార్ తన "పరిహార నష్టం" కథలో

*తొంభైల దశకంలోనే ఈ ప్రాంతానికి గోదావరి జిల్లా రైతులు వలస రావడం ఆరంభమయ్యింది. వలస వచ్చిన ఈ రైతులు సాధారణంగానే పెట్టుబడే ప్రధాన వనరుగా వచ్చేరు. గోదావరి జిల్లా భూములతో పోల్చుకుంటే తక్కువ రేట్లకే ఇంకా చెప్పాలంటే చవగ్గా లభిస్తున్న ఇక్కడి భూముల్ని సులభంగా కొనడం మొదలు పెట్టింది ఈ కాలంలోనే. వ్యవసాయం అప్పటికే ఖరీదైన వ్యవహారంగామారి, గిట్టుబాటు కాకపోవడంతో ఇక్కడి పేద రైతులు సులభంగానే గోదారి రైతులకు భూముల్ని అమ్ముకున్నారు. కొంత మంది కౌలుకిచ్చి ఆ భూముల మీదే కూలీలుగా మారడమూ ఆరంభమయ్యింది. మరోవైపు వ్యవసాయంలోకి యంత్రాల వాడకం కూడా పెట్టుబడిదారీ వ్యవసాయంతోనే మొదల య్యింది. భూము లివ్వకుండా వ్యవసాయం చేద్దామనుకునే ఒకరిద్దరు రైతులు ఈ యాంత్రికరణతో పోటీ పడలేక సంప్రదాయ పద్ధతుల్లో వ్యవసాయం చేయలేక భూముల్ని వదులుకోవాల్సిన ఒకానొక అనివార్య పరిస్థితుల్లోకి నెట్ట బడ్డారు ఈ కాలంలోనే. వ్యవసాయానికి దూరమైన రైతులు పొట్ట చేతబట్టుకొని బతుకుకోసం నగరాల వైపు వలస పోవడం ఆరంభమయ్యింది కూడా ఈ కాలంలోనే. వ్యవ సాయంలోకి పెట్టుబడి ప్రవేశించాక పేద రైతుల నుంచి భూమి చేజారిపోయి భూమి పరాయీకరణ ఎప్పుడయితే సంభవించిందో రైతుల వలస తప్పనిసరైంది.*

చర్చకు పెడతాడు. చింతాడ తిరుమల రావు తన కథల్లో శ్రీకాకుళం జిల్లా మాండలికాన్ని యథాతథంగా పలికించడం మనం చూస్తాం.

ఈ కథల్ని నిశితంగా పరిశీలిస్తే పాతికేళ్లలో ఉత్తరాంధ్ర జనజీవితాల్లో వచ్చిన మార్పుల్ని స్పష్టంగా చూడగలుగుతాం. సరళీ కరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణలు (ఎల్.పీ.జీ) అమల్లోకొచ్చిన తరువాత అన్ని వర్గాల జీవితాల్లో కల్లోలం, సాంకేతిక వల్ల కలిగిన అలజడి, అణగారిన వర్గాల ఆశలు, ఆకాంక్షల్లో వచ్చిన తేడాలు స్పష్టంగా దర్శనమిస్తాయి.

మరోవైపు ఈ ప్రాంతాన్ని కోస్టల్ కారిడార్‌గా ప్రకటించిన తరువాత కొత్తకొత్త బడా కంపెనీలు ఇక్కడికి రావడం ఆరంభమైంది. కొవ్వాడ, కోటిపాం, పరవాడ, రణస్థలంల్లో థర్మల్ అణు విద్యుత్ కేంద్రాల నిర్మాణం ప్రారంభించాయి. ఉపయుక్తమైన గిరిజన యూనివర్శిటీ నిర్మాణం కంటే ముందుగా భోగాపురం అంతర్జాతీయ విమానాశ్రయం భూముల సేకరణ వేగంగా జరిగి పోయింది. ఇవేవీ ఇక్కడి ప్రజల అవసరాలకు అనుగుణమైనవి కాదు. ఈ నేపథ్యంలోంచే సోంపేట ఘటన చోటుచేసుకుంది. ఇది శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరాటం తరువాత మళ్లీ అంతటి ప్రాముఖ్యతను పొందిన ఘటనగా చోటుచేసుకుంది. దాని తరువాత విశాఖ ఏజెన్సీ బాక్సైట్ పోరాటం. ఈ రెండు పోరాటాలతో ప్రభుత్వం కాస్త వెనక్కి తగ్గింది. కానీ రేపు మళ్లీ దోపిడీ దాడుల్ని చేసి కొత్త దారుల్ని వెతక్కపోదు. వాటినెదుర్కోడానికి ఇక్కడ ప్రజలు సమాయత్తవడం ప్రశ్నార్థకమే. ఈ నేపథ్యాలను సాహిత్య రూపంలోకి మార్చడానికి సాహిత్యకారులు కాస్త వెనకబడ్డట్టే కనిపిస్తుంది. అట్టాడ అప్పల్నాయుడుగారి "సంధిగ్ధాకాశం", 'వికృతి', 'బీల' లాంటి కథలు రెడ్డి రామకృష్ణ గారి 'బీల- భూమి' లాంటి కవిత్వం తప్ప ఇంకేవీ రాలేదు.

ఉత్తరాంధ్ర సాహిత్యం జరుగుతున్న పరిణామాల్ని రికార్డు చెయ్యడంలో వెనకబడిందని చెప్పలేము కానీ రావాల్సిన సాహిత్యం తగినంతగా రావడం లేదన్నది నిజం. దానికి ఉదాహరణలుగా చెప్పుకోవాల్సి నవి ఈ ప్రాంతం నుండి తీరప్రాంత కథ ఇంకా ప్రారంభం కావాల్సే ఉంది. రాష్ట్రవిభజనా నంతరం పాలకుల కళ్లు తీర ప్రాంత ఇసుకలో దాగివున్న ఖనిజాలపై పడడం, చేపల వేట మీద ఆంక్షలు విధించడం వంటి సంఘటనలు ఇటీవల కాలంలో జరుగుతున్న మత్స్యకారుల జీవితాల్లో చోటుచేసుకున్న పరిణామాలు. ఇవి పూర్తిస్థాయిలో సాహిత్యంలోకి తన ఉనికిని చాటుకో వాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఈ ప్రాంతం నుండి మరో అలజడి రేపిన అంశం భోగాపురం భూముల సేకరణ. విశాఖకు కూతవేటు దూరంలో వున్న భోగాపురంలో ఎవరి ప్రయోజనాల కోసం ఈ విమానాశ్రయం? అనే సగటు మనిషి ప్రశ్న ఇంకా కథా రూపంలోకి రావాల్సే ఉంది. ఇక్కడి ప్రజలకు అవసరంలేని థర్మల్, అణు విద్యుత్‌కేంద్రాలు, అధిక కాలుష్య కారకాలైన మందుల ఫ్యాక్టరీలు ఇక్కడకు వస్తున్నాయి కానీ అవసర మైన ప్రాజెక్టులు, సుజల స్రవంతి లాంటి పథకాలు మూలపడి ఉన్నాయి. దీన్ని బట్టి పాలకులకు ఇక్కడి ప్రజలమీద ప్రేమ ఎంత ఉన్నదీ అర్థమవుతూనే వుంది. ఈ పరిస్థితిని చెప్పే కథలు ఇంకా బలంగా రావాల్సిన అవసరం వుంది. మరో వైపు దళిత, స్త్రీవాద రచనలు ఈ ప్రాంతం నుండి స్వీయానుభవాలుగా రావాల్సిన అవసరం ఇంకా ఉంది, ఖాళీలు పూర్తి కావాల్సే ఉంది. చేతి వృత్తుల వారి జీవితాలు అతలాకుతలమైపోయాయి. శిథిలమైపోయిన గ్రామీణ జీవితం ఇదంతా నేటి వాస్తవ సమాజ చిత్రం. దీన్ని విషాదంగా చూడాలా? లేదా భూముల్ని తనఖా ఇచ్చేసి నగరాల్లో ఫ్యాక్టరీల్లో కూలి పనివాళ్లుగా మారిపోయిన రైతుల చేతుల్లో నాలుగు డబ్బులు పడుతూ... 'అప్పుడు కంటే ఇప్పుడే బాగుంది' అని అంటున్న రైతుల మాటల్లోని గాంభీర్యతని అర్థం చేసుకోవాలా? అన్ని ప్రాంతాల నుండి వస్తున్నట్లు గానే కొత్తతరం కలం పట్టాల్సిన సమయమైతే వచ్చేసింది. రచయితలు ఒక అంశాన్ని పట్టుకునే లోగానే మరో అంశం ప్రజల జీవితాల్లోకి వచ్చి అతలాకుతలం చేసేస్తోంది. రచనల వేగాన్ని, విస్తృతినీ సమాజం క్షణక్షణమూ ప్రశ్నిస్తూనే ఉంది. దానికి సమాధానం రచయితల వద్ద ఉందనే ఆశ వుంది.



# 'చరిత్ర మార్చిన మనిషి' గురించి..

పి. అరవింద

**బొజ్జా తారకం గారు తన తండ్రి బొజ్జా అప్పలస్వామి గారి జీవిత చరిత్రని 'చరిత్ర మార్చిన మనిషి' అనే పేరుతో పుస్తకంగా రాసారు. దేశం నలుమూలల్లో దళితుల మీద దాడులు తీవ్రమవుతున్న ఈ తరుణంలో ఈ పుస్తకం ఆంధ్రాలో, ముఖ్యంగా గోదావరి జిల్లాల్లో దళితుల జీవితాలు దాదాపు ఒక శతాబ్దం మీద ఎటువంటి మార్పులు చెందాయో, వాళ్లు తమ మీద దాడులని ఎలా ప్రతిఘటించారో, దళితుల రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిణతి ఎటువంటిదో తెలుపుతూ ఈనాటి పరిస్థితులకి కొన్ని విలువైన పాఠాలు నేర్పుతుంది.**

ఈ పుస్తకం 1840-50 ల ప్రాంతాల్లో బొజ్జా వారి కుటుంబం గోదావరి జిల్లా, అమలాపురం తాలూకా, కందికుప్ప గ్రామం లో స్థిర పడడంతో మొదలై, అప్పలస్వామి గారి పూర్వీకులైన బొజ్జా పద్మయ్య, తమ్మయ్యలు, ఆయన పెదనాన్న భైరవస్వామి గురించి సంక్షిప్తంగా ప్రస్తావించి, తండ్రి గోవిందు జీవితం నుంచి వివరాల్లోకి వెళ్తుంది. బొజ్జా గోవిందు, అప్పలస్వామి గార్ల జీవితాల చిత్రీకరణలో తారకం గారు గోదావరి జిల్లా దళిత జీవితాల రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక పార్శ్వాలపై, కులాల మధ్య సంబంధాలు, అంబేడ్కర్ ప్రభావం, వివిధ రాజకీయ పార్టీలు - నిర్మాణాలు మొదలైన అంశాలపై విలువైన సమాచారాన్నిచ్చారు. వాటిలో కొన్ని ముఖ్యమైన వాటి గురించి క్లుప్తంగా పరిచయం చేస్తాను.

1852 ధవళేశ్వరం ఆనకట్ట నిర్మాణంతో గోదావరి పరీవాహక ప్రాంతం లో వ్యవసాయం లో వచ్చిన మార్పులు కరువు ప్రాంతంగా ఉన్నదాన్ని సస్యశ్యామలం చెయ్యడమే కాకుండా, కొత్త పంటలని ఆ ప్రాంతానికి తీసుకు వచ్చాయి, దానితో పాటే రైతులకి వ్యవసాయం లో వచ్చే లాభాలు పెంచాయి. నీటి పారుదల సమృద్ధిగా ఉండడం తో, దళితులు కూడా కొంత భూమిని సాగులోకి తెచ్చి, రైతులుగా మారడానికి ఈ ఆనకట్ట ఎంతగానో దోహద పడింది. అట్లాగే గోదావరి రేవులకి రంగూన్‌కి మధ్య నడిచిన వ్యాపార సంబంధాలు దళిత జీవితాల్లో పెద్ద మార్పులు తెచ్చాయి. రంగూన్ వెళ్లి వ్యాపారాలు చేసి డబ్బు బాగా సంపాదించిన దళితులు కొద్ది మంది గోదావరి జిల్లాలో ఉన్నారు. వాళ్లు రంగూన్ లోనే కాక, తమ ఊళ్లలో కూడా ఆస్తులు పెంచుకుని, ఇతర దళిత కుటుంబాలకి వాళ్లు చెయ్యగలిగిన సాయం చేసారు. వాళ్లలో కొంత మంది ఊళ్లలో దళిత విద్యార్థుల కోసం స్కూళ్లు స్థాపించి, హాస్టళ్లు నడిపించి విద్య ఎక్కువ మందికి అందేలా చేసారు. ఇంకొంత మంది తాము నేర్చుకున్న కొత్త నైపుణ్యాలని ఊళ్లో ఇతర దళితులకి నేర్పారు. బ్రిటీషు పాలనలో వచ్చిన మార్పుల వలన కూడా దళిత జీవితాల్లో ప్రముఖమైన మార్పులు వచ్చాయి - ఉదాహరణకి రైల్వేలు కల్పించిన ఉద్యోగావకాశాలు, రవాణా సౌకర్యాలు దళితులు కొత్త స్థలాల్లో, రంగాల్లో పని చెయ్యడానికి అవకాశాలు కల్పించాయి. అట్లాగే, విద్యలో, ఉద్యోగాల్లో రిజర్వేషన్లు కొత్త అవకాశాలని దళితులకి కల్పించాయి.

ఆంధ్రాలో సంఘ సంస్కరణ ఉద్యమాలు బలంగా సాగిన స్థలాలు కాకినాడ, పిఠాపురం, రాజమండ్రి. వీటన్నిటి ప్రభావం అప్పలస్వామి గారి మీద ఉంది. పిఠాపురం రాజు వెలమ, ఆయన దళిత పిల్లల కోసం పిఠాపురం లో స్కూలు, ఆశ్రమాలు పెట్టారు. ఆయన దివాన్ సుబ్బారాయుడు బ్రాహ్మణుడు, ఆ స్కూలుకి కార్యదక్షత వహించి పిల్లలని అభిమానంతో క్రమశిక్షణతో చూసుకున్నారు. దేవులపల్లి కృష్ణ శాస్త్రి ఆ స్కూలు పిల్లలకి ప్రేమతో పాటలు నేర్పుతూ వాళ్లతో పాటుగా తిరిగేవారు. రఘుపతి వెంకటరత్నం నాయుడు పిఠాపురంలో, కాకినాడలో అంటరానితనానికి వ్యతిరేకంగా గాంధీ కంటే ఎంతో ముందే ఉద్యమించారు. పిఠాపురంలో చదువుకునే రోజుల్లో బొజ్జా అప్పలస్వామి గారిపై వీళ్లందరి ప్రభావం ఉంది. ఆయన ఉపాధ్యాయ వృత్తికి ట్రెయినింగ్ కోసం రాజమండ్రి కాలేజీలో చేరినప్పుడు, కంభంపాటి రామశాస్త్రి గారింట్లోనే ఎక్కువగా ఉండేవారు. కంభంపాటి రామశాస్త్రి గారినే తారకం అనేవారు, ఆయన ప్రభావం అప్పలస్వామి గారి పై ఎంతో ఉంది.

ఈ పుస్తకంలో కనిపించే ముఖ్యమైన సాంస్కృతిక మార్పు దళిత విద్య కి సంబంధించినది. ముఖ్యంగా పిఠాపురంలో దళిత పిల్లలు చదువుకొని, చాలా మంది ఉపాధ్యాయులయ్యారు. ఇంకొంత మంది ఉన్నత చదువులు చదివి పెద్ద ఆఫీసర్లయ్యారు. పిఠాపురంలో చదివిన పిల్లలమీద బ్రహ్మసమాజ ప్రభావం చాలా ఉంది. కొత్తగా ఉపాధ్యాయులైన దళితులు తమ కులాల్లోని పిల్లలని చదువుకొనేందుకు బాగా ప్రోత్సహించే వారు. వ్యాపారాల్లో బాగా డబ్బు సంపాదించిన మాలలే స్వయంగా స్కూళ్లు, హాస్టళ్లు పెట్టి నడిపారు. ఇంకొక పెద్ద మార్పు దళిత వేషభాషలకి



సంబంధించినది. అప్పట్లో ఊళ్లలో అగ్రవర్ణాల వారు దళిత స్త్రీలని రవికెలు వేసుకోనిచ్చే వారు కాదు, దళితులని ఉదయమే స్నానాలు చేయనిచ్చే వారు కాదు. బొజ్జా గోవిందు గారు కందికుప్ప, చుట్టు పక్కల గ్రామాల్లో ఇవన్నిటిని మార్చారు.

ఈ పుస్తకంలో తారకం గారు కులాల మధ్య సంబంధాలని చాలా వివరంగా రాసారు. దళిత పిల్లలు చదువుకోకుండా వాళ్లని పాలేర్లుగానూ, పశు కాపర్లుగానూ ఉండిపోయేట్టు చెయ్యడానికి అగ్రవర్ణాల వారు వేసే ఎత్తులు, స్కూళ్లో దళిత విద్యార్థులని క్లాసు బయట కూర్చోబెట్టి చదువు చెప్పడం, వాళ్ల నీళ్ల కుండ విడిగా పెట్టడం, టీచర్లు కనీసం వాళ్ల పేపర్లని ముట్టుకోకుండా దిద్దడం లేదా దిద్దకపోవడం, పడవలో గోదావరి దాటేటప్పుడు కూడా ఇతర కులాల వాళ్లు లేకపోతేనే దళితులని పడవ ఎక్కనివ్వడం, ప్రభుత్వ బస్సుల్లో సైతం దళితులని కూర్చోనివ్వకపోవడం, బ్రాహ్మణ, ఇతర అగ్రవర్ణ స్త్రీలు నీటికోసం చెరువు దగ్గరికి వెళ్లినప్పుడు దళితులు ఆ తోవలో రాకూడదనడం .... ఇట్లా ఎన్నో విషయాలు రాసారు. కింది కులాల మీద ఇంత వివక్ష ఉందా అని నగరాల్లో పెరిగి, కులం అనేది దేశంలో ఎప్పుడో పోయిందనే అపోహలో ఉండే పైకులాల వాళ్లు ఆశ్చర్యపోయేట్టుగా ఉంటాయి ఆయన రాసిన విషయాలు.

ఐతే కుల వివక్షే కాకుండా, ఈ పుస్తకం వివక్షకి వ్యతిరేకంగా జరిగిన పోరాటాల గురించి, కుల వ్యవస్థని బద్దలు కొట్టడానికి జరిగిన అనేక ప్రయత్నాల గురించి కూడా చాలా సమాచారాన్నిస్తుంది. చాలా ఆసక్తికరంగా అప్పట్లో బ్రాహ్మలు, మాలల మధ్య కులాంతర వివాహాలు కూడా కొన్ని జరిగి ఆదర్శ వివాహాలుగా నిలిచాయి. ఇవి చాలా తక్కువే ఐనా, మంచి ప్రేరణగా నిలిచాయి. బొజ్జా గోవిందు గారి శిష్యులు అన్ని కులాలకి చెందిన వారు ఉండడంతో వారు సహపంక్తిలో భోజనం చెయ్యడం, కలిసి కూర్చుని భజన చెయ్యడం లాంటివి చేసేవారు.

బస్సులో దళిత పిల్లలని ఎక్కనివ్వక పోవడం పై అప్పలస్వామి ఇంకొంత మంది పిల్లలు పోలీస్ స్టేషన్లోనూ, ఆ ఊళ్లో రాజకీయ నాయకులతోనూ ఫిర్యాదు చెయ్యడం, దానిపై బస్సు డ్రైవర్ ని, కండక్టర్ ని పోలీసులు మందలించి ఫైన్ వెయ్యడం ఒక గొప్ప మొదటి విజయం. అమెరికాలో నల్ల జాతి వాళ్లని బస్సుల్లో ఎక్కనివ్వక పోతే వారు చేసిన పోరాటం లాంటిదే ఇది. దళితులలో చైతన్యం పెరిగిన కొద్దీ, వాళ్లు రాజకీయంగా సంఘటితమైన కొద్దీ కోనసీమ లోని కొన్ని ఊళ్లలో దళితులు ఏకమై అగ్రకులాల దాడులని తిప్పికొట్టడం మొదలు పెట్టారు. అంతే కాకుండా, తెగువ, బలం ఉన్న కొంత మంది దళిత యువకులు అగ్రవర్ణానికి చెందిన భూస్వాములపై దాడులకి దిగారు - పెద్దపులి, చిన్నపులి అని ప్రజలు ప్రేమతో పిలుచుకునే దళిత యువకులు ఈ కోవకి చెందినవాళ్లే. దళితుల నుంచి ఈ రకమైన ప్రతి దాడులు జరిగిన ఊళ్లలో అగ్రకులాల సామూహిక దాడులు చాలా మటుకు తగ్గాయి. ఈ దాడుల రూపంలోనే కాక, ప్రతిఘటన వేరే రూపాలు కూడా తీసుకుంది. దళితులకి ప్రత్యేక స్థలాలు కేటాయించడానికి, ఊళ్లలో అంటరానితనానికి, టీచర్స్ ఫెడరేషన్ సభలలో దళితులని విడిగా కూర్చోపెట్టడానికి, ఆస్పత్రిలో డాక్టర్లు దళితులని సరిగ్గా చూడకపోవడానికి వ్యతిరేకంగా చర్యలు తీసుకోవడం, మంచి నీటి బావులు దళితులు కూడా వాడుకునేలా చూడడం, భూమి కోసం, ఉద్యోగాల కోసం పోరాటాలు సాగించడం, ఆత్మాభిమానానికి ప్రతీకగా హుందాగా బట్టలు ధరించడం - ఇవన్నీ విభిన్న ప్రతిఘటనా రూపాలే.

అంబేద్కర్ గురించి ఆంధ్రాలో తెలియక ముందు నుంచి కూడా దళిత ఉద్యమం ఉన్నా, ఆయన ప్రభావం దేశంలో మిగతా చోట్ల ఉన్నట్టే ఆంధ్రా లో కూడా చాలా ఉంది, ముఖ్యంగా కోనసీమలో. అంబేద్కర్ దళితుల ఆత్మాభిమానం, చదువు, ఉద్యోగాలు, భూమి కోసం పోరాటం సాగించారు. గాంధీ ని ఎదుర్కొన్న ఏకైక నాయకుడాయన, హిందూ మతాన్ని విమర్శించి, కాదన్నారు. 1942 లో అంబేద్కర్ "షెడ్యూల్డ్ కాస్ట్ ఫెడరేషన్" స్థాపించి, దేశంలోని దళితులందరిని దానిలోకి సమీకరించే ప్రయత్నం చేసారు. 1944 లో అంబేద్కర్ ఆంధ్రా ప్రాంతాన్ని పర్యటించారు, అక్కడి దళితుల సమీకరణలో అదొక మైలు రాయి. ఆయన ప్రభావం ఎంత ఉందంటే, ఆయన జయంతిని (ఏప్రిల్ 14) ఒక పెద్ద పండగగా, ఒక భక్తి ఉద్యమంగా ఆంధ్రా గ్రామాల్లో, ముఖ్యంగా గోదావరి జిల్లాలో జరుపుకునే వారు, ఇప్పటికీ జరుపుకుంటారు. ఇంకో పక్క, ఆయన ప్రభావం తో దళితులు హిందువుల పండగలు చేసుకోవడం మానేసారు.

అంబేద్కర్ ఆంధ్రాకి రాకముందే ఆంధ్రా లో దళితులు ఆది ఆంధ్ర మహాజన సంఘంగా ఏర్పడి చాలా చోట్ల సభలు నిర్వహించి, తీర్మానాలు చేసి తమవారి సంక్షేమం కోసం ప్రభుత్వం మీదా, అధికారుల మీదా వత్తిడి తెచ్చారు. తెలంగాణ లోనూ, ఆంధ్రా లో కూడా ఈ ఆది ఆంధ్ర మహాజన సంఘాలు ఏర్పడ్డాయి. ఒక పక్క కాంగ్రెస్ రాజకీయాలు నడుస్తూ ఉండగా, ఆది ఆంధ్రులు తమ సొంత రాజకీయ గొంతు వినిపించ సాగారు. ఆది ఆంధ్ర మహాజన సంఘాలు అమలాపురం తాలూకా లోని దాదాపు అన్ని గ్రామాల్లో ఉండి దళితుల విద్య కోసం పాఠశాలు, హాస్టళ్లు నడపడం, దళితుల ఉద్యోగాల కోసం ప్రయత్నించడం, భూమి లేని వారికి పోరంబోకు, ప్రభుత్వ భూమిని పంచిపెట్టడం, "ఫీల్డ్ లేబర్ కో ఆపరేటివ్ సొసైటీలు" పెట్టడం, ఇతర వెనకబడిన కులాలతో సంఘటితమవ్వడం వగైరా పనులు చేస్తుండేవి. అప్పలస్వామి గారు ఆది ఆంధ్ర మహాజన సంఘం లో చాలా చురుకైన పాత్ర వహించి నాయకుడుగా ఎదిగారు. అంబేద్కర్ ఆంధ్రా ప్రాంతానికి వచ్చివెళ్లిన తర్వాత ఆయన ప్రభావం తో ఆది ఆంధ్ర మహాజన సంఘం లో పని చేసిన చాలా మంది "షెడ్యూల్డ్ కాస్ట్ ఫెడరేషన్" లో చేరగా కొంత మంది మాత్రం కాంగ్రెస్ లోకి వెళ్లారు. కాంగ్రెస్ లో చేరిన మాలలు అగ్రకులాల ఆదరణ కోసం ప్రయత్నించారే తప్ప తమ వారి హక్కుల కోసం, అభివృద్ధి కోసం పోరాడలేదు. దాదాపు అదే సమయంలో ఆంధ్ర ప్రాంతంలో కమ్యూనిస్టు పార్టీ కూడా దళితులతో, వెనకబడిన కులాలతో పని చెయ్యడం మొదలు పెట్టింది. ఐతే, కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు ఎక్కువగా మాలలే ఐనా, నాయకులు మాత్రం అగ్రకులాలకి చెందినవారే. ఇక్కడే కమ్యూనిస్టు పార్టీకి ఫెడరేషన్ పార్టీకి తేడా ఉంది. కులం ఉపరితల అంశమని, వ్యవసాయ విప్లవం వచ్చిన తర్వాత అంటరానితనం, కులం వాటంతట అవే పోతాయని అప్పటి కమ్యూనిస్టు పార్టీ అవగాహన, అందుకే ఆ పార్టీ కుల సమస్యపై ప్రత్యేకమైన పోరాటాలు చెయ్యలేదు. కమ్యూనిస్టు పార్టీ లో ఉన్న చాలా మంది మాలలు దాన్ని వదిలేసి ఫెడరేషన్ పార్టీలో చేరడానికి ఇదొక బలమైన కారణమయ్యింది.

స్వతంత్రం వచ్చిన తర్వాత బొజ్జా అప్పలస్వామి గారు మద్రాస్

# మహత్తర అక్టోబర్ విప్లవానికి జేజేలు !

ఎ. నర్సింహా రెడ్డి

ప్రపంచ పెట్టుబడిదారీ విధానాన్ని కార్మికవర్గ విప్లవంతో కూలదోసి సమసమాజ స్థాపన జరుగుతుందన్నాడు కార్ల్‌మార్క్స్. ఆ సిద్ధాంతాన్ని లెనిన్ రష్యాలో ఆచరణలో పెట్టిన సందర్భం. ప్రపంచంలో తొలిసారిగా కార్మికులు రాజ్యాధికారం చేజిక్కించుకున్న ఉదంతం. తొలి సోషలిస్టు దేశం ఆవిర్భవించిన చరిత్ర. అదే అక్టోబర్ విప్లవం! రష్యా విప్లవం! బోల్షివిక్ విప్లవం! యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్టు రష్యా! 1917లో సంభవించిన ఆ మహా విప్లవానికి ఈ నవంబర్ 7వ తేదీతో వందేళ్లు. సకల పీడనల్నించి మానవాళిని విముక్తి చేసే మహత్తర సిద్ధాంతం మార్క్సిజం. ఆ సిద్ధాంతపు వెలుగులో రష్యాలో జరిగిన బోల్షివిక్ విప్లవం చరిత్రగతిని మార్చి వేసింది. మానవ చరిత్ర ప్రస్థానంలో మహా ముందడుగు రష్యన్ విప్లవం. కార్మికవర్గ నియంతృత్వాన్ని అమలు చేసింది. ఈ విప్లవ శత వసంతోత్సవాల ప్రారంభ సందర్భమిది. సామ్యవాద స్వప్న సాకారానికి తొలి అడుగులు పడిన చారిత్రక జ్ఞాపకాల సంరంభమిది.

1917 నవంబర్ 7న పెట్రోగ్రాడ్ ముట్టడితో అక్టోబర్ విప్లవం కీలక ఘట్టాన్ని చేరుకుంది. పెట్టుబడిదారీ శక్తులపై సాధించిన అప్రతిహత విజయానికి గుర్తుగా నిలిచిపోయిన రోజులవి. దేశదేశాల్లో విప్లవాలకు ఉత్తేజాన్ని, ప్రేరణను ఇచ్చిన విప్లవాల కాలమది. అందుకే శ్రీశ్రీ "గర్జించు రష్యా! గాండ్రించు రష్యా" అన్నారు. బోల్షివిక్కులు సాధించిన ఆ విజయం సామ్రాజ్యవాద శక్తులకు పెనుసవాల్‌గా నిలిచింది. ప్రపంచ కార్మికులారా ఏకం కండి అన్న మార్క్స్ నినాదానికి ఊపిరిలూదింది. శ్రామిక జనావళికి స్ఫూర్తి నిచ్చింది. తరగని చెరగని ఉత్తేజాన్నిచ్చింది. రకరకాల పీడనలకు అనిచివేతకు లోనయ్యే పీడిత ప్రజానీకంలో నూతన ఆశలు రేపింది. ప్రజాపక్షం నిలబడి పోరాడటమే అసలు సిసలు మానవీయ దృక్పథానికి కొలమానమైంది. అమరత్వం వృథా కాదని, కాలం కత్తుల వంతెనపై నడచి చరిత్రను మలుపుతిప్పే మహా సంకల్పాన్ని దేశ దేశాల్లో ప్రోది చేసింది. భావ, భౌతిక రంగాల్లో తీవ్ర సంచలనాన్ని సృష్టించింది. వలస వ్యతిరేక ఉద్యమాలకు స్ఫూర్తి నిచ్చింది.

గిమోర్గి ప్లెహనోవ్ రష్యాకు మార్క్సిజాన్ని పరిచయం చేశారు. ఆయన తయారు చేసిన మార్క్సిస్టులలో ప్రముఖుడు లెనిన్. ప్లెహనోవ్ 1870లో రష్యాలో కార్మికవర్గం రూపు దిద్దుకుంటున్న కాలంలో 'ఇమాన్సిపేషన్ ఆఫ్ లేబర్ లీగ్' స్థాపించారు. లెనిన్ అతని సహచరులు మార్తోవ్, అక్సెల్‌రాడ్‌ల చొరవతో 1889లో 'రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబర్ పార్టీ' ఏర్పాటైంది. అది స్థూలంగా మార్క్సిస్టు పార్టీ. అయితే సంస్థాగత విషయాలపై స్పష్టత లేదు. అనార్కిస్టులు, నరోద్నిక్‌లు, అతివాదం, సంస్కరణవాదం, ఆర్థికవాదం తదితర భావజాల ధోరణులతో పోరాడుతూ రష్యాలో మార్క్సిజం అభివృద్ధి చెందింది. ఆ పోరాటంలో అగ్రభాగాన ఉన్న లెనిన్

---

అసెంబ్లీ కి ఎం.ఎల్.ఏ గా 1952 లో మొదటి సారి ఎన్నికయ్యారు, ఆ తర్వాత రెండోసారి ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీకి ఎం.ఎల్.ఏ గా గెలిచి 62 వరకు ఎం.ఎల్.ఏ గా ఉన్నారు. ఆయన ఎం.ఎల్.ఏ గా ఉన్న కాలమంతా శాసన సభా చర్చల్లో చురుగ్గా పాల్గొనడం, వెనకబడిన కులాల సంక్షేమానికి సంబంధించి గట్టిగా ప్రశ్నించడం, డిమాండ్లు పెట్టడం, ప్రభుత్వాధికారులతో పనులు చేయించడం, దళితులకి ఉద్యోగాలు, భూమి ఇప్పించడం, తిరుపతి దేవస్థానం లో దళితుల మీద సాగుతున్న వివక్షకి వ్యతిరేకంగా పోరాడడం వంటి అనేక పనులు చేసారు. ఆయన ఈ కాలంలో ప్రకాశం పంతులు, నీలం సంజీవ రెడ్డి, బెజవాడ గోపాల రెడ్డి వంటి పేరున్న రాజకీయ నాయకులుతో మంచి సంబంధాలు కలిగి ఉండేవారు. కానీ అవసరమైనప్పుడు వాళ్లని విమర్శించడానికి, వాళ్లతో విభేదించడానికి ఎప్పుడు వెనుకాడలేదు.

ఈ పుస్తకంలో పునరుక్తి దోషం చాలా ఉంది. కొన్ని సార్లు ఒకే వాక్యం అదే పేజీలో మళ్లీ మళ్లీ ఉన్న సందర్భాలు కూడా ఉన్నాయి. అట్లాగే, ఇది జీవిత చరిత్ర కాబట్టి, విషయాలు కాలానుక్రమంగా ఉండేట్టు సంపాదకులు చూస్తే బావుండేదేమో. ఇవి శైలికి సంబంధించినవి. బొజ్జా గోవిందు గారు కాని, అప్పలస్వామి గారు కాని, ఆడవాళ్లని మందలించే తీరు, పెద్దరికంతో కుర్రవాళ్లకి చెప్పడం లాంటి విషయాలు కొన్ని స్త్రీవాద, ఆధునిక దృక్పథం నుంచి చూస్తే ఇబ్బందికరంగా అనిపించవచ్చు. ఐతే అప్పటి స్థల, కాల పరిస్థితుల దృష్ట్యా వాటిని అర్థం చేసుకోవచ్చు.

ఆంధ్రా లో దళితుల పరిస్థితుల్లో చారిత్రకంగా వచ్చిన రాజకీయ, ఆర్థిక, సామాజిక మార్పుల గురించి, దళిత ఉద్యమాల గురించి, ఆ ఉద్యమాల్లో ముఖ్యమైన పాత్ర వహించిన అనేక వ్యక్తుల గురించి తెలుసుకోవాలనుకున్న ప్రతి ఒక్కరు చదవ వలసిన పుస్తకమిది. బొజ్జా అప్పలస్వామి గారు దళితులని సమీకరించిన తీరు, బహుజనులని కులాలకతీతంగా ఐక్య పరచిన తీరు నుంచి ఈ నాటి దళిత, బహుజన, కమ్యూనిస్టు నాయకులు, కార్యకర్తలు నేర్చుకో వలసినది ఎంతో ఉంది. దళితులు ఎందుకు కమ్యూనిస్టు పార్టీల నుంచి దూరంగా ఉన్నారో / జరిగారో, ఆ కారణాలు కూడా ఈ పుస్తకం చదివితే కొంత వరకు అర్థం అవుతాయి. అవి కమ్యూనిస్టు పార్టీలు తప్పక పట్టించుకోవలసిన విషయాలు. వ్యక్తివాదం విపరీతంగా పెరిగి పోయినప్పుడు అది సమిష్టి కార్యాచరణకి ఎంతగా అడ్డు పడుతుందనేది అప్పలస్వామి గారు చాలా ముందే గుర్తించి హెచ్చరించారు, ఈ విషయం కూడా అన్ని రకాల ఉద్యమాలు దృష్టిలో పెట్టుకుని పని చెయ్యాలి. ఈ పుస్తకం ఎలాగైతే కోనసీమ దళితుల జీవితాల్లోని మార్పులని, వాళ్ల ప్రతిఘటనని, ఉద్యమాలని రికార్డ్ చేసిందో అదే విధంగా ఇతర ప్రాంతాల దళిత జీవితాల గురించి కూడా మరిన్ని పుస్తకాలు వస్తే అవి సామాజిక శాస్త్రవేత్తలకే కాకుండా, సమాజ మార్పు కోసం ప్రయత్నించే వారికందరికి చాలా ఉపయోగంగా ఉంటాయి.



మార్క్సిజంలోని అనేక కీలక అంశాలను అభివృద్ధి చేశాడు. అవి భవిష్యత్ లెనినిజానికి పునాదులు వేశాయి. లెనిన్ 24వ (1894) యేట తన ప్రసిద్ధ రచన ప్రజల మిత్రులు అంటే ఏమిటి?లో నరోద్నిక్‌లను ఎదుర్కొన్నాడు. వారి రైతు సోషలిజాన్ని తిప్పి కొడుతూ, విప్లవం శాస్త్రీయ వ్యూహం పెట్టుబడిదారీ శీఘ్రగతి అభివృద్ధిని పరిగణనలోకి తీసుకోవాలని రుజువు చేశాడు. గ్రామీణ ప్రాంతంపై ఆధారపడిన వారి ఊహాజనిత సోషలిజాన్ని ఆయన విమర్శించాడు.

20వ శతాబ్దపు తొలి రోజుల్లో రష్యాలో జారు చక్రవర్తి నడుపుతున్న ఫ్యూడల్-సామ్రాజ్యవాద వ్యవస్థకు వ్యతిరేకంగా ప్రజల్లో తీవ్రమైన అసంతృప్తి ఉంది. జార్ చక్రవర్తి ఆధీనంలో విస్తారమైన సామ్రాజ్యం ఉంది. అప్పటి జార్ వ్యవస్థ పెద్ద పెద్ద భూస్వాములతో కూడుకున్నది. సామ్రాజ్యంలోని సుసంపన్నమైన 80 లక్షల హెక్టార్లు జార్ ఆధీనంలో ఉండేది. 28 వేల భూస్వాముల ఆధీనంలో 167.4 మిలియన్ల (1674 కోట్ల) హెక్టార్ల భూమి ఉండేది. ఆ వ్యవస్థను ధ్వంసం చేయడానికి కార్మికవర్గం బూర్జువా ప్రజాతంత్ర విప్లవానికి నాయకత్వం వహించాలని పార్టీకి నచ్చ చెప్పటానికి లెనిన్ ప్రయత్నించారు. 1903 జూలైలో రష్యన్ సోషల్ డెమొక్రటిక్ లేబర్ పార్టీ రెండవ మహాసభ జరిగింది. రష్యా విప్లవంలో రైతాంగం పాత్ర, జాతుల సమస్య, కార్మికవర్గ నియంతృత్వం, పార్టీ నిర్మాణ సూత్రాలు.. వంటి వాటిలో తీవ్రమైన భిన్నాభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. లెనిన్ ప్రతిపాదించిన అంశాలతో ఏకీభావం లేనివారు మైనారిటీ అయ్యారు. ఆర్ఎస్‌డిఎల్‌పి రెండు గ్రూపులుగా, రెండు పార్టీలుగా చీలిపోయింది. బోల్షివిక్‌లు (మెజారిటీ)- నాయకుడు లెనిన్, మెన్షివిక్‌లు (మైనారిటీ) నాయకుడు మార్టోవ్.

1905,06 సంవత్సరాల్లో భారీ స్థాయిలో నడిచిన కార్మికోద్యమాల వల్ల జార్ ప్రభుత్వానికి ఉక్కిరి బిక్కిరైపోయింది. అతివేగంగా విప్లవోద్యమం పురోగమించింది. అయితే అతి త్వరలోనే విప్లవోద్యమం నిర్బంధాన్నెదుర్కోవలసి వచ్చింది. 1908-12 సంవత్సరాల్లో జార్ ప్రయోగించిన నిర్బంధం వలన ఉద్యమం స్తబ్దతలోకి చేరుకుంది. ఇదే అదునుగా విప్లవ ప్రతిఘాత శక్తులు అవాక్కులు చవాక్కులు పేల్చారు. ఉద్యమ శక్తులమధ్య, పార్టీలోపల ప్రతికూల పరిస్థితులు ఏర్పడ్డాయి. బోల్షివిక్ విప్లవ చరిత్రలో అత్యంత క్లిష్ట పరిస్థితి నెదుర్కొన్న కాలం ఇది. ఈ కాలాన్ని బోల్షివిక్ పార్టీ చరిత్రలో 'స్టోలిపిన్ అభివృద్ధి నిరోధక కాలం' అని పిలుస్తారు. స్టోలిపిన్ రష్యా సైనికమంత్రి. అన్యవర్గ ధోరణులు ప్రబలిన తరుణంలో లెనిన్ 'ప్రజాతంత్ర ఉద్యమంలో రెండు వైఖరులు', 'భౌతికవాదం- అనుభవవాద విమర్శ' వంటి రచనల ద్వారా ప్రత్యర్థుల వాదనలను తిప్పి కొట్టాడు. పార్టీ శ్రేణులను ముందుకు నడిపించాడు. అన్యవర్గ ధోరణులను ఓడించగలిగాడు.

1905 విప్లవకాలంలో కార్మికులు-రైతుల ప్రజాసంఘాలుగా 'సోవియట్‌లు' ఆవిర్భవించాయి. ఈ విప్లవంలోనే లెనిన్ 'కార్మిక- కర్షక మైత్రి' భావనను అభివృద్ధి చేశారు. 1905 రష్యన్ విప్లవం విఫలమైంది. అయితే 1917 విప్లవానికి అది ఎన్నో పాఠాలు నేర్పింది. 20వ శతాబ్దపు తొలి రెండు దశాబ్దాల గుత్తపెట్టుబడిదారీ విధానం, సామ్రాజ్యవాదంగా ఆవిర్భావం పొందుతున్న కాలం. కార్మికులే కాదు, రైతులు, అల్ప, చిన్న, మధ్యతరహా ఉత్పత్తిదారులు, వ్యాపారులు ఉత్పత్తిలో, మార్కెట్‌లో తమ పాత్ర కోల్పోయారు. ద్రవ్యగుత్త పెట్టుబడిదారులు, సామ్రాజ్యవాద రాజ్యాలమధ్య ప్రపంచం విభజించబడుతున్నది. వలసరాజ్యాలను వేగంగా స్వాధీనం చేసుకుంటున్నారు. ప్రపంచ పునర్విభజన దిశగా ఘటనలు ప్రయాణిస్తున్నాయి. అంటే ప్రపంచయుద్ధం దిశగా ప్రయాణం సాగుతున్నది. మొదటి ప్రపంచయుద్ధం 1914లో బద్దలై 1918 వరకు కొనసాగింది. అప్పటికి మానవ చరిత్రలో అది అత్యంత విధ్వంసకర యుద్ధం. టాంకులు, ఫిరంగులు, బాంబర్లు తొలిసారి ఉపయోగించబడ్డాయి. జర్మనీ, ఆస్ట్రో-హంగరీ ఓటమి, ఇంగ్లండ్ దాని మిత్ర రాజ్యాల విజయంతో అది ముగిసింది.

అక్టోబర్ మహావిప్లవం కేవలం జారు చక్రవర్తుల నియంతృత్వం మీద మాత్రమే జరిగిన విప్లవం కాదు. అది సోషలిస్టు విప్లవమేకాక సామ్రాజ్యవాద వ్యతిరేక, పెట్టుబడిదారీ వ్యవస్థ వ్యతిరేక కొత్త తరహా విప్లవం. దానికి విశ్వవ్యాప్త ప్రాధాన్యత ఉన్నది. లెనిన్‌గానీ, బోల్షివిక్కులుగానీ రష్యాలో జరిగిన విప్లవాన్ని 'జాతీయ' కోణంలో చూడలేదు. వారు దానిని ప్రపంచ సోషలిస్టు విప్లవ భావి సూచికగా చూశారు. సామ్రాజ్యవాదం నుంచి వేరేచేసి చూస్తే అక్టోబర్ మహావిప్లవం అర్థంకాదు. సామ్రాజ్యవాదం గురించి మార్క్సిస్టు సిద్ధాంతాన్ని రూపొందించి, దానిని విప్లవ వ్యూహంలో భాగంగా మలచటానికి లెనిన్ చేసిన కృషి అపూర్వం. పెట్టుబడిదారీ వ్యవస్థ విశ్వవ్యాప్తమౌతుందని మార్క్స్ ఊహించారు. అయితే మార్క్స్ మరణానంతరమే పెట్టుబడిదారీ వ్యవస్థ గుత్త పెట్టుబడిదారీ దశలోకి ప్రవేశించింది. గుత్త పెట్టుబడిదారీ వ్యవస్థ అంతర్గత అవసరం వల్ల సామ్రాజ్యవాదం ఒక ప్రపంచవ్యాప్త వ్యవస్థగా ఎలా అభివృద్ధి అయిందో లెనిన్ చూడగలిగాడు. మార్క్సిస్టు సిద్ధాంతంపై లెనిన్‌కున్న లోతైన అవగాహన వల్ల అది సాధ్యపడింది. లెనిన్ ప్రసిద్ధ గ్రంథం "సామ్రాజ్యవాదం పెట్టుబడిదారీ అత్యున్నత దశ"లో ఆనాటి సామ్రాజ్యవాద ద్రవ్య పెట్టుబడి విధానాన్ని విశ్లేషించారు. ఆ గ్రంథం 1916లో జ్యూరిచ్‌లో ప్రచురితమైంది. సోషల్ డెమొక్రటిక్, కమ్యూనిస్టు ఉద్యమ ఎత్తుగడలకు అది కీలకమైన రచన. ఈనాడు మనం ఆ గ్రంథం శతవార్షికోత్సవం జరుపుకుంటున్నాం.

ప్రపంచ కార్మికవర్గ విప్లవ నిర్దిష్ట వ్యూహం, ఎత్తుగడలను సామ్రాజ్యవాదంతో లెనిన్ ముడిపెట్టారు. పెట్టుబడిదారీ వ్యవస్థ పూర్తిస్థాయిలో అభివృద్ధి అయిన సమాజంలోనే సోషలిస్టు విప్లవాలు సంభవిస్తాయనే సంప్రదాయ మార్క్సిస్టు అవగాహనకు భిన్నమైన సిద్ధాంతాన్ని సామ్రాజ్యవాదం గురించి తనకున్న విస్తృత అవగాహనతో లెనిన్ ప్రతిపాదించారు. సామ్రాజ్యవాద దశలో పెట్టుబడిదారీ విధానం అసమంగా అభివృద్ధి చెందటంవల్ల పెట్టుబడిదారీ అభివృద్ధిలో వెనుకబడిన దేశాలలో కూడా సోషలిస్టు విప్లవాలు కార్మికవర్గ నాయకత్వంలో విజయవంతమయ్యే అవకాశం ఉంటుందని పేర్కొన్నారు. మొత్తం ప్రపంచాన్ని పెట్టుబడిదారీ వ్యవస్థ పరిధిలోకి సామ్రాజ్యవాదం తీసుకొస్తుందని, ఈ గొలుసులో బలహీనంగా ఉన్న లింకును తెగ్గొట్టవచ్చునని ఆయన సూత్రీకరించారు. సామ్రాజ్యవాద దేశాల మధ్య ఏర్పడిన స్పర్థలవల్ల జరిగిన మొదటి ప్రపంచ యుద్ధం జారిస్టు రష్యాను అత్యంత బలహీనమైన లింకుగా మార్చిందని లెనిన్ మొట్టమొదటగా చెప్పారు. బూర్జువా ప్రజాస్వామిక విప్లవాన్ని కార్మికవర్గ నాయకత్వంలో సోషలిస్టు విప్లవం దశకు చేర్చవచ్చనేది అక్టోబర్ మహోత్తర విప్లవంలోని రెండో సూత్రీకరణ. బోల్షివిక్ పార్టీ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా నిలబడింది.

సామ్రాజ్యవాద గొలుసులో రష్యా అత్యంత బలహీనమైన లింకుగా ఉండింది. మొదటి ప్రపంచయుద్ధ సమయాన రష్యా విప్లవం ప్రారంభమైంది. ఆ యుద్ధంలో జారిస్టు రష్యాలోని వైరుధ్యాలన్నీ బయటపడ్డాయి. ప్రపంచాన్ని విభజించేందుకు, పునర్విభజించు కునేందుకు సామ్రాజ్యవాద దేశాల మధ్య జరుగుతున్న యుద్ధంలో ప్రజలకెట్టి

ప్రయోజనం లేదనే కారణంతో లెనిన్ నాయకత్వంలోని బోల్షివిక్ పార్టీ ఆ యుద్ధాన్ని ఆరంభంనుంచీ వ్యతిరేకించింది. 1917 మార్చి-నవంబర్ (పాత రష్యన్ క్యాలెండర్ ప్రకారం అవి ఫిబ్రవరి-అక్టోబర్ నెలలు). పెట్రోగ్రాడ్ రష్యా రాజధాని(దాని పాత పేరు సైంట్ పీటర్స్ బర్గ్, ఆ తర్వాత లెనిన్ గ్రాడ్, ఇప్పుడు తిరిగి సైంట్ పీటర్స్ బర్గ్) మార్చి నెలలో జార్‌ని అధికారం నుంచి తొలగించి, కెరెన్స్కీ నాయకత్వాన బూర్జువా ప్రభుత్వాన్ని అధికారంలో ఉంచింది. ఈ తాత్కాలిక ప్రభుత్వం మితవాదుల శక్తులతో రాజీపడి రష్యాలోని బూర్జువా వర్గానికి కొమ్ము కాయడం మొదలు పెట్టింది. మొదటి ప్రపంచ యుద్ధంలో జరిగిన నష్టాల వలన, సైనికులు హతులవడం వలన ఈ ప్రభుత్వం ప్రజల మద్దతు కోల్పోయింది. అయితే ఫిబ్రవరి విప్లవం ఒక శక్తివంతమయిన ప్రముఖ సాధనాన్ని సమకూర్చి పెట్టింది. అదే 'సోవియట్లు'.

అసలు సిసలు అధికారం సోవియట్స్ చేతిలో ఉంది. సైనికులు, కార్మికులు, రైతులు విప్లవాన్ని బలపరిచారు. లెనిన్ నాడు ప్రవాసంలో ఉన్నాడు. ఏప్రిల్‌లో ఆయన రష్యా రాజధానికి వచ్చాడు. ప్రజాస్వామిక విప్లవాన్ని నిరాటంకంగా సోషలిస్టు దశకు తీసుకుపోవటానికి కార్మికవర్గం నాయకత్వం వహించవలసిన అవసరాన్ని అందరికంటే ముందుగా లెనిన్ సమర్థించారు. లెనిన్ చెప్పినట్టుగా బూర్జువా విప్లవం పూర్తికావటానికి, సోషలిస్టు విప్లవం జయప్రదం కావటానికి మధ్య అడ్డుగోడ ఏమీ లేదు. ఈ అవగాహనతోనే జార్ నియంతృత్వాన్ని కూలదోసిన ఫిబ్రవరి విప్లవం తర్వాత సోషలిస్టు విప్లవం కోసం బోల్షివిక్ పార్టీ పోరాడింది. లెనిన్ ప్రవాస జీవితాన్ని వదలి రష్యాకు వచ్చిన తరువాత రాసిన ప్రముఖ 'ఏప్రిల్ థీసిస్'లో ఫిబ్రవరి విప్లవం బూర్జువా ప్రజాస్వామ్య దశను పూర్తి చేసిందని పేర్కొన్నారు. బూర్జువా ప్రజాస్వామిక విప్లవ కర్తవ్యాలను పూర్తిచేయటానికి, విప్లవాన్ని సోషలిస్టు దశకు చేర్చటానికి కార్మిక వర్గం నాయకత్వం వహించాలనే సృజనాత్మక వ్యూహం బోల్షివిక్ పార్టీని రెండు వ్యూహాత్మక కర్తవ్యాలను చేపట్టేలా చేసింది. అవేమంటే వ్యవసాయిక కార్యక్రమం, జాతీయ కార్యక్రమం.

మార్చి-నవంబర్ మధ్యకాలంలో రాజకీయ పరిణామాల్లో అనేక ఒడిదుడుకులు సంభవించాయి. అక్టోబర్-నవంబర్ (1917) నాటికి అన్ని స్థాయిల్లోని సోవియట్‌లలో బోల్షివిక్ పార్టీ బలాధిక్యత పొందింది. అక్టోబర్ చివరకు కేంద్ర సోవియట్‌లో మెజారిటీ సంపాదించింది. నవంబర్7 (1917) నుంచి అధికారాన్ని స్వాధీనం చేసుకోవాలని అఖిల రష్యా సోవియట్ల కార్యవర్గం నిర్ణయించింది. బోల్షివిక్ పార్టీ ఇచ్చిన 'అన్ని అధికారాలు సోవియట్లకే' అన్న పిలుపుతో 'యుద్ధం వద్దు.. శాంతి కావాలి.. అంటూ అక్టోబర్ 25 (నవంబర్ 7)న సాయుధ కార్మికులు, రైతులు, సైనికుల దళాలు తాత్కాలిక ప్రభుత్వాన్ని కూలదోసేందుకు జార్ చక్రవర్తి నివాసముండే వింటర్ ప్యాలెస్‌కు బయలు దేరాయి. ఈ విప్లవం రాజధాని పెట్రోగ్రాడ్‌లో జార్ సైన్యాన్ని ఓడించి అధికారం హస్తగతం చేసుకోవడంలో సఫలమయింది. తదనంతరం వారాలలో ఇతర నగరాల్లో కీలక స్థానాలను స్వాధీనం చేసుకున్నాయి. కెరెన్ స్కీ ప్రభుత్వాన్ని కూల్చివేసి సోవియట్ ప్రభుత్వం అధికారం చేబట్టింది. పాత జారు చక్రవర్తి సామ్రాజ్యమంతటిలోనూ సోవియట్‌ల అధికారం నెలకొల్పబడింది. లెనిన్ సారథ్యంలో నూతన రాజ్యం ఆవిర్భవించింది.

ఈ విప్లవం 'కౌన్సిల్ ఆఫ్ పీపుల్స్ కమిస్సార్స్' ఆధ్వర్యాన లెనిన్ నాయకత్వాన కొత్త ప్రభుత్వ స్థాపనకు దారితీసింది. అఖిల రష్యా కేంద్ర కార్యవర్గ కమిటీ చైర్మన్‌గా (దేశాధ్యక్షుడితో సమానం) యాకోవ్ స్వెర్డ్‌లోవ్ ఎన్నికైనారు. ఆ కార్యవర్గం మంత్రులను (కమిస్సార్స్), మంత్రివర్గ చైర్మన్‌గా (ప్రధానికి సమానం) లెనిన్‌ను నియమించింది. విప్లవం ఆరంభంలో ప్రజాతంత్ర విప్లవంగా, అదే సమయంలో అది భవిష్యత్ సోషలిజాన్ని ఉద్దేశించిన కార్మికవర్గ విప్లవం కూడా. సోవియట్లు విప్లవం ప్రజాస్వామిక, సోషలిస్టు విప్లవాల్లో మొదటి పెద్ద ప్రయోగం.శాంతి, ఆహారం, భూమి గూర్చి మూడు ప్రకటనలు చేశాడు. సామాజిక-ఆర్థిక, రాజకీయ సంబంధాల్లో సోషలిస్టు పరివర్తనలు తేవటంలో అదొక చారిత్రక ప్రయోగం.పెట్టుబడిదారీ విధానం నుంచి సోషలిజంలోకి పరివర్తనకొక తొలి ప్రయత్నం.

సోవియట్ ప్రభుత్వం తీసుకున్న అపూర్వమైన చర్యలు ప్రపంచ చరిత్రపై గాఢమైన ముద్రను మిగిల్చాయి. అక్టోబర్ విప్లవానంతరం భారీ పరిశ్రమలను జాతీయం చేసి సోవియట్‌లకు అప్పగించటం, భూస్వాములకు భూములపై గల హక్కును ఎలాంటి నష్టపరిహారం లేకుండా రద్దు చేశారు. భూమి ఉమ్మడి సొత్తుగా మారింది. సహకార వ్యవసాయం అమలులోకి వచ్చింది. కమ్యూన్లు ఏర్పడ్డాయి. ఒక వర్గంగా పెట్టుబడిదారులు రద్దు చేయబడ్డారు. సామాజిక, రాజ్య యాజమాన్యం ప్రవేశ పెట్టబడింది. నిరుద్యోగం రద్దు చేయబడింది. అందరికీ ఉద్యోగాలివ్వబడినాయి. ఉచిత ఆరోగ్యం, మొదటి పదేళ్లలో నిరక్షరాస్యతను నిర్మూలించారు. గృహవసతి, రవాణా అతిచౌక చేయబడింది. చిన్న, చిల్లర వర్తకాలకు రక్షణ ఇచ్చి, వాటి అభివృద్ధికి సహాయం అందించబడింది.

విప్లవానంతరం సోవియట్ యూనియన్ శీఘ్రగతిన పారిశ్రామికీకరణ పొందింది. ఆర్థిక, రాజకీయబలంలో ప్రపంచంలో అగ్రగామిగా ఉన్న కొద్ది దేశాల్లో అది ఒకటి అయింది. 1936లో ఆఖరి ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజీ మూసేశారు. పాలనలో, యాజమాన్యంలో మహిళలు సహ భాగస్వాములయ్యారు. పురుషులతో సమానంగా అన్ని హక్కులూ సాధించుకున్నారు. అప్పటికింకా అమెరికాలో మహిళలకు ఓటు హక్కు కూడా లేదు. ఎంతో వెనుకబడిన ఒక దేశాన్ని శాస్త్ర, సాంకేతికాభివృద్ధిలో అగ్రగామిగా తీర్చిదిద్దింది. పరివర్తనా దశగా నూతన ఆర్థిక విధానం (ఎన్ఇపి) ప్రవేశపెట్టారు. క్రమంగా సోషలిజం దిశలో ముందుకు సాగింది. సోవియట్ విప్లవం ప్రపంచమంతటా, సామ్రాజ్యవాదుల అధీనంలోని వలస దేశాల్లో సహా స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం, సోషలిజం కొరకు పోరాటానికి కొత్త ఊపు కలిగించింది. సోషలిజం కొరకు పోరాటానికి కొత్త ఊపు కలిగించింది. సూక్ష్మంగా చెప్పాలంటే, ఆ విప్లవం ప్రపంచ ప్రజలు ఒక నూతన సమాజం గూర్చి ఆలోచించేటట్లు చేసింది.

ఇవాళ సంక్షోభం, అసమానతలు, ఆకలి, దారిద్ర్యం, నిరుద్యోగంతో భారత రాజకీయార్థిక సాంఘిక వ్యవస్థ సతమతమవుతోంది. మన దేశంలో వర్గదోపిడీతో పాటు కరడుగట్టిన కుల వ్యవస్థ ఉంది. వర్గ సమాజంతో అది మమేకమై కొనసాగుతోంది. పెట్టుబడిదారీ వర్గం రాజకీయ ఆధిపత్యం కోసం కులవ్యవస్థను కాపాడుతున్నది. సోషలిజంపై దాడి చేసే శక్తులు వర్గపోరాటాలను బలహీనపరిచేందుకు కులాన్ని ఒక సాధనంగా ఉపయోగించు కుంటున్నాయి. మతాన్ని పావుగా వాడుకుంటున్నాయి. విప్లవాలు ఆపితే ఆగేవి కావని, అవి సమాజగర్భంలోంచి పుట్టుకొస్తాయి. పెట్టుబడిదారీ వ్యవస్థలోని అసమానతల్లోనే విప్లవానికి బీజాలున్నాయి. విప్లవం కుట్ర కాదు. ప్రజల చైతన్యంలోంచి పుట్టుకొస్తుంది. సామాజిక అసమానతలు, వివక్షపై పోరాటాలు సాగించడం ద్వారా వర్గపోరాటాలను మరింత పదునెక్కించాలి. వర్గ పోరాటాలతో పాటు సామాజిక

# రెడార్మీ లాంగ్ మార్చ్

ఆంకాళ్ళ పృథ్వీరాజ్



**రెడార్మీ** లాంగ్‌మార్చ్ పుస్తక రచన లియాపొ-చెంగ్, ఇతరులు చేశారు. ముందుమాట కామ్రేడ్ మావో రాశారు. ఈ పుస్తకాన్ని ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురించింది. ఈ పుస్తకాన్ని తెలుగులోకి అనువదించినది కె. కేశవరెడ్డిగారు. ఈ పుస్తకం ప్రథమ ముద్రణ 1985 ఆగస్టు, అలాగే ద్వితీయ ముద్రణ 1991, ఫిబ్రవరి.

ఈ పుస్తక రచయితలు స్వయంగా లాంగ్-మార్చ్‌లో పాలుపంచుకున్నవారు. వీరు తమ అపూర్వ అనుభవాలను ఈ పుస్తకం ద్వారా తెలియపరిచారు. ఈ పుస్తకం ప్రపంచ ఆధునిక చరిత్రలో విశిష్టమైన, సంపూర్ణమైన, విశ్వజనీన పార్శ్వం కలిగిన యుద్ధతంత్రాన్ని అభివృద్ధిపరిచిన లాంగ్ మార్చ్ ఘట్టాన్ని వివరించింది (మావో దీర్ఘకాలిక యుద్ధతంత్రంలో అభివృద్ధి చెందిన వెసులుబాటు యుద్ధపు సూత్రంలో అంతర్లీన భాగస్వామ్యం లాంగ్ మార్చ్). చైనా కమ్యూనిస్ట్ పార్టీ నాయకత్వంలో గల కార్మిక - కర్షక ఎర్రసైన్యం 1934 అక్టోబర్ నుండి 1936 అక్టోబర్ వరకూ 12,500 కిలోమీటర్లు, రెండు సంవత్సరాలు అతి దుర్భేద్యమైన దారులు గుండా, నదుల గుండా, కొండలు గుండా ప్రయాణం చేస్తూ జపాన్ సామ్రాజ్యవాద దురాక్రమణకు వ్యతిరేకంగా పోరాడటానికి వ్యూహాత్మక స్థావరాన్ని స్థాపించే లక్ష్యంగా అడుగులు వేసింది. ఈ కష్టతరమైన ప్రయాణంలో చైనా ప్రజల అంతర్గత శత్రువు చాంగ్-కై-షేక్ సైన్యాన్ని ఎదుర్కొంటూ, యుద్ధ ప్రభువులను, వారి తాబేదారులను ఓడిస్తూ ముందుకు సాగింది. ఈ చారిత్రక బాధ్యతాయుత క్రమంలో ఎదుర్కొన్న అనుభవాలే ఈ పుస్తకం.

దేశవ్యాప్తంగా పునాది ప్రాంతాలను నిర్మించుకుంటూ పురోగమిస్తున్న కమ్యూనిస్టు పార్టీపైనా, దాని ఎర్రసైన్యం పైనా చాంగ్-కై-షేక్ సైన్యం నాలుగు చుట్టివేత - అణచివేత క్యాంపెయిన్లను జరిపింది. ఈ దాడులను ఎర్రసైన్యం తిప్పికొట్టింది. ఈ సందర్భంలో చాంగ్-కై-షేక్ అయిదో చుట్టివేత - అణచివేత క్యాంపెయిన్ దాడిని దూకుడుగా ముందుకు తీసుకొచ్చాడు. చైనా కమ్యూనిస్ట్ పార్టీలో అంతర్గత సైద్ధాంతిక సంఘర్షణ ఫలితంగా ఈ దాడిని ఎదుర్కొనే పరిస్థితిలో లేదు, ఎందుకంటే పార్టీ కేంద్ర కమిటీ నాయకుడైన వాంగ్-మింగ్ దేశవ్యాప్తంగా తక్షణ విప్లవ పరిస్థితి ఏర్పడిందని, ప్రత్యక్షంగా శత్రువు సైన్యాలను ఎదుర్కోవచ్చు అనే వాదనను ముందుకు తెచ్చాడు, ఈ వాదనను కమ్యూనిస్ట్ పార్టీ స్వీకరించినది. దీనితో ఎర్రసైన్యం తీవ్రమైన అణచివేతను ఎదుర్కొని భారీ నష్టాలను పొందింది. ఇటువంటి సంక్లిష్ట పరిస్థితిలో కమ్యూనిస్టు పార్టీ తన ఎర్రసైన్యాన్ని వ్యూహాత్మక పునాది ప్రాంతాలను విడిచి పశ్చిమ దిశగా నడిపించింది. . ఈ ప్రయాణంలో ఎర్రసైన్యం తీవ్రమైన నష్టాలను ఎదుర్కొని నిస్సహాయ స్థితిలో ఉంది. ఇటువంటి పరిస్థితిలో క్వాంట్-టుంగ్-క్వాంగ్సీ-హునాన్ సరిహద్దు నుండి శత్రువు బలహీనంగా ఉన్న క్వీచే సరిహద్దుకు సాగి సున్-ఇ అనే ప్రాంతంలో ఆగి పార్టీ కేంద్ర కమిటీ సమావేశం జరుపుకుని వాంగ్-మింగ్ పంథా తప్పిదాలను ఎత్తిచూపి మావో ప్రతిపాదించిన వెసులుబాటు యుద్ధతంత్రాన్ని, గెరిల్లా యుద్ధతరహా దాడులను స్వీకరించి ఆయన నేతృత్వంలో కొత్త కమిటీని ఏర్పర్చుకుంది. ఈ

---

అసమానతలు, వివక్షకు వ్యతిరేకంగా జరిగే సాంఘిక పోరాటాలను అనుసంధానం చేయాలి. తద్వారానే సకల శ్రామిక ప్రజల ఐక్యత సాధ్యమవుతుంది. సకల సమస్యలకు పరిష్కారం సోషలిజంలోనే సాధ్యమన్నది చరిత్ర చెబుతున్న సత్యం.

అక్టోబర్ మహావిప్లవాన్ని ఒక చారిత్రక ఘటనగా స్మరించుకోవటానికి మాత్రమే మనం పరిమితం కాకూడదు. ఆ మహావిప్లవం చూపిన దారి నేటి ప్రపంచానికి కూడా అవసరమనే విషయాన్ని మనం విస్మరించజాలం. సామ్రాజ్యవాదం, ద్రవ్య పెట్టుబడిదారీ వ్యవస్థ నేటి ప్రపంచం మీద కూడా తమ ఆధిపత్యాన్ని చలాయిస్తోంది. సామ్రాజ్యవాదం, ద్రవ్య పెట్టుబడిదారీ వ్యవస్థ సంకెళ్ళను ఛేదించి, సోషలిజంవైపు పురోగమించటం సాధ్యమేనని 1917లో రష్యాలో సంభవించిన అక్టోబర్ మహావిప్లవం తెలియజేసింది. ఒక ప్రత్యేకమైన చారిత్రక పరిస్థితులలో సోవియట్ సోషలిస్టు ప్రయోగం జరిగింది. 1990లో సోవియట్ రష్యా విచ్ఛిన్నమయింది. కూలిపోయిన తర్వాత పాతికేళ్లలో ప్రపంచీకరణ, చరిత్రాంతం అంటూ, సిద్ధాంతాలకు కాలం చెల్లిందని, పెట్టుబడిదారీ విధానానికి ప్రత్యామ్నాయం లేదంటూ వాదనలు చేసిన మేధావులు నేడు తలలు పట్టుకుంటుంటే, మార్క్స్ మళ్లీ పురుడు పోసుకుంటున్నాడు. దోపిడీ, పీడన, అణచివేత ఉన్నంతకాలం ప్రత్యామ్నాయం కొరకు పోరాటాలు ఉంటాయి. అక్టోబర్ విప్లవ వారసత్వ స్ఫూర్తితో సమకాలీన సమాజంలో సోషలిజం కోసం ముందుకు సాగుదాం.



సమావేశపు చర్చలలో చాంగ్-కువా-టావో ఎర్రసైన్యాన్ని నైరుతి దిశగానున్న మైనారిటీ జాతుల ప్రాంతంలోనికి తీసుకొని పోయి స్థిరపర్చాలనే ప్రతిపాదన చేసాడు. ఈ ప్రతిపాదన మితవాదమని వ్యతిరేకించి మావో సూత్రీకరించిన యుద్ధపద్ధతిలో ప్రజా సమీకరణలు జరగాలని, జపాన్ వ్యతిరేక జాతీయ వ్యూహాత్మక పునాది ప్రాంతాన్ని ఏర్పర్చాలని, ఆ దిశగా శత్రువు బలహీనంగా ఉన్న ప్రాంతాల గుండా వెళ్ళాలని పార్టీ తీర్మానించింది. ఈ తీర్మానంతో ఎర్రసైన్యం పునర్నిర్మాణమై, విశ్రాంతి పొంది మళ్ళీ పుంజుకుని శత్రువును ఎదుర్కోవడానికి సిద్ధమైంది.

శత్రువు బలహీనంగా ఉన్న క్వీచే ప్రాంతాన్ని విముక్తి చేస్తూ సాగాలని తీర్మానం జరిగింది. అక్కడ నుండి ఉత్తర దిశగా సాగాలని ఆదేశాలు జారీ అయినాయి. ఉత్తర దిశగా సాగడంలో యాంగ్-జీ నదిని దాటడం, ఈ నది ఉపనది అయిన టాటూ నదిని దాటడం గొప్ప ప్రయత్నం. దీని కోసం సాహసోపేతంగా ఎన్నో త్యాగాలు చేయవలసి వచ్చింది. అక్కడి నుండి మైనారిటీ జాతుల నిలయమైన ఈ తెగల ప్రాంతం గుండా సాగి, గొప్ప గడ్డి భూములు, బురద నేలలను ఎదుర్కొంటూ మంచు పర్వతాలను ఎర్ర సైన్యం దాటింది. ఈ యాత్రలో చాంగ్-కై-షేక్ తొత్తుసైన్యం, జెచుయాన్ రాష్ట్రపు యుద్ధ ప్రభువు సైన్యాలు, షేన్సి యుద్ధ ప్రభువుల దాడులను ఎదుర్కోవాల్సి వచ్చింది. సుమారు మూడు లక్షల మందితో బయలు దేరిన ఎర్రసైన్యం ముప్పై వేల మంది మిగిలారు. పావోసో యుద్ధాలు, చిలోబిన్ యుద్ధాలు గెలిచి షెన్సి-కాన్సు-నింగ్సియా సరిహద్దులోని ఏనాన్ ప్రాంతం చేరుకున్నారు. ఈ ఏనాన్ ప్రాంతాన్ని జపాన్ దురాక్రమణ వ్యతిరేక జాతీయ వ్యూహాత్మక పునాది ప్రాంతంగా కమ్యూనిస్ట్ పార్టీ ఏర్పర్చింది..

ఈ విధంగా ఎర్రసైన్యం శత్రు నిర్బంధానికి వ్యతిరేకంగా వ్యూహాత్మకంగా తిరోగమిస్తూ తన లాంగ్ మార్చ్‌ను జైత్రయాత్రగా మలిచింది. ఏనాన్ ప్రాంతాన్ని జపాన్ సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటనా స్థావరంగా అభివృద్ధి పరచడమే కాదు. చాంగ్-కై-షేక్‌ను అనివార్యంగా దేశభక్త సంఘటన ఏర్పాటుకు నెట్టివేయడం జరిగింది. (చాంగ్-కై-షేక్ ప్రజా సంఘటనకు విద్రోహం చేసి ప్రజా ఉద్యమాన్ని అణచడానికి ప్రయత్నించాడు. జపాన్ ఓటమి తరువాత అమెరికన్ సామ్రాజ్యవాదంతో జట్టు కట్టాడు, కాని ప్రజాపోరాటం ముందు నిలవలేక చైనా వదిలి తైవాన్ పారిపోయాడు. చైనా 1 అక్టోబర్ 1949 న మావో నాయకత్వాన నూతన ప్రజాస్వామిక విప్లవం విజయవంతమైంది.

ఈ పుస్తకంలో ఇరవై కథలు (ఇలా కథలు అనడం సరికాదు) ఇవన్నీ వర్ణించాయి. ఈ ఇరవై కథలూ ఎర్రసైన్యం పెరుగుదలకు కారణాలు ఏమని వివరించాయంటే : 1) శత్రువు పురోగమించే టప్పుడు మనం వెనక్కి తగ్గుతాం. 2) శత్రువు ఆగినప్పుడు, విడిది చేసినప్పుడు మనం చికాకు పరుస్తాం. 3) యుద్ధం దాటవేయాలని శత్రువు ప్రయత్నించేటప్పుడు మనం దాడి చేస్తాం. 4) శత్రువు వెనుకంజ వేసేటప్పుడు మనం వెంబడిస్తాం. అలాగే ఎర్రసైన్యం క్రమశిక్షణ సూత్రాలేమనగా: 1) మీరు ఇంటిని వదిలి వెళ్ళేటప్పుడు తలుపులన్నింటినీ యథాస్థానాల్లో పెట్టాలి. 2) మీరు నిద్రించిన గడ్డి చాపల్ని చుట్టజుట్టి తిరిగి అప్పగించాలి. 3) ప్రజల పట్ల దయతోనూ వినయంగా ప్రవర్తించాలి: మీరు చేయగలిగినప్పుడు వారికి సహాయపడాలి. 4) మీరు బదులుగా పుచ్చుకున్న వస్తువులన్నింటిని తిరిగి ఇచ్చివేయాలి. 5) పాడు చేసిన వస్తువులన్నింటికి బదులుగా వస్తువులనప్పగించాలి. 6) రైతులతో వ్యవహరించే అన్ని సందర్భాల్లోనూ నిజాయితీగా ఉండాలి. 7) కొన్న వస్తువులన్నింటికీ ధర చెల్లించాలి. 8) ఆరోగ్య సూత్రాలను పాటించాలి; ప్రత్యేకించి మరుగుదొడ్లను ప్రజల ఇండ్లకు తగినంత దూరంలో నిర్మించాలి.

ఈ విధమైన కృషి, సాధన, పట్టుదల, క్రమశిక్షణ, యుద్ధనైపుణ్యంతో ఎర్రసైన్యం చైనా నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని సాధించింది. ఈ కర్తవ్యంలో సున్యీ ప్రాంత సమావేశపు ప్రాధాన్యతను, జపాన్ వ్యతిరేక ఐక్య సంఘటనకై ప్రజలను సమీకరించడం, సంఘాలు స్థాపించడం, ప్రతి ఎర్రసైనికుడు ఒకరి కోసం మరొకరు ఏ విధంగా త్యాగాలు చేసిందీ, తోడుగా నిలబడింది, రేషన్ సరఫరాల దళసభ్యుల నుండీ వంట వండే దళ సభ్యుల వరకూ వారికున్న ప్రాధాన్యత, త్యాగాలను విస్మరించ లేకపోవడం ఈ కథల్లో ఉన్నాయి. మరో ముఖ్య విషయం ఏమంటే ఆగకుండా వందల కిలోమీటర్లు ఆహారం లేకుండా సైతం నడవగలగడం, లక్ష్యం దిశగా సాగడం ఏ సైన్యానికి సాధ్యపడుతుంది? ఒక్క ఎర్రసైన్యానికి తప్ప! యుద్ధంలో ఏ కొంత విశ్రాంతి దొరికినా ప్రజలను చైతన్యపరచడానికి చేసిన కృషి, ప్రజలపై అపారమైన నమ్మకాన్ని, అలాగే వివిధ జాతుల పట్ల ఎర్రసైన్యం, కమ్యూనిస్టు పార్టీ విధానాన్ని ప్రజలకు తెలియచేయటం వంటివి కళ్ళకు కట్టినట్లుగా ఈ పుస్తకం ద్వారా మనకు తెలుస్తాయి.

నేడు వెనకబడిన, పేదరికపు గ్రామీణ భారతదేశం దోపిడీ పరిపాలకుల నుండి, కుల వివక్ష, అంటరానితనం, బానిసత్వం, స్త్రీలు ఎదుర్కొనే వివక్షలకు కారణమైన వర్గదోపిడీ నుండి విముక్తి కోసం జరుగుతున్న ప్రయత్నాలకు చైనా ఎర్రసైన్యం, కమ్యూనిస్టు పార్టీ స్ఫూర్తి అవసరం. వాటి అనుభవాలు పరిశీలించాలి, సమీక్షించాలి, ఆచరించాలి.

ఎందుకంటే చైనా ఎర్రసైన్యం, కమ్యూనిస్టు పార్టీ మాత్రమే అక్కడి ప్రజలను దోపిడి, పీడనల నుండి విముక్తి గావించింది (ఇప్పటి చైనాను పోల్చడం లేదు). ఎర్రసైన్యం నిలదొక్కుకుని యుద్ధం చేయడం, ప్రజలకు సహాయకారిగా ఉండటం, ప్రజా ఉత్పత్తిలో పాల్గొనడం, అత్యంత త్యాగ గుణం కలిగి ఉండటంతో పాటు పరిస్థితులపై, శత్రువు స్థితిగతులపై అవగాహనతో వెసులుబాటుతో కూడిన యుద్ధతంత్రం ద్వారా పునాది ప్రాంతాలను ఏర్పర్చుకుంటూ గ్రామాల నుండి పట్టణాలను స్వాధీనం చేసుకోగలిగింది. ఎర్ర ప్రభుత్వాన్ని స్థాపించింది. కాబట్టి ఈ అనుభవం మన భారత దేశానికి అత్యంత ఉపయోగకరం. అవసరం. (ఇప్పటికే దండకారణ్యంలో ఇది రుజువు చేస్తున్నారని గమనించాలి). ఈ రోజుకీ గ్రామాలకు వెళ్లాలా అనే వింత ప్రశ్నలేసే మిత్రులకు ఈ పుస్తకం కనువిప్పు చేస్తుంది. ఈ పుస్తకం ద్వారా అత్యున్నత మానవీయత స్వభావాన్ని దర్శించగలం. ఈ పుస్తకం మార్కెట్లో లభించడం లేదు, ఎక్కడైనా, ఎప్పుడైనా దొరికితే, తారాసపడితే తప్పక చదవాల్సిన రచన.



# ఆ శిరస్సు, స్తనాలు ఏమయ్యాయి?

పద్మకుమారి

చైనా విప్లవ నవల 'ఎర్ర మందారాలు'లో చియాంగక్కు అనే విప్లవకారిణి కొత్త ప్రాంతానికి బదిలీ అయి వెళుతుంది. ఆ నగరంలోకి ప్రవేశిస్తుండగా.. ఆ కోట గుమ్మానికి వేలాడుతున్న శిరస్సులు కనిపిస్తాయి. వాటిలో ఒకటి చియాంగక్కు భర్తదే. విప్లవోద్యమంలో పని చేస్తున్న ఆయనను చంపేసి అలా వేలాడదీశారు.



నవంబర్ 23న ఆంధ్రా ఒడిస్సా సరిహద్దు ప్రాంతంలోని బెజ్జంకి దగ్గర జరిగిన బూటకపు ఎన్‌కౌంటర్లో చనిపోయిన విప్లవకారుల శవాల స్వాధీనానికి మల్కాన్‌గిరికి వెళ్లాం. మావోయిస్టు భారతి మృతదేహం కోసం ఆమె కుటుంబ సభ్యులతో పాటు చైతన్యమహిళా సంఘం నాయకురాలు దేవేంద్ర వచ్చింది. అక్కడికి వచ్చాక గాని ఆమెకు తన జీవిత సహచరుడు ప్రభాకర్ కూడా ఈ బూటకపు ఎన్‌కౌంటర్‌లో చనిపోయాడని తెలియదు. అప్పుడు నాకు ఈ నవలలో పైన చెప్పిన సన్నివేశం గుర్తుకు వచ్చింది. 2003లో అమరుల బంధుమిత్రుల సంఘం ఏర్పడ్డప్పటి నుంచి ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాలతోపాటు ఒడిస్సా, ఛత్తీస్‌ఘడ్, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాల్లో అమరులైన విప్లవకారుల మృతదేహాల స్వాధీనానికి వెళుతున్నాం. ఇన్నేళ్లలో ఎన్నడూ కలగని విషాదకరమైన అనుభవం మల్కాన్‌గిరిలో కలిగింది. తల లేని మావోయిస్టు మృతదేహాన్ని మొదటిసారి అక్కడ చూడాల్సి వచ్చింది.

ఎన్‌కౌంటర్ జరిగిందని పోలీసులు అనేక మంది నాయకుల పేర్లు, కార్యకర్తల పేర్లు ప్రకటిస్తూ వచ్చారు. మొదటి రోజే 18 మంది పేర్లు ప్రకటించడంతో ఆ కుటుంబాల వాళ్లందరం కలిసి మల్కాన్‌గిరి వెళ్లాం. దాదాపు ఎనభై మందిమి ఉంటాం. తెలంగాణలో అయినా, ఆంధ్రప్రదేశ్‌లో అయినా ఎన్‌కౌంటర్లలో చనిపోయిన మావోయిస్టుల మృతదేహాలను సాధారణంగా మార్చురీలో ఉంచుతారు. సుప్రీంకోర్టు ఆదేశాల మేరకు పోస్టుమార్టం నిర్వహించకపోవచ్చు, రక్త సంబంధీకులు వచ్చే వరకు మృతదేహాలు చెడిపోకుండా భద్రపరచకపోవచ్చు. మృతదేహాలతో అమానుషంగా ప్రవర్తించి, బంధువులకు ఇవ్వకుండా వేధించిన సందర్భాలు కూడా ఉన్నాయి.

అయితే ఒడిస్సా పోలీసులు ఈ మాత్రం పద్ధతులు కూడా పాటించదల్చుకోలేదు. ఎస్పీ ఆఫీసు ఆవరణలో ఉన్న షెడ్‌లో మృతదేహాలను ఉంచారు. పాత సామాన్లను పెట్టినట్లు చెక్క పెట్టెల్లో కుక్కి పెద్ద కంటెయినర్(పెద్ద ట్రక్కులో)లో పడేశారు. దాని తలుపు తెరవగానే దాదాపు ఇరవై పెట్టెలు బైటికే కనిపించాయి. వాటిలో తమ వాళ్ల శవాలు ఉంటాయని తెలిసి రక్త సంబంధీకులు గొల్లున ఏడ్చారు. మొదట ఫొటోలు చూపించి దానికి ఉన్న నెంబర్ ప్రకారం పెట్టెల్లో ఉన్న శవాలను తీసకపొమ్మన్నారు. రెండు రోజులుగా అనేక పేర్లు ప్రకటించడంతో తమ వాళ్లు ఉన్నారేమో అని వెతుక్కోడానికి వచ్చిన కుటుంబ సభ్యులు ఇది సహించలేకపోయారు. అన్ని శవాలను అందరికీ చూపించాలని ఆందోళన చేయాల్సి వచ్చింది. రెండు రోజుల తర్వాత కూడా మృతదేహాలను చూసుకునే అవకాశం ఇవ్వకపోవడంతో కుటుంబాల వాళ్లు ఆగ్రహించారు. దీంతో పోలీసులు విడత వారీగా కుటుంబాల వాళ్లను లోపలికి తీసికెళ్లి మృతుల ఫొటోలు చూపి పెట్టెలకు ఉన్న నెంబర్ల ప్రకారం శవాలను చూపించడం మొదలు పెట్టారు. అది కూడా కంటెయినర్‌లోంచి నెంబర్ల ప్రకారం పెట్టెలు కిందికి దించి మూత తీసి ముఖం వరకు మాత్రమే చూపించారు.

అలా మొదట గుర్తించిన ఆరు శవాలను కిందికి దించారు.

రాష్ట్ర కమిటీ సభ్యులు వెంకటరమణ(పాడేరు), దయ(నల్గొండ) శవాలు మాత్రమే చూడటానికి వీలుగా ఉన్నాయి. పాలిథీన్ కవర్లలో శవాలను చుట్టేసి, పౌరిపొట్టుపోసి, నాలుగు ఐస్ ముక్కలు వేసి పెట్టెల్లో కుక్కేశారు. అది కూడా మొదటి నాలుగైదు శవాలకే. మిగతా వాటి విషయంలో ఆ మాత్రం జాగ్రత్త తీసుకోలేదు. ఐస్ ముక్కలు కరిగిపోవడంతో నీళ్లు, శరీరాల నుంచి కారిన రక్తం, పొట్టు కలిసి ముఖాలు కనిపించడం లేదు. ఆ నీళ్లు తోడేసి, పొట్టు తీసేస్తేగాని ముఖాలను పోల్చుకోలేకపోయాం. కొన్ని శవాలను చూపించి పోలీసులు ఆ దుర్గంధం భరించలేక పక్కకు వెళ్లిపోయారు. ఆ తర్వాత కుటుంబాల వాళ్లే పెట్టెలు తెరిచి చూసుకోవాల్సి వచ్చింది.

ఎన్‌కౌంటర్లో చనిపోయిన మమత(శ్రీకాకుళం జిల్లా బాతుపురం) మృతదేహాన్ని తీసుకపోవడానికి ఆమె సోదరి కోమలమ్మ శ్రీకాకుళం జిల్లా నుంచి వచ్చింది. మమత సహచరుడు కూడా చనిపోయాడనే వార్తలు రావడంతో ఆయన అన్నదమ్ములూ వచ్చారు. మమత ముఖం చూసి గుర్తుపట్టిన కోమలమ్మ పాలిథీన్ కవర్ గుండెల దాకా తెరిచింది. శవం మీద మరో బట్ట కూడా లేదు. స్తనాలు కనిపించలేదు. రెండూ కోసేశారు. ఈ దృశ్యాలను మీడియా చిత్రీకరించింది.

ఇక్కడ పోస్టుమార్టం ఇలా చేస్తారా? అని పోలీసులను అడిగాం. అవి గాయాలని బుకాయించారు. ఆమెను హింసించడంలో భాగంగా స్తనాలు రెండూ కోసేశారని తెలుస్తూనే ఉంది. కోమలమ్మ ..' నా చెల్లెల్ని కోసేసేరే..బిడ్డకు పాలిచ్చే రొమ్ములు కదా.. వీళ్లు తల్లిపాలు తాగలేదా?..' అని ఏడవడం మొదలు పెట్టింది. ఇంక చూడలేక పాలిథీన్ కవర్ మూసేసింది. శవం మీద గుడ్డ కూడా కప్పకుండా అలా చుట్టేయడం ఆమె భరించలేకపోయింది. 'ఆడపిల్లను ఇంత మంది మగవాళ్ల ముందు ఇట్ల బట్టలు లేకుండా చూడాల్సి వచ్చింది. మనం మాత్రం బట్టలు కట్టుకోడం దేనికి? నేనెందుకమ్మా బట్టలు కట్టుకోనేది..' అని భుజం మీది కొంగు కిందికి వదిలేసింది. ఆ తల్లి తన వంటి మీది బట్టలు ఎక్కడ తీసేస్తుందో అని నాకు అనిపించింది. ఆమెను ఒడిసిపట్టుకొని పక్కకు తీసుకొని వచ్చాను.

అంత దు:ఖంలో కూడా మణిపూర్ మహిళలు అక్కడి సైనికుల దురాగతాలకు వ్యతిరేకంగా నగ్న ప్రదర్శన చేయడం గుర్తుకు వచ్చింది. అప్పుడు కొందరం ఇలాంటి ప్రదర్శనలు చేయడం ఏమిటని అనుకున్నాం. మహిళలను రాజ్యం ఎందుకు ఈ స్థితికి తీసుకొని వస్తోంది?

భారతి(మెదక్) మృతదేహానికి కూడా ఒక స్తనం లేదు. మరో దాని మీద గాయం ఉంది. పోస్టుమార్టం కోసం కావచ్చు.. ఆమె తల దగ్గర తెరిచి మళ్లీ కుట్లు కూడా వేయకుండా అలాగే వదిలేశారు. ప్రజాకళామండలి నాయకుడు ప్రభాకర్ ముఖంలో సగభాగం లేదు. దంతాలు బైటికి పొడుచుకొని వచ్చాయి. భుజాలు వెనక్కి విరిచేయడంతో వక్షస్థలం ఎముకలు పైకి వచ్చాయి. డొక్కల్లో అనేక గాయాలున్నాయి. పేగులు బైటికి వచ్చాయి.

నాలుగైదు మృతదేహాలను మాత్రమే వరుసగా చూడగలిగాం. మనిషి గుండెకు తట్టుకునే శక్తి ఎంత ఉంటుంది? అలాంటి శవాలను ఎన్నని చూడగలం? ఇంతలో మా సంఘం సభ్యురాలు ఒకామె పరిగెత్తుకుంటూ వచ్చి 'అక్కా...అక్కడ ఇరవైయ్యో నంబర్ శవానికి తల లేదు..' అని చెప్పింది. అసలు శవాలను నెంబర్లతో గుర్తుపట్టాల్సి రావడం ఏమిటి? వీళ్లంతా నిన్నటి దాకా సజీవమైన మనుషులు కదా? ఎన్నో కలలు, ఆదర్శాలు, విలువలు ఉన్న వాళ్లు కదా? అలాంటి వాళ్లను చంపేసి ఓ పెట్టెలో కుక్కేసి ఓ నెంబర్ ఇచ్చేశారు. మేం కూడా ఉదయం నుంచి నంబర్లతోనే వ్యవహరించక తప్పని స్థితి రాజ్యం కల్పించింది. శవాలను గౌరవించడం బతికి ఉన్నవాళ్ల సంస్కారానికి గుర్తు. తను చంపిన విప్లవకారుల శవాలపట్ల కూడా రాజ్యం కొన్ని పద్ధతులను పాటించాలని అమరుల బంధుమిత్రుల సంఘం కొట్లాడుతున్నది. ఆ మనుషుల విశ్వాసాలకు తగినట్లు మృతదేహాలకు గౌరవంగా అంత్యక్రియలు జరపడం ఒక బాధ్యతగా తీసుకున్నది. అలాంటి మేం కూడా అమరులను కేవలం ఒక అంకెతో వ్యవహరించాల్సి రావడం, నిర్జీవమైన ఫొటోలతో కుటుంబాలు గుర్తుపట్టాల్సి రావడమే విషాదం అనుకుంటుంటే శవానికి తల కూడా లేదని తెలిసి దిగ్భ్రాంతికి గురయ్యాం. మా సంఘ కార్యకర్తలకు తల లేని శవాన్ని చూడ్డం అదే మొదటిసారి. తల లేదు కాబట్టి ఆ శవాన్ని గుర్తు తెలియని మృతదేహాల లిస్టులో పోలీసులు వేశారు. సాయంత్రం డిఐజీ షైనీ మిశ్రా దగ్గరికి వివిగారు వెళ్లి ఆ మృతదేహం శిరస్సు ఏమైందని ప్రశ్నించారు.

ఆమె నింపాదిగా 'లేదేమో..' అన్నది.

'తల లేకపోవడం ఏమిటి? అన్ని శవాలకు ఫొటోల్లో తలలు ఉన్నాయి కదా?' అని ఆయన అడిగారు.

ఆమె ఒక్క క్షణం ఆగి ఏ ఫీలింగ్స్ లేకుండా నెమ్మదిగా ఎస్పీతో ' ఆ తల ఎక్కడైనా ఉందేమో కాస్త చూడండి' అని పురమాయించింది.

అది ఒక మనిషి తల కదా? ప్రభుత్వం వెల కట్టిన తల అది. అలా తలలకు వెల కట్టి పోలీసులను హత్యలకు ప్రోత్సహిస్తున్నది. మామూలు వాళ్లను ఆ తలల కోనవే కోవర్టులుగా మార్చుకుంటున్నది. ఆ తలలోని ఆలోచనలు, కలలు చూసే భయపడుతున్నది. అలాంటి విప్లవకారుల తల విలువ ప్రభుత్వానికి తెలియదా? తెలిసీ మాయం చేయడంలోని మర్మం ఏమనుకోవాలి? తల లేకుంటే శవానికైనా ఉనికి ఏమున్నది? ఏదో వస్తువు పడిపోయినట్లు ఆ అధికారి వెతకండి అనడం మామూలు మనుషులకు సాధ్యమయ్యే పనేనా? మనుషులు అనే మాటలేనా? ఇవి.

మర్మాంగాలను ఛిద్రం చేస్తున్న చోట, పాలిచ్చే వక్షోజాలను కోసి పారేస్తున్న చోట, తలెత్తి పోరాడమని ప్రజలకు నేర్పిస్తున్న వాళ్ల తలలు మాయం చేస్తున్నచోట, శవాన్ని పైకి ఎత్తితే జారిపోతున్న పేగులను తల్లులు మూటకట్టుకొని తెచ్చుకుంటున్న చోట, శవాన్ని కట్టేసిన పాలిథీన్ మూటను కదిలిస్తే చీమూ నెత్తురూ కలిసిన నీరు వరదలా పారుతున్న చోట జనం ఎలాంటి పోరాటం చేయాలి? ఏ పోరాట పద్ధతిని ఎంచుకోవాలి?



(రోమన్ కేథలిక్కులకు ప్రశ్నలు-జవాబుల పద్ధతిలో మత విషయాలు బోధించే పద్ధతిని CATECHISM అంటారు. 1905లో లూయిస్ కాస్ ఫ్రై అనబడే అమెరికన్ మార్క్స్ 'పెట్టుబడి'ని ఈ పద్ధతిలో అందరికీ సులభ గ్రాహ్యంగా చెప్పటానికి ప్రయత్నించాడు. CATCHISM OF KARL MARX"S CAPITAL పుస్తకానికి తెలుగు అనువాదం సీరియల్‌గా అందిస్తున్నాం. - సం.)

# కార్ల్ మార్క్స్ పెట్టుబడి - సరుకులు-డబ్బు

**లూయిస్ కాస్ ఫ్రై**

అనువాదం: ముక్తవరం పార్థసారథి

(గత సంచిక తరువాయి...)

(3)

88. అంటే, సరుకుల విలువను బట్టే మారకం జరుగుతున్నది. వివిధ సరుకుల్లో వివిధ వైరుధ్యాలు గల శ్రమ నిక్షిప్తమై ఉన్నప్పటికీ, ఇప్పుడది ఒక అమూర్తమైన, సాధారణమైన శ్రమగానే పరిగణింపబడుతున్నది.

89. సరుకుల విలువను మనం ఎన్ని రకాల వ్యక్తపరచగలం? దీనికి అంతం లేదు. ఎన్ని రకాల అది మారకం చెందగలిగితే దానికి అన్ని విలువలున్నాయన్నమాట. ఒక్కో వైపు నుండి చూస్తే ఒక్కో రంగులో కనిపించే (రంగు) రాళ్ళలాగ మారుతుంది విలువ.

90. అంటే, ఉపయోగపు విలువతో సంబంధం లేకుండా మారకం విలువ మారుతుంటుంది.

91. కాని, కొన్ని సార్లు శ్రమతో సంబంధం లేకుండా సరుకుల మారకం జరుగుతుంది. ఉదాహరణకు ఒక ఆవు వెయ్యి రూపాయలకు లేదా మరేదో సరుకులతో మారకం జరిగిందనుకోండి.

92. చివరికి, సరుకుల్ని సరుకులుగా గాక, కేవలం విలువలుగానే పరిగణించే పరిస్థితి వస్తుంది.

93. ఒక సరుకుకు సార్వత్రికంగా మారగలిగే విలువ ఎలా వస్తుంది? మిగతా సరుకుల్ని, ఆ సరుకు విలువతో పోల్చినప్పుడు.

94. దీన్ని బట్టి ఏం అర్థమవుతుంది? సరుకుల్ని విలువలుగా చూడటం అనేది సామాజిక పరిణామం గనక, వీటిని సామాజిక సంబంధాలుగా కూడా పరిగణించవచ్చును.

95. అంటే, 10 పౌండ్ల టీ=20 గజాల గుడ్డ=5 పౌండ్ల కాఫీ అనుకుంటే, వాటిలో సామాజిక శ్రమ విలువ కూడా ఆ నిష్పత్తిలో ఉన్నట్టే. అంటే ఒకే మానవ శ్రమ ఇన్ని రూపాలలో వ్యక్తమవుతున్నది.

### సరుకుల విలువ డబ్బుగా ఎలా మారుతుంది?

96. సార్వజనీనమైన విలువ అంటే ఏమిటి? సామాన్యంగా అందరూ అంగీకరించే విలువ అని అర్థం. ఏ సరుకుకు ఈ విలువ ఉంటుంది? అన్ని సరుకులకూ ఈ విలువ ఉంటుంది.

97. సరుకుల్లోని ఏ లక్షణం డబ్బు విలువను సంతరించుకుటుంది? సామాజికంగా ఆ సరుకును డబ్బు రూపంలో అంగీకరించినప్పుడు దానికా రూపం వస్తుంది.

98. సరుకు సామాజికంగా ఏ విధిని నిర్వర్తిస్తుంది? ఇతర సరుకులతో కలిసి, మార్పిడికి అనుకూలమైన ఒక కొలమానంగా ఉంటుంది.

99. ఇలా సార్వత్రికతను సంపాదించుకున్న సరుకేది?

100. బంగారం.

101. మరి డబ్బు ఎలా వచ్చింది?

102. బంగారానికి మరో రూపం డబ్బు.

103. ఉదా॥ 20 గజాల గుడ్డ=1 కోటు=10 పౌండ్ల టీ= 5 పౌండ్ల కాఫీ=2 గ్రాముల బంగారం=5 వేల రూపాయలు.

104. ఇతర సరుకుల మారకంలో, రూప లక్షణాలలో మౌలిక తేడలున్నాయి. కాని, బంగారం రూపాయలుగా మారినప్పుడలాంటి తేడా కనిపించదు. రెండూ సార్వత్రికంగా మార్పు చెందగలిగినవే.

105. బంగారం, డబ్బు రూపం ఎలా సంతరించుకున్నది?

106. ఇతర సరుకులతో పోల్చినప్పుడు ఇదీ ఒక సరుకే గనక. బంగారం సార్వత్రిక మారకపు కొలమానంగా మారినందు వల్ల, అది డబ్బు అనబడే మరో సరుకుగా రూపాంతరం చెందింది.

107. అంటే, డబ్బు యొక్క మౌలిక రూపం, మళ్ళీ సరుకే అని మనం గ్రహించాలి.

### సరుకులకు అతీంద్రియ శక్తులు ఎలా వచ్చాయి? (ఫెడిసిజం ఆఫ్ కమొడిటీస్)

108. అత్యంత సాధారణమైనది సరుకు. దీని గురించి మనం బుర్ర బద్దలు కొట్టుకోవలసిన అవసరం లేదు. సరుకంటే తెలియని మనిషుండడు.

109. కాని, విశ్లేషించి చూస్తే, ఇదో వింత పదార్థంలా అతీంద్రియ శక్తులను కలిగి ఉన్న అద్భుత సృష్టిలా తోస్తుంది. పూజ గదిలో ప్రతిష్ఠించి ఆరాధించవలసిన దేవతామూర్తి అని కొందరనుకున్నా ఆశ్చర్యం లేదు.

110. సరుకును ఒక విలువగా పరిగణించినంత వరకూ అతి సాధారణమైనదే. అంటే మంత్రాలు, మాయలేమీ ఆపాదించక్కర్లేదు. అది మనుషుల అవసరాలను

తీరుస్తుంది. మానవ శ్రమతో తయారైనది. మనిషి తన శ్రమతో ప్రకృతిలో లభించిన పదార్థాన్ని సరుకుగా మార్చాడు.

111. ప్రకృతిలో దొరికే కలప మారక శ్రమతో టేబుల్‌గా మారుతుంది. అయినా దాని మౌలిక రూపం కలపే.

112. కాని, టేబుల్‌గా అవతారమెత్తగానే, కలప స్వభావమే మారిపోయింది. నాలుగు కాళ్ళ మీద అది ఠీవిగా నేల మీద నిల్చుంటుంది. దాన్నిచూడగానే మనకు కొత్త కొత్త ఊహలొస్తాయి.

'మానవ శ్రమతో రూపాంతరం చెందిన కలప' అని మాత్రమే అనుకుంటామా! అమ్మో, దానితో ఎన్ని ఉపయోగాలో! ఉన్నవీ, ఊహించుకున్నవీ.

113. అయితే, ఈ ఊహలన్నీ కేవలం దాని ఉపయోగపు విలువ వల్ల మాత్రమే రాలేదు.

114. మనిషి మేధస్సు, కండరాలు, నరాలు అన్నీ కలిసి, కలపను ఒక అపూర్వ సృష్టిగా మన ముందు ప్రదర్శిస్తున్నాయి. ఎంత పరిమాణంలో కలప అవసరమైందని మన మాలోచించం. అయితే, టేబుల్ తయారీకి అవసరమైనది కేవలం మానవ శ్రమ కాదు. ఉపయోగకరమైన, ఒక లక్ష్యంతో చేసిన మానవ శ్రమ.

115. మనుషులు ఒకరి అవసరాలు తీర్చడానికి మరొకరు శ్రమ పడినప్పుడు దాన్ని సామాజిక శ్రమ అంటాం. మరి ఈ మానవ శ్రమ ఎలా వ్యక్తమవుతుంది? సరుకుల్లో.

సరుకుల మధ్య ఉన్న సంబంధాన్ని బట్టి, మనుషుల మధ్య ఉన్న సంబంధాలు నిర్ణయించబడతాయి.

116. సరుకు, అతీంద్రియ శక్తిగా ఎలా మారింది? మనుషుల శ్రమకున్న సామాజిక లక్షణం వల్ల, సరుకుకు అతీంద్రియ శక్తులు ఆపాదింపబడు తున్నాయి. సరుకుల మధ్య ఉన్న సంబంధాలు, మానవ సంబంధాలుగా మారుతున్నాయి. శ్రమ, సరుకుగా పరిణామం చెందిన క్రమంలో జరిగిందిది. ఉదా॥ కంటి నరం స్పందించడం వల్ల మనం వెలుగును చూడగలుగుతున్నామని గాక, మన ప్రమేయం లేకుండా వెలుగు ఎక్కడి నుండో వస్తున్నదని అనుకుంటాం. 'చూడటం' అంటే మన ఇంద్రియ స్పందన మాత్రమే.

117. భౌతికమైన వస్తువుల మధ్య భౌతిక సంబంధాలుంటాయి. మరి సరుకుల మధ్య సంబంధాలెలా ఉంటాయి? పూర్తి భిన్నంగా.

సరుకుల భౌతిక రూపాలతో సంబంధం లేకుండా మానవ సంబంధాలే, సరుకుల మధ్య సంబంధాలుగా మారతాయి. మత విశ్వాసాలే దీనికో మంచి ఉదాహరణ.

మన ఊహలు సృష్టించిన రూపాలకు మనం స్వతంత్ర ప్రతిపత్తి కల్పించి ఆరాధిస్తాం. వాటితో మనం సంబంధాలు ఏర్పరచుకుంటాం.

సరుకుల లోకం కూడా అలాంటిదే. మనుషులు తమ స్వహస్తాలతో తయారు చేసిన సరుకులు స్వంత వ్యక్తిత్వాలతో మనలను విస్మయ పరుస్తున్నాయి. కాని, సరుకుల ఉత్పత్తి క్రమంలో ఇది అనివార్యం. మానవ శ్రమ కున్న సామాజిక లక్షణం వల్లనే సరుకులకు ఈ మాంత్రిక శక్తులబ్బుతున్నాయి. మన సృష్టి మనల్ని సమ్మోహనపరుస్తున్నది.

118. అసలు వస్తువులు, సరుకులుగా ఎలా పరిణామం చెందుతున్నాయి? ప్రైవేటు వ్యక్తులు, పరస్పర సంబంధం లేకుండా, తమ శ్రమ శక్తితో వాటిని తయారు చేసారు గనక. ఈ ప్రైవేటు శ్రమంతా కలిస్తే, అదే సమాజంలోని మొత్తం శ్రమ అవుతుంది.

తమ ఉత్పత్తులను మార్పిడి చేసుకోవటానికి తప్ప, ప్రైవేటు వ్యక్తులు ఒకరితో ఒకరు సంబంధాలు పెట్టుకోరు గనక, వాళ్ళ శ్రమ, సరుకుల రూపంలో మాత్రమే వ్యక్తమవుతుంది. అంటే, వ్యక్తి శ్రమ, సమాజ శ్రమలో భాగంగా, సరుకు రూపంలో మార్పిడి చెందుతుంది. అదే సరుకుల మధ్య సంబంధంగా మారుతుంది. చివరికవి వ్యక్తుల మధ్య భౌతిక సంబంధాలుగా, వస్తువుల మధ్య సామాజిక సంబంధాలుగా మారుతున్నాయి.

మార్పిడి వల్ల మాత్రమే వస్తువుల ధరలు నిర్ణయించబడుతున్నాయి.

119. వస్తువు తన విలువను బట్టి ఒక సామాజిక కొలమానంగా మారుతున్నది.ఉపయోగాన్ని విలువగా మార్చే సామాజిక ప్రక్రియను మనం పరిశీలించాలి.

శ్రమతో ఉత్పత్తి అయిన వస్తువులను భౌతికీకరించబడిన శ్రమగా పరిగణించాలన్న అవగాహన, మానవ జాతి చరిత్రలో ఒక కొత్త శకానికి నాంది పలికింది.

120. అయితే ఈ ప్రైవేటు వ్యక్తుల శ్రమలోని సామాజిక లక్షణం ఎక్కడ నిక్షిప్తమై ఉంది?

వస్తువులు ఏ నిష్పత్తిలో మార్పిడి చెందుతున్నాయన్నది ఇందుకు కీలకం. కాని ఈ నిష్పత్తి ఒక సామాజిక సాంప్రదాయం మాత్రమే. ఉదాహరణకు ఒక టన్ను ఇనుము, పది గ్రాముల బంగారానికి సమానమంటే, వాటి రూప, లక్షణాలలో ఎన్ని తేడాలున్నా, ఒక దానితో ఒకటి మార్పిడి చెందగలవు గనుక, తేడా ఏముంది? అనుకుంటాం.

అయితే, పరిస్థితులను బట్టి మార్పిడి పరిమాణాలు మారుతుంటాయి. బాగా అభివృద్ధి చెందిన సరుకుల ఉత్పత్తి దశలో మనకు కొన్ని విషయాలు స్పష్టమవుతాయి. పరస్పర సంబంధం లేని ప్రైవేటు వ్యక్తుల శ్రమకు రకరకాల శ్రమ విభజనగా గుర్తింపు వస్తుంది. చివరికి ఆయా శ్రమ విలక్షణత తగ్గి, పరిమాణాత్మకమైన శ్రమగా మాత్రమే పరిగణింపబడుతుంది.

ఎందుకిలా జరుగుతుంది?

సరుకుల మార్పిడి బాగా పెరిగి, సామాజికంగా ఉపయోగకరమైన, అమూర్తమైన శ్రమను మాత్రమే

గుర్తిస్తాం.

కాని ఇది ఎంత పొరబాటంటే. ఇల్లు కూలి మన మీద పడినప్పుడు మాత్రమే గురుత్వాకర్షణ శక్తి ఉన్నదని గ్రహించటం లాంటిది.

ఏ సరుకుకు ఎంత శ్రమ సమయం అవసరమైందనేది ఒక చిదంబర రహస్యం-అవును మరి. సరుకుల విలువను బట్టి ఇదీ నిరంతరంగా మార్పు చెందుతుంటుంది.

121. సరుకుల అంతరార్థం గ్రహించటానికి ముందుర మనం తెలుసుకోవలసిన విషయాలేమిటి?

వస్తువులకు సరుకులుగా మారే దశ ఎప్పుడొచ్చింది? ఎలా వచ్చింది? ఈ సరుకుల చలామణీ ఎలా జరుగుతున్నది? విలువను ఎలా నిర్ణయిస్తారు?

ధరను బట్టి.

విలువను డబ్బు రూపంలో చూసినప్పుడు ఇది సాధ్యపడింది. అన్ని వస్తువులూ మార్పిడి చెందే క్రమంలో సరుకులుగా మారి, వాటిలో ఉన్న శ్రమను బట్టి విలువ నిర్ణయించబడినా, బంగారం లేదా వెండి, తరువాత డబ్బు వచ్చిన తర్వాతే ప్రపంచంలో ఉన్న అన్ని సరుకుల ధరలనూ ఒక దానితో ఒకటి పోల్చటానికి వీలు కలిగింది.

122. బూర్జువా ఆర్థిక వ్యవస్థ ఆధారపడిందే ఈ ప్రాతిపదిక మీద. సరుకుల ఉత్పత్తి, చలామణీ పెరగటానికి మూలమిదే.

123. బూర్జువా ఆర్థిక వ్యవస్థ గురించి మాట్లాడేటప్పుడు అందరూ రాబిన్‌సన్ క్రూసో ను ఉదహరిస్తారు. మనం కూడా అతణ్ణి ద్వీపం మీద కాసేపు ఊహించుకుందాం.

సముద్రం మధ్యలో చిన్న దీవి మీద అతనొంటరి. అవసరాలూ తక్కువే. చిన్న చిన్న పనులు చేసినా అవన్నీ కాలక్షేపంకోసమూ, సరదా కోసం మాత్రమే.

అయితే, అతడు ఎన్ని రకాలు పనులు-ఉదాహరణకు పనిముట్లు తయారు చేసుకోవటం, కుర్చీలు, బల్లలు చేసుకోవడం, మేకల్ని మేపుకోవడం వగైరా- చేసినా, అవన్నీ రాబిన్‌సన్ క్రూసో అనబడే ఒకే వ్యక్తి చేస్తున్నాడన్న స్పృహ అతడికుంది. అంటే మానవ శ్రమ అనేక రకాల వ్యక్తమవుతుంది.

అవసరాన్ని బట్టి ఒక్కొక్క పనికీ కొంత సమయం కేటాయించుకున్నాడు. పని యొక్క సంక్లిష్టతను బట్టి, ఒక పనికి మరొక పని కన్నా ఎక్కువ సమయం అవసరమవుతుంది. మొత్తం మీద సులభమైనా, కష్టమైనా అన్ని పనులూ అతడే చేసుకోక తప్పదు.

ఇదీ అనుభవం రాబిన్‌సన్ క్రూసో నేర్పిన పాఠం. తనను అక్కడికి తీసుకొచ్చిన పడవ అవశేషాల నుండి, ఒక గడియారం, అక్కౌంట్స్ రాసే లెడ్జర్, పెన్నూ, సిరాబుడ్డి సేకరించి, ఇంగ్లీషు వాళ్ళకు పుట్టుకతో వచ్చిన స్వభావంతో లెక్కలు రాయటం ప్రారంభిస్తాడు.

మొదట తన దగ్గర ఉన్న వస్తువుల జాబితా సిద్ధం చేస్తాడు. ఆ తర్వాత తను తయారు చెయ్యవలసిన వస్తువుల జాబితా, ఒక్కొక్క వస్తువు తయారీకి అవసరమైన సమయం, సుమారుగా వాటి ధర వగైరా రికార్డు చేస్తాడు. ఇక్కడ క్రూసోకూ, అతడి 'సంపద'కూ ఉన్న సంబంధం చాలా ప్రాథమికమైనది. అతడికున్న కొద్దిపాటి అవసరాల కోసం తయారు చేసుకున్న కొద్దిపాటి వస్తువులు అవి.

124. ఈ రాబిన్‌సన్ క్రూసో కాసేపు యూరోపియన్ మధ్య యుగాలలో ఉన్నట్టుగా ఊహించుకుందాం.

అది బానిసలు, అర్ధ బానిసలు, పాలెగాళ్ళు, మతాధికారులు, రాజులు, సామంతుల కాలం.

అధికార వర్గం మీద ఆధారపడిన వాళ్ళే అత్యధికులు. అంటే ఇతర సామాజిక సంబంధాల లాగే, ఉత్పత్తి సంబంధాలు కూడా భిన్నంగా ఉంటాయి. ఇది సరుకులు ఉత్పత్తి చేసే సమాజం కాదు. ప్రతి అర్ధ బానిసకూ తను యజమాని భూస్వామి సేవలో ఎన్ని గంటలు పనిచేయాలో తెలుసు. వీళ్ళు మతాధికారులకు కూడా సేవలందించాలి. దక్షిణలు సమర్పించుకోవాలి. ఇదంతా పుణ్యం కోసం కాదు. అది సామాజిక అవసం. ఆనాటి సామాజి సంబంధాలన్నీ, వ్యక్తి గత సంబంధాలలాగే కనిపిస్తాయి.

అయితే ఈ విషయం గ్రహించటానికి మనం మధ్య యుగాల దాకా వెళ్ళక్కర్లేదు.

పితృస్వామ్య వ్యవస్థ బలంగా ఉన్న ఒక రైతు కుటుంబాన్నే తీసుకోండి. ధాన్యం పండిస్తారు. పశువుల్ని పెంచుతారు. గుడ్డలు నేస్తారు.

125. ఇవన్నీ కుటుంబానికి అవసరమైన వస్తువులే. కాని సరుకులు కావు.

ఈ వస్తువుల ఉత్పత్తికి అవసరమైన శ్రమ, దున్నటం, పశువుల్ని మేపడం, దారం వడకటం, నేయటం లాంటివన్నీ వాళ్ళ నిత్య జీవితంలోని సామజిక బాధ్యతే- కుటుంబ బాధ్యతలలో భాగమే. "సరుకుల ఉత్పత్తి సమాజం"లో ఉన్న శ్రమ విభజన లాంటిదే ఇదీ. ఈ పనులు చేయుటానికి అవసరమైన సమయం, వయసును బట్టి ఆడవాళ్ళకూ, మగవాళ్ళకూ వేర్వేరుగా ఉంటుంది. అంతేనా, వాతావరణాన్ని బట్టి, రుతువులను బట్టి కూడా మారుతుంది. వ్యక్తి శ్రమ శక్తి కుటుంబ శ్రమ శక్తిలో భాగం. అంటే, కుటుంబం కోసం ఎవరే పని చేసినా అది సామాజిక లక్షణం కలిగి ఉంటుంది.

126. ఇప్పుడు మనం స్వేచ్ఛగా జీవిస్తూ, సమిష్టి ప్రయోజనం కోసం శ్రమిస్తున్న కొందరు వ్యక్తుల్ని ఊహించుకుందాం. అందరి శ్రమ శక్తీ, సమాజ శ్రేయస్సుకే ఉపయోగ పడుతుంది.

రాబిన్‌సన్ క్రూసో చేసిన పనులన్నీ వీళ్ళూ చేస్తారు. కాని ఒక చిన్న తేడా ఉంది. క్రూసో చేసింది వ్యక్తిగతం. తన కోసం. వీళ్ళు చేసేది సామాజిక ప్రయోజనాన్ని ఆశించి. అతడు పని చేసాడు. పని ఫలితాన్ని తన కోసమే

వాడుకున్నాడు-కాని వీళ్ళ శ్రమ సామాజిక ఉత్పత్తిలో భాగం. తాము చేసే శ్రమలో కొంత స్వంత అవసరం కోసముండదని కాదు. కాని ఎక్కువ భాగం సామాజిక ప్రయోజనం కోసం.

ఇలా చేసిన 'సామాజిక కృషి' లో మళ్ళీ ప్రతి వ్యక్తికీ భాగముంటుంది.

ఈ 'సామాజిక ఉత్పత్తి'ని ఎలా సభ్యుల మధ్య విభజిస్తారు. అనేది సామాజిక స్వరూపం, చారిత్రక దశల మీద ఆధారపడి ఉంటుంది.

ఇప్పుడు మనం సరుకుల ఉత్పత్తి దశతో పోల్చటానికి ఈ స్వేచ్ఛాజీవుల సామాజిక ఉత్పత్తిలో ప్రతి వ్యక్తికీ తన శ్రమ సమయానికి తగిన వాటా ఉంటుంది అనుకోవచ్చు.

అయితే శ్రమ సమయాన్ని ఎలా నిర్ణయించాలి?

సామాజిక అవసరాన్ని, లక్ష్యాన్ని బట్టి ఎవరు ఏ పని చెయ్యాలో నిర్ణయించబడుతుంది. ఆ తర్వాత 'ఎవరి అవసరమెంత' అన్న భావన ఆధారంగా పంపకం జరుగుతుంది.

ఈ ఉత్పత్తి వ్యవస్థలో వ్యక్తుల మధ్య సంబంధాలు పంపకం లెక్కలలో పెద్ద సంక్లిష్టత లేదు. ఇవి చాలా మౌలిక సంబంధాలు.

127. వాస్తవ ప్రపంచానికి ప్రతిబింబమే మత (విశ్వాసాల) ప్రపంచం.

సరుకుల ఉత్పత్తి మీద ఆధారపడిన వ్యవస్థలో ఉత్పత్తిదారులందరూ తమ ఉత్పత్తుల్ని సరుకులుగా విలువలుగా పరిగణిస్తారు. ఫలితంగా, ప్రైవేటు వ్యక్తుల శ్రమ అమూర్తమైన శ్రమగా మారిపోతుంది. (ఈ పుస్తకం రాసింది ఒక అమెరికన్ అని మనం గుర్తుంచుకోవాలి) ఇటువంటి సమాజ నిర్మాణానికి, క్రైస్తవ మత విశ్వాసాలు, దైవభక్తి సరిగ్గా సరిపోతాయి.

ప్రాచీన ఏషియన్ సమాజాల్లో కూడా ఉత్పత్తులు, సరుకులుగా మారినట్టుగా మనం గమనిస్తాం. అంటే వ్యక్తులు సరుకుల ఉత్పత్తిదారులుగా మారారు. కాని ఆ సమాజాలతో పాటే ఆ ఉత్పత్తి విధానమూ అంతరించాలి. ఆ రోజుల్లో వ్యాపార దేశాలు అని చెప్పుకోగలిగినవి బహు కొద్ది మాత్రమే.

ప్రాచీన నిర్మాణాలు వాటి బూర్జువా వ్యవస్థతో పోలిస్తే చాలా సింపుల్‌గా కనిపిస్తాయి. వాటిని అర్థం చేసుకోవటం కూడా సులభం.

వాటిలో మానవ సంబంధాలు పూర్తిగా తెగిపోలేదు. సమాజానికీ, మనిషికీ పేగు బంధం ఇంకా కొనసాగింది. ముఖ్యంగా ప్రాచీన ఆదివాసీ సమాజాల్లో ఈ రకమైన సంబంధాలకు చాలా ప్రాముఖ్యత ఉంటుంది.

అయితే, ఆ సమాజాల్లో ఉత్పత్తి అత్యంత ప్రాథమిక స్థాయిని దాటలేదు. అందువల్లనే మనుషుల మధ్య మనిషికీ, ప్రకృతికీ మధ్య సంబంధాలు కొనసాగాయి. ప్రకృతి ఆరాధన కొనసాగిందంటే సమాజం ప్రాథమిక దశలోనే ఉందన్నమాట.

మనుషుల మధ్య అర్థవంతమైన, హేతుబద్ధమైన సంబంధాలు ఏర్పడినప్పుడు మత ప్రభావం క్రమంగా తగ్గిపోతుంది.

128. సమాజం మనుగడ భౌతిక ఉత్పత్తి క్రమం మీద ఆధారపడి ఉంది. స్వేచ్ఛా మానవులు ఈ ఉత్పత్తిలో పాలుపంచుకోనంత కాలం మతపరమైన, మార్మికమైన ముసుగును సమాజం తొలగించుకోలేదు.

129. విలువ, దాని పరిమితి గురించి రాజకీయార్థశాస్త్రం విశ్లేషించలేదని కాదు. కాని, ఉత్పత్తి అయిన వస్తువు విలువను బట్టి శ్రమ, విలువ పరిమితిని బట్టి శ్రమ సమయం ఎందుకు లెక్కగట్టబడుతున్నాయో అని మాత్రం ప్రశ్నించలేదు.

దీనికి కారణం ఒక్కటే. ఉత్పత్తి విధానం మానవ సంబంధాలను నియంత్రిస్తున్నది- మనుషులు, ఉత్పత్తి క్రమాన్ని శాసించటానికి బదులు, అది వాళ్ళను శాసిస్తున్నది. ఉత్పత్తి స్వభావం ఇంతే అంటారు బూర్జువా మేధావులు.

క్రైస్తవాని కన్నా ముందుర ఉన్న మతాలను క్రైస్తవ మతాధికారులు తృణీకారంతో చూసినట్టే, పాత ఉత్పత్తి విధానాలను పరిహసిస్తారు బూర్జువా ఆర్థిక వేత్తలు.

130. మారకం విలువ అనేది ఆ వస్తువులో ఉన్న శ్రమను మార్పిడి చేసుకునే సామాజిక సాంప్రదాయం. అని అంగీకరించాం గనక ప్రకృతికిందులో ఏమీ భాగం లేదన్నమాటే. కాని కొందరు ఆర్థిక శాస్త్రవేత్తలు మారకం విలువ అనేది ప్రకృతిసిద్ధం అన్నట్టుగా వాదించారు.

131. వస్తువు సరుకుగా మారే ఉత్పత్తి క్రమం లేదా కేవలం మారకం కోసమే ఉత్పత్తి జరిగే క్రమం బూర్జువా వ్యవస్థలో మాత్రమే కొనసాగుతుంది. అయితే ఇది ఇటీవలి పరిణామమేమీ కాదు. ఇప్పుడున్నంత పరిణత స్థాయిలో లేకపోయినా, చరిత్ర విద్యార్థులందరికీ ఇది ఏదో ఒక రూపంలో సుపరిచితమే.

సరుకులకు అతీంద్రియ శక్తులు ఆపాదించటం కూడా కొత్తకాదు.

కాని తరువాతి కాలంలో ఇది ఊహించలేనంతగా వెర్రితలలు వేసింది.

అలా జరిగిన పరిణామమే డబ్బు మీద ఆధారపడిన ఆర్థిక వ్యవస్థ తొలి రోజుల్లో బంగారం, వెండిని డబ్బుగా పరిగణించినా, అవి సామాజిక సంబంధాలుగా కాక కేవలం ప్రకృతి సహజమైన వస్తువులుగానే పరిగణించబడ్డాయి (అయితే వీటికీ కొన్ని వింత సామాజిక లక్షణాలున్నాయి) ఆధునిక ఆర్థిక వ్యవస్థ, డబ్బు ప్రభావాన్ని నిరసిస్తుంది గాని, 'పెట్టుబడి'ని ఎందుకో తన కేంద్ర బిందువుగా చేసుకుంది. "కొలుకివ్వబడే లక్షణం భూమికి లేదు. అది సామాజిక పరిణామమే" అని ఆ ఆర్థివేత్తలెందుకు గ్రహించరు.

(ఇంకా ఉంది.)



## ప్రస్తుతం మా వద్ద అందుబాటులో ఉన్న విరసం, ఇతర ప్రచురణలు, వాటి ధరలు

### కథ, నవల, కవిత్వం, సాహిత్య విమర్శ

1. కొడవటిగంటి కుటుంబరావు - 7 (నవలలు) 250-00
2. కొడవటిగంటి కుటుంబరావు - 8 (నవలలు) 250-00
3. కొడవటిగంటి కుటుంబరావు - 9 (నవలలు, కథలు నాటికలు) 250-00
4. కొడవటిగంటి కుటుంబరావు - 11 (చరిత్ర వ్యాసాలు) 150-00
5. కొడవటిగంటి కుటుంబరావు - 12 (రాజకీయ వ్యాసాలు) 400-00
6. కొడవటిగంటి కుటుంబరావు - 13 (సంస్కృతి వ్యాసాలు) 300-00
7. కొడవటిగంటి కుటుంబరావు - 14 (సినిమా వ్యాసాలు-1) 300-00
8. కొడవటిగంటి కుటుంబరావు - 15 (సినిమా వ్యాసాలు-2) 250-00
9. కొడవటిగంటి కుటుంబరావు - 16 ఎ (సాహిత్య వ్యాసాలు-1) 300-00
10. కొడవటిగంటి కుటుంబరావు - 16 బి (సాహిత్య వ్యాసాలు-2) 300-00
11. కొడవటిగంటి కుటుంబరావు - 17 (తాత్విక వ్యాసాలు) 150-00
12. కొడవటిగంటి కుటుంబరావు - 18 (లేఖలు) 125-00
13. కె.వి.ఆర్. సాహిత్య వ్యాసాలు (మొదటి భాగం) 300-00
14. కె.వి.ఆర్. సాహిత్య వ్యాసాలు (రెండవ భాగం) 250-00
15. కె.వి.ఆర్. సాహిత్య వ్యాసాలు (మూడవ భాగం) 250-00
16. కె.వి.ఆర్. సామాజిక వ్యాసాలు (నాల్గవ భాగం) 300-00
17. కె.వి.ఆర్. మహోదయం 200-00
18. వసంతగీతం (అల్లం రాజయ్య) 250-00
19. కొమురం భీం (అల్లం రాజయ్య) 150-00
20. సృష్టికర్తలు (అల్లం రాజయ్య) 150-00
21. సాహిత్య సమాలోచన (కృష్ణాబాయి) 300-00
22. భావవిప్లవకారుడు కొకు 80-00
23. కొకు సమకాలీనత - విశ్లేషణా వ్యాసాలు 50-00
24. అక్షరతుణీరం (కె.వి.ఆర్. సాహిత్య విమర్శ వ్యాసాలు) 20-00
25. సుబ్బారావు పాణిగ్రాహి కవిత్వం, పాటలు 25-00
26. అంతస్సూత్రం (వరవరరావు కవిత్వం) 40-00
27. బీజభూమి (వరవరరావు కవిత్వం) 100-00
28. గుమ్మెటమోత (పాణి నవల) 100-00
29. కలిసి పాడాల్సిన గీతమొక్కటే (పాణి కవిత్వం) 10-00
30. చలసాని ప్రసాద్ రచనలు 100-00
31. దండకారణ్య కథలు (2005-2012) 125-00
32. తెలుగు భాష - కొన్ని సంగతులు (వి.చెంచయ్య) 15-00
33. సామాజికం (వి. చెంచయ్య) 30-00
34. సాహిత్యధోరణులు - విప్లవ దృక్పథం 30-00
35. కథల పంట-3 120-00
36. కదిలే కథ 80-00
37. తీత్వాల్ కుక్క, మరికొన్ని కథలు (సాదత్ హసన్ మంటో) 60-00
38. జాజిపూల పరిమళం (షహీదా కథలు) 150-00
39. ఒక మాట, ఒక సంభాషణ (షహీదా కవిత్వం) 75-00
40. సామాన్యుల సాహసం (నిత్య, మైనా, సుజాత కథలు) 60-00
41. ఫాల్గుణ (పద్మకుమారి నవలిక) 30-00
42. లాల్‌బనో గులామీ ఛోడో బోలో వందేమాతరం (ఎన్కె దీర్ఘ కవిత) 25-00
43. తెహెల్కా అద్దంలో సర్కారు బింబం మరికొంత కవిత్వం (బాసిత్) 100-00
44. ఆఖరి బిడ్డ (బాసిత్ నాటిక) 10-00
45. కిటికీ పిట్ట (పి. మోహన్ కవిత్వం) 10-00
46. మంజీరా మూడ్స్ (మంజీరా కవిత్వం) 25-00
47. కవితా ఝుంకార్ (విరసం కవితా సంకలనం) 75-00
48. ఎర్రనక్షత్రం (చైనా నవల) 50-00
49. నెగడు (కథలు) (నల్లూరి రుక్మిణి) 90-00
50. పరామర్శ (నల్లూరి రుక్మిణి) 80-00
51. ఒంద్రుమట్టి (నవల) 170-00
52. Wake of Telangana? - A docu-drama by Basith 10-00
53. యంత్రాల మధ్య 35-00
54. అక్షర కిరణం (కె.వి.ఆర్.) 50-00
55. డావిన్సి (మోహన్) 150-00
56. మార్క్సిస్టు సాహిత్య విమర్శ (డా. శ్రీనివాస్) 100-00
57. అగ్నిశిఖ 80-00
58. కార్మిక వర్గ పుత్రుడు 70-00
59. బలహీనుడి బలం 25-00
60. పాలమూరు వలస బతుకు చిత్రాలు - గీతాంజలి 150-00
61. ఏది నేరం?! (హజారీబాగ్ జైలు గాథలు) - బి. అనూరాధ 75-00
62. వెలుగు రవ్వల జడి (ఆలూరి భుజంగరావు) 70-00
63. అరణ్య పర్వం (ఆలూరి భుజంగరావు) 120-00
64. ప్రజలు అజేయులు (ఆలూరి భుజంగరావు) 25-00
65. నైనా (ఆలూరి భుజంగరావు) 50-00
66. గమ్యం దిశగా గమనం (ఆలూరి భుజంగరావు) 30-00
67. దిక్కు, మొక్కు లేని జనం (ఆలూరి భుజంగరావు) 30-00
68. సాహిత్య వ్యాసాలు (చలసాని ప్రసాద్) 100-00
69. కలం యోధుడు చెరబండరాజు (వి. చెంచయ్య) 20-00
70. ఫాలింగ్ (నల్లూరి రిక్మిణి కథ) 20-00
71. దండకారణ్య కథలు (2013-2015) 70-00
72. లొంగిన ప్రతిసారీ (కిరణ్ కవిత్వం) 50-00
73. చిగురించే పాదం (మేడక యుగంధరరావు కవిత్వం) 40-00
74. అమర శ్రుతి (వరంగల్ యూనిట్ కవిత్వం) 25-00
75. మందిపాట ఒరవడిలో (సిటీయూనిట్ కవిత్వం) 40-00
76. కాశీం కవిత్వం 140-00
77. తెలంగాణ సాహిత్య వ్యాసాలు (కాశీం) 140-00
78. కవిత్వంతో మూలాఖత్ (ఎన్.వేణుగోపాల్) 120-00
79. వెలివాడె తొలిపొద్దై 70-00
80. విప్లవ స్వాప్నికుడు కా. రవూఫ్ 50-00
81. దండకారణ్య కథలు (2013-2015) 70-00
82. నల్లమల (పి.చంద్) 225-00
83. అబూజ్‌మడ్ (పాణి) 50-00
84. మేమున్నాం (పాలమూరు అధ్యయన వేదిక) 60-00

85. నదీ బాల్యం (రివేరా) 30-00
86. ఏప్రిల్ పండు (రివేరా) 30-00
87. పిల్లనగ్రోవి తుఫాన్ (డి. ఉదయభాను) 20-00
88. ఒక ఆకుపచ్చని కల (కెనరి) 40-00
89. లక్ష్మింపేట (విరసం) 25-00
90. వివేచన (వి. చెంచయ్య) 50-00
91. సుబ్బారావు పాణిగ్రాహి (విరసం) 25-00
92. కలిసి పాడాల్సి గీతం ఒక్కటే (పినాకపాణి) 10-00
93. అవ్వజెప్పిన తొవ్వ (శాఖమూరి రవి) 10-00
94. పోస్టుమార్టం రిపోర్టు (వడ్డెబోయిన శ్రీనివాస్) 10-00
95. విప్లవ సాహిత్య విమర్శ (విరసం) 25-00
96. ఎదురగ్గి (నవల) కనుంపల్లి రాజారాం 100-00
97. చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం-1 270-00
98. ముడిమనిషి (అరుణతార కథలు 1) 30-00
99. చేపలు (అరుణతార కథలు 2) 30-00
100. కథ అడ్డం తిరిగింది (అరుణతార కథలు 3) 30-00
101. కో...బలి (అరుణతార కథలు 4) 30-00
102. అడవిలోని వెన్నెల (అరుణతార కథలు 5) 30-00
103. నెలవు (అరుణతార కథలు 6) 30-00
104. ఒక వీరుడు మరణిస్తే (అరుణతార కథలు 7) 30-00
105. బదిలీ (అరుణతార కథలు 8) 30-00
106. అరణ్య పర్వం (అరుణతార కథలు 9) 30-00
107. పద్మ (అరుణతార కథలు 10) 30-00
108. విప్లవంలో మాతృత్వం (అరుణతార కథలు 11) 30-00
109. కొండపందికొక్కు (అరుణతార కథలు 12) 30-00
110. ఓడిపోయిన కథలు (అరుణతార కథలు 13) 30-00
111. దాడి (అరుణతార కథలు 14) 30-00
112. తుఫాను (అరుణతార కథలు 15) 30-00
113. కొండవాగు (అరుణతార కథలు 16) 30-00
114. డిసెంబరు ఆరు కథ (అరుణతార కథలు 17) 30-00
115. భూమి (అరుణతార కథలు 18) 30-00
116. ఫ్యూచర్ (అరుణతార కథలు 19) 30-00

## సంస్కృతి, చరిత్ర, రాజకీయార్థిక, సైద్ధాంతిక రచనలు

1. సామ్రాజ్యవాద సంస్కృతి (జేమ్స్ పెట్రాస్ వ్యాసాలు) 125-00
2. మావో రచనలు - 1 220-00
3. మావో రచనలు - 2 220-00
4. రివిజనిజం (మావో) 75-00
5. మార్క్సిజం, లెనినిజం, మావోయిజం 170-00
6. మార్క్సిస్టు తత్వశాస్త్రం 80-00
7. చారుమజుందార్ 8 డాక్యుమెంట్లు 50-00
8. మంద్రస్థాయి యుద్ధం 100-00
9. విద్యార్థి యువజనోద్యమాలు (లెనిన్) 30-00
10. రాజకీయ కృషి - మన కృషి అంతటికీ జీవనాడి (చైనా విప్లవోద్యమన పత్రిక హాంకీ వ్యాసాలు) 35-00
11. నక్సల్బరీ వెలుగులో (భారతదేశ నక్సలైట్ ఉద్యమ చరిత్ర) 180-00
12. జగిత్యాల జంగల్‌మహల్ (1) 75-00
13. జగిత్యాల జంగల్‌మహల్ (2) 100-00
14. స్టోలిపిన్ అభివృద్ధి నిరోధక కాలంలో 15-00
15. అంతర్జాతీయ విప్లవోద్యమాల్లోని ఆటుపోట్లు 60-00
16. భారతదేశంలో ఉత్పత్తి విధానం - ఉత్పత్తి సంబంధాలు 20-00
17. ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయోత్పత్తి సంబంధాలు 30-00
18. నేటి రాయలసీమ 100-00
19. గతాన్ని సమీక్షించుకుందాం 50-00
20. చూటే ఏరిన రచనలు 125-00
21. మావో సే టుంగ్ 80-00
22. గెరిల్లా యుద్ధం 60-00
23. చైనా ప్రజా విముక్తి సైన్యం 40-00
24. భూమి సంస్కృతి నాగరికత 15-00
25. స్త్రీవాద ఉద్యమం (అనురాధ గాంధీ) 25-00
26. కొత్త చూపు (ఆర్.ఎస్. రావు) 120-00
27. అభివృద్ధిని ఇలా చూద్దాం (ముదునూరి భారతి) 80-00
28. In Search of Method (Mudunuri Bharati) 200-00
29. On Education (Mudunuri Bharati) 180-00
30. Crisis and Development in Marxian Frame Work (Mudunuri Bharati) 80-00
31. Individual, Sub-Groups, Groups and Freedom (Mudunuri Bharati) 75-00
32. Methodology of Social Enquiry (Mudunuri Bharati) 150-00
33 Fifty Years of Andhra Pradesh 1956-2006 300-00
34. జనతన సర్కార్ కావాలి మేక్ ఇన్ ఇండియా కాదు 15-00
35. విద్యార్థి ఉద్యమాల్లో విప్లవ దిద్దుబాటు 30-00
36. జాతుల సమస్య రిజర్వేషన్లు కార్మిక వర్గ దృక్పథం 25-00
37. తత్వశాస్త్రం మాయాజాలం కాదు 20-00
38. వైరుధ్యాలు 20-00
39. చైనా తాత్విక రంగాన మూడు ప్రధాన పోరాటాలు 1949-64 20-00
40. జనతన రాజ్యం (పాణి) 300-00
41. మార్క్సిస్టు మహోపాధ్యాయుల జీవన రేఖలు 20-00
42. దండకారణ్య సాంస్కృతికోద్యమ చరిత్ర (పునర్ముద్రణ) 100-00
43. సీమ గొంతుక వినండి (అరుణ్ వ్యాసాలు) 70-00
44. ఈలం విముక్తి పోరులో మహిళలు 50-00
45. సామ్రాజ్యవాద దోపిడి మండలాలు (రత్నమాల) 50-00
46. డిటెన్యూ డైరీ (కె.వి.ఆర్.) 170-00
47. సమగ్ర తెలంగాణ (సంపాదకులు - ఎన్. వేణుగోపాల్) 295-00
48. విప్లవ పథంలో వరంగల్ విద్యార్థి ఉద్యమం (విరసం) 40-00
49. వామపక్ష కమ్యూనిజం-ఒక బాలారిష్టం (ఎన్.వి.ఎస్. నాగభూషణ్) 30-00
50. ఐక్య సంఘటన (దిక్సూచి) 35-00
51. బాలగోపాల్ తాత్విక గందరగోళం (సమీర్) 50-00

## వర్తమాన సమాజం, ప్రజా ఉద్యమాలు

| | | |
|---|---|---|
| 1. | ముజఫర్‌నగర్ మరో మానని గాయం | 20-00 |
| 2. | ఆకాష్ ఉద్యమ అమరులు | 10-00 |
| 3. | దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | 60-00 |
| 4. | ఉద్యమ ఆకాశంలో సగం | 15-00 |
| 5. | తూర్పు మధ్య భారతంలో విస్థాపన-ప్రజా ప్రతిఘటన | 20-00 |
| 6. | జనతన జైత్రయాత్ర | 20-00 |
| 7. | ఫిలిప్పైన్స్ ఉద్యమం | 15-00 |
| 8. | ఖైదీల సైరన్ | 60-00 |
| 9. | విముక్తిబాటలో నారాయణపట్నా | 50-00 |
| 10. | అంతర్యుద్ధంలో ఆదివాసులు | 30-00 |
| 11. | నిత్య జీవితంలో సోషలిజం (భూసారం శివన్న) | 100-00 |
| 12. | ఆకుల భూమయ్య రచనలు | 40-00 |
| 13. | అమలు కానీ హామీల చరిత్ర (శశికళ) | 100-00 |
| 14. | ది ఫ్లేమ్స్ ఆఫ్ నారాయణ పట్నా | 60-00 |
| 15. | దాక్షిణ్య వాదం నుంచి దండకారణ్యం దాకా (రత్నమాల) | 200-00 |
| 16. | నూతన సంభాషణ (రత్నమాల) | 80-00 |
| 17. | జర్నలిజం ప్రొఫెషన్ (రత్నమాల) | 50-00 |
| 18. | సాహిత్య ధోరణులు విప్లవ ధోరణులు | 30-00 |
| 19. | ప్రాణహిత (అల్లం నారాయణ) | 150-00 |
| 20. | గ్రీన్‌హంట్ ఉత్పాదాలు (విరసం) | 25-00 |
| 21. | ఆకాసంలో సగం పా. సగం మహిళ విముక్తి (విరసం) | 35-00 |
| 22. | లాంగ్ మార్చ్ (తెలంగాణ జర్నలిస్టులు) | 100-00 |
| 23. | పచ్చని బతుకులపై నిప్పులు కురుస్తున్న రాజ్యం (బిడి దమయంతి) | 15-00 |
| 24. | కృష్ణానది నీళ్ళు (ఎం. రాఘవచారి) | 20-00 |
| 25. | మండుతున్న గాయాలు (బిడి దమయంతి) | 40-00 |
| 26. | సముద్రంలో సంభాషణ (పి. వరలక్ష్మి) | 20-00 |

## స్మృతి సాహిత్యం

| | | |
|---|---|---|
| 1. | ఖాన్‌దాదా (ఎం.టి.ఖాన్ స్మృతి) | 10-00 |
| 2. | ఆదర్శజీవులు అమరులు | 30-00 |
| 3. | గంటి ప్రసాదం రచనలు | 25-00 |
| 4. | సూర్యుడు మరణించడు | 60-00 |
| 5. | చిరునవ్వు సితార | 80-00 |
| 6. | గెరిల్లా డైరీ | 10-00 |
| 7. | మన్యం వెలుగులు | 15-00 |
| 8. | అక్షర కిరణం | 20-00 |
| 9. | అడవి పుత్రుడు మంగన్న | 10-00 |
| 10. | గజ్జెల సరోజ | 15-00 |
| 11. | మహిత | 10-00 |
| 12. | కోటి జ్ఞాపకాలు | 50-00 |
| 13. | అమరుల యాదిలో | 50-00 |
| 14. | అమరుల జీవిత చరిత్ర | 30-00 |
| 15. | వేగుచుక్కల వెలుతురులో | 10-00 |
| 16. | లంకపల్లి అమరులకు విప్లవ జోహార్లు | 10-00 |
| 17. | శారద స్మృతి శకలాలు | 30-00 |
| 18. | దండకారణ్యంలో చలసాని ప్రసాద్ | 10-00 |
| 19. | సాహసయోధురాలు (గజ్జెల సరోజ రచనలు) | 40-00 |
| 20. | అమరుడు కామ్రేడ్ సంజయ్ | 10-00 |
| 21. | రైజింగ్ సన్ (సూర్యం స్మృతి) | 20-00 |
| 22. | అజ్ఞాత విప్లవ యోధుడు కొండన్న (దిక్సూచి) | 50-00 |
| 23. | పువ్వర్తి అమరులు (దిక్సూచి) | 20-00 |
| 24. | చిరునవ్వు సితార (విరసం) | 70-00 |
| 25. | కా॥ సహస గెరిల్లా యోధుడు మాసా (దిక్సూచి) | 50-00 |
| 26. | కె. దాసారావు కనకచారి (దిక్సూచి) | 10-00 |
| 27. | మృత్యుంజయులు మొద్దుగుట్ట అమరులు | 20-00 |
| 28. | బొట్టెం అమరుల జీవిత చరిత్ర (అమరుల బంధుమిత్రుల సంఘం) | 40-00 |
| 29. | గెరిల్లా అమ్మ (అమరుల బంధుమిత్రుల సంఘం) | 20-00 |
| 30. | కన్నబిడ్డల కలల యాది (అమరుల బంధుమిత్రుల సంఘం) | 20-00 |
| 31. | దండకారణ్య విప్లవ మహిళ కా॥ హేమ్లాలచ్చి (దిక్సూచి) | 10-00 |
| 32. | ప్రజాయుద్ధ వీరుడు కా. నగేష్ (దిక్సూచి) | 10-00 |

## డివిడిలు

| | | |
|---|---|---|
| 1. | అరుణతార సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక (1977-2013) | 125-00 |

---

*మా ప్రచురణలు లభించే పుస్తక కేంద్రాలు :*

***నవోదయ బుక్ హౌస్,***

*ఆర్యసమాజ్ ఎదురుగా, కాచిగూడ చౌరస్తా,*

*హైదరాబాద్‌లోనూ లభిస్తాయి. ఫోన్ : 040-24652387*

***నవ తెలంగాణ,***

*1-1-187/1/2, చిక్కడపల్లి, హైదరాబాదు-500020.*

*ఫోన్ : 040-27608107, 9490099373*

***అనేక బుక్ స్టాల్,***

*30-5-26/1, కోకా చలపతిరావు స్ట్రీట్, ఏలూరు రోడ్,*

*విజయవాడ-520002. ఫోన్ : 8977493465*

---

# -: స్వీకారం :-

| | | |
|---|---|---|
| గుజరాత్ ఫైల్స్<br>దుర్మార్గ పాలపై రహస్యనేత్రం<br>రానా అయ్యూబ్<br>ప్రచురణ :<br>మలుపు ప్రచురణ<br>వెల : రు. 130/-<br>పేజీలు : 176 | ఎండ్లూరి సుధాకర్<br>కావ్యత్రయం<br>కొత్త గబ్బిలం, వర్గీకరణ, గోసంగి<br>ప్రచురణ :<br>మానస & మనోజ్ఞ<br>ప్రచురణలు<br>వెల : రు. 150/-<br>పేజీలు : 158 | ఖగోళ శాస్త్ర చరిత్ర<br>డా. వి. శ్రీనివాస చక్రవర్తి<br>ప్రచురణ :<br>పీకాక్ బుక్స్<br>వెల : రు. 100/-<br>పేజీలు : 158 |
| గణిత గారడీలు<br>యూకోవ్ పెరెల్మాన్<br>తెలుగు :<br>డా.వి. శ్రీనివాస చక్రవర్తి<br>ప్రచురణ :<br>పీకాక్ బుక్స్<br>వెల : రు. 60/-<br>పేజీలు : 94 | బాటసారి<br>శరత్‌చంద్ర ఛటర్జీ<br>ప్రచురణ :<br>పీకాక్ బుక్స్<br>వెల : రు. 40/-<br>పేజీలు : 62 | మిస్సమ్మ<br>బెంగాలీ మూలం :<br>రబీంద్రనాథ్ మైత్రా<br>తెలుగు : చక్రపాణి<br>ప్రచురణ :<br>పీకాక్ బుక్స్<br>వెల : రు. 40/-<br>పేజీలు : 64 |
| డిసెంబరు ఆరు కథ<br>అరుణతార కథలు<br>(1993-94)<br>సంకలనం - 17<br>ప్రచురణ :<br>చరిత<br>వెల : రు. 30/-<br>పేజీలు : 96 | భూమి<br>అరుణతార కథలు<br>(1994)<br>సంకలనం - 18<br>ప్రచురణ :<br>చరిత<br>వెల : రు. 30/-<br>పేజీలు : 96 | ఫ్యూచర్<br>అరుణతార కథలు<br>(1994-96)<br>సంకలనం - 19<br>ప్రచురణ :<br>చరిత<br>వెల : రు. 30/-<br>పేజీలు : 96 |

**ARUNATARA** RNI Regn.No.21152/72 Published on 21/11/2016 November 2016 Vol. : 44 Issue : 10
Hyderabad
A Literary and Cultural Telugu Monthly Journal of Viplava Rachayitala Sangham (VIRASAM - Revolutionary Writers' Association)

# అరుణతార నిర్వహణకు విరాళాలివ్వండి
# శాశ్వత నిధి ఏర్పాటుకు సహకరించండి

విప్లవ రచయితల సంఘం అధికార పత్రిక అరుణతార 1977 నవంబర్ నుంచి మాస పత్రికగా వస్తోంది. సాహిత్య సాంస్కృతిక సంస్థగా విరసం విప్లవ, విప్లవ సాహితోద్యమాల్లో నిర్వచించుకున్న తన రాజకీయ, సాహిత్య, మేధో పాత్రకు వాహికగా తెలుగు సమాజంపై ప్రభావం వేస్తున్నది. గత మూడు తరాలుగా ఎందరో రచయితల, బుద్ధిజీవుల ఆలోచనా వికాసానికి వేదికగా ఉన్నది. సాహిత్య పత్రిక అయినప్పటికీ సామాజిక, రాజకీయార్థిక, సిద్ధాంత విశ్లేషణలకు, చర్చలకు, అన్వేషణకు సృజనశీలమైన మాధ్యమంగా కొనసాగుతున్నది. నక్సల్బరీ శిశువుగా విరసం తాను ఎంచుకున్న విప్లవోద్యమ ప్రచార కర్తవ్యంలో అరుణతార పాత్ర గణనీయం. 1970లలో ఉత్తర తెలంగాణలో విప్లవోద్యమ పునర్నిర్మాణ దశ నుంచి ఇవాళ దేశవ్యాప్తంగా సాగుతున్న విప్లవ, ప్రజా పోరాట సంచనాలను అరుణతార తన శక్తినంతా వెచ్చించి అక్షరబద్ధం చేస్తున్నది. మరీ ముఖ్యంగా చత్తీస్ఘడ్‌లో సల్వాజుడుం దుర్మార్గాలు మొదలైనప్పటి నుంచి ఇవ్వాల్టి ఆపరేషన్ గ్రీన్‌హంట్ మూడో దశ, సాల్వాజుడుం రెండో దశ దాకా దండకారణ్య ప్రజా యుద్ధాన్ని, ప్రజారాజ్యాధికారాన్ని, ప్రత్యామ్నాయ రాజకీయ విధానాన్నీ, అక్కడ సాహిత్య, సాంస్కృక వికాసాన్నీ తెలుగు పాఠకులకు పరిచయం చేస్తున్నది, విశ్లేషిస్తున్నది. దండకారణ్య విప్లవోద్యమానికి సంఘీభావ హస్తాన్ని అందిస్తున్నది. ఈ పనిలో ఇతర ప్రజాస్వామిక పత్రికల పాత్ర కూడా ఉన్నప్పటికీ అరుణతార దాన్నే ఒక ప్రధాన కర్తవ్యంగా స్వీకరించింది. ఇటీవల పెరిగిపోయిన హిందూ ఫాసిస్టు ప్రమాదానికి వ్యతిరేకంగా లౌకిక, ప్రజాస్వామిక కంఠస్వరాన్ని బలంగా వినిపిస్తున్నది. వేర్వేరు సామాజిక ఉద్యమాల ఆకాంక్షలను ఎత్తిపడుతూ వాటి న్యాయబద్ధతను విశ్లేషిస్తున్నది.

ప్రజాఉద్యమాల్లోని కార్యకర్తల సృజనాత్మక వ్యక్తీకరణలకు అరుణతార అవకాశం ఇవ్వడం వల్ల వాళ్లలోంచి ఎందరో ప్రతిభావంతులైన ఆలోచనాపరులు, రచయితలు తయారువుతున్నారు. అరుణతార ఈ పని ఆది నుంచి చేస్తున్నది. అందువల్ల ఒక పక్క లబ్ధప్రతిష్టుల రచనలతోపాటు ఎప్పటికప్పుడు కొత్త గొంతులు అరుణతారలో వినిపిస్తుంటాయి.

అయితే మొదటి నుంచీ అరుణతార అనేక ఆర్థిక, నిర్వహణ సమస్యలను ఎదుర్కొంటున్నది. ఒక్కోసారి ఈ ఇబ్బందులు కాస్త తక్కువగా ఉన్నా, ఇటీవల తీవ్రమైన సంక్షోభాల మధ్య ఎప్పటికప్పుడు అభిమానుల, మిత్రుల అండదండలతో నడుస్తున్నది. గతంలో ఒకసారి అరుణతారకు విరాళాలు వద్దు.. చందాలు కట్టండనే ఆదర్శాన్ని కూడా అమలు చేసింది. అయితే నానాటికి పెరుగుతున్న ప్రెస్ ఛార్చిలు, నిర్వహణ ఖర్చులు మోయలేని భారమయ్యాయి. దీంతో రెండు నెల్లకో సంచిక వచ్చిన సందర్భాలూ ఉన్నాయి. అయితే పేజీలు పెంచి పాఠకులకు మరిన్ని రచనలు అందిస్తూ వచ్చాం.

ఈ అన్ని అనుభవాల దృష్ట్యా అరుణతారకు శాశ్వత నిధి తయారు చేయకుండా ఇక పత్రికను నాలుగు కాలాల పాటు నడపడం అయ్యేపని కాదని తేలింది. ఇంత కాలం అభిమానుల సహకారంతోనే నడుస్తూ వచ్చిన అరుణతార ఈసారి శాశ్వత నిధి కోసం మీ ముందుకు వచ్చింది. ఇవాళ ఉన్న విప్లవోద్యమ ప్రత్యేక పరిస్థితుల్లో అరుణతార అవసరం ఎంత ఉన్నదో పాఠకులకు తెలుసు. తెలుగు నేల మీద, దేశంలోని ఇతర ప్రాంతాల్లో, విదేశాల్లో ఉన్న అసంఖ్యాక విప్లవాభిమానులు తలా ఒక చేయి వేస్తే శాశ్వత నిధి సమకూరడం కష్టమేమీ కాదని మా నమ్మకం. దాంతోనే మీ ముందుకు వచ్చాం. విప్లవోద్యమ రాజకీయ, సాంస్కృతిక వేదిక అరుణతారకు మీవంతు విరాళాలు ఇవ్వాలని, ఇప్పించాలని కోరుకుంటూ...

డి.వి. రామక్రిష్ణారావు, అరుణతార సంపాదకుడు
పి. వరలక్ష్మి, విరసం కార్యదర్శి
**వరవరరావు, టి. కృష్ణాబాయి, సిఎస్ఆర్ ప్రసాద్, జి. కళ్యాణరావు, వి. చెంచయ్య,**
**అల్లం రాజయ్య, ఎం. రత్నమాల, సి. కాశీం, పాణి**

**విరాళాలు ఆన్‌లైన్‌లో పంపడానికి వివరాలు :**
**డి.వి. రామక్రిష్ణారావు, అకౌంట్ నెం. 10243583773, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (ఎస్.బి.ఐ.)**
**ఐ.ఎఫ్.ఎస్.సి. కోడ్ నెం. ఎస్.బి.ఐ.ఎన్.0007112, లాలాగుడ, సికింద్రాబాద్.**
**ఎం.ఓ.లు, డ్రాఫ్టలు, చెక్‌లు డి.వి. రామక్రిష్ణారావు పేరిట ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,**
**కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి, హైదరాబాద్ - 500 040 చిరునామాకు పంపగలరు.**

EDITED, PRINTED, PUBLISHED AND OWNED BY DUVVURI VENKATA RAMAKRISHNA RAO, PRINTED AT CHARITA IMPRESSIONS, DOOR NO: 1-9-1126/B, AZAMABAD, HYDERABAD – 500020, TELANGANA STATE, PUBLISHED AT 12-15-963, MANIKESWARNAGAR, OSMANIA UNIVERSITY CAMPUS, TARANAKA, HYDERABAD – 500007, TELANGANA STATE, EDITOR: DUVVURI VENKATA RAMAKRISHNA RAO.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M193 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | sharmila |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |